ఇప్పుడు ఆంధ్రదేశమంతటా విజయవంతంగా
ప్రదర్శించబడుతోంది !



# ఈ సంచికలో



ముఖచిత్రం : శ్రీరామరక్ష

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

గమనిక :

రాబోయే రెండు సంచికలలో శరత్ బాబు రచన 'దేవదాసు' పూర్తి నవల ప్రచురించబడును.


యువ సాలు చందా రు. 12-00

దీపావళి ప్రత్యేక సంచికతో రు.17-00

యువ వడపళని మద్రాసు - 26.



ఈ నెల 'యువ' చాలా ఆకర్షణీయంగా ఉంది. వ. పా. గారి ముఖచిత్రం ముద్దులు మూటకట్టుకొని మరులు కొల్పింది. కొడవటిగంటి కుటుంబరావు గారి 'అరుణోదయం', సుప్రభగారి 'రెండు ప్రపంచాలు' అను రెండు కథలు 'యువ' కు ఆణిముత్యాల్లాంటివి. యద్దనపూడి సులోచనారాణిగారి 'మీనా' సీరియల్ చాలా చురుకుగా సాగుతూ, పాఠకులకు ఆత్రుత కల్గిస్తుంది. ఈ నెల కార్టూన్స్ మమ్ములను కడుపుబ్బ నవ్వించాయి.

—బి. బాబురావు, సికింద్రాబాద్-25.

మార్చి నెల "యువ" లోని శ్రీ సాయిబాబా మణి విష్ణుమూర్తిగారి "విధి విలాసం" కథ చాలాబాగుంది. అందులో

వెంకటేశ్వరి పాత్ర నాకు బాగా నచ్చింది. శ్రీమతి అరెకపూడి (కోడూరి) కౌసల్యా దేవి "సంసార చక్రం" సీరియల్ కోసం, ఏప్రియల్ సంచిక కోసం ఎదురు చూడ వలసి వస్తోంది. అలాగే యద్దనపూడి సులోచనారాణి గారి "మీనా" చదువాలని కుతూహలముగా ఉన్నది. సత్యమూర్తి గారి కార్టూన్లు చాలా బాగున్నవి.

"యువ" లో మెచ్చుకో తగ్గది సంపాదకీయం.

—బొందిలీ గంగారాంసింగ్,
హైదరాబాద్-32.

ఈ నెల (మార్చి) యువ ముఖ చిత్రం 'వసంతవిలాసిని' చాల అందంగా వుంది. "మీనా" సీరియల్, కొడవటిగంటి కుటుంబరావుగారి సంక్షిప్త నవల చాల బాగున్నాయి. హైదరాబాదు నుండి యువ మద్రాసు మార్చుతున్నారంటే చాల విచారంగా వుంది. అయినా మద్రాసు నుండి చాల అందంగా ముద్రించబడి వస్తుందని ఎదురు చూస్తుంటాము.

—పి. తాతారెడ్డి, రావులపాలెం.

ఈ నెల యువ లోని కథలు "రెండు ప్రపంచాలు" "కుర్రదీ—కుక్క పిల్ల, అబ్బాయి—అగ్గిపుల్ల" ఈ రెండు కథలు చాల సహజంగా, పాఠకుల హృదయాన్ని హత్తుకునేలాగా ఉన్నాయి.

యద్దనపూడి సులోచనగారి "మీనా" సీరియల్ చదువుతున్న కొలది ఇంకా ఇంకా చదవాలనిపిస్తుంది. "మీనా" చాల దిట్టంగా మా మనసులో పునాదులు వేసు కుంటుంది.

—దాచేపల్లి రవీంద్రనాథ్, కరీంనగర్.

---






ఎక్కడ
లైఫ్‌బాయ్
వున్నదో అక్కడ
ఆరోగ్యం
వున్నది

లైఫ్‌బాయ్
మురికిలో గల సూక్ష్మ
క్రిములను కడిగివేస్తుంది

లింటాస్-L-61 77 TL

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# రోజంతా
# సుఖసంతోషాలలో
# మునిగితేలారా?




ఫాంటా ఆరంజి
రుచినేమందును?
మరిమరీ దాహం
కావాలని పించును!

ఫాంటా కోకా-కోలా కంపెనీవారి
ఉత్పత్తి

FANTA IS A REGISTERED TRADE MARK OF THE COCA COLA COMPANY

CMCF-1-152 TEL

# మీ ట్రాన్సిస్టర్లకై నమ్మదగినది

# ఎవరెడి నం. 1050

## ట్రాన్సిస్టర్లకై ప్రత్యేకంగా చేయబడిన రౌండ్ బ్యాటరీ– వాటిని సంరక్షిస్తుంది

* హెచ్చు కాలం ఒకే విధమైన శక్తి నిస్తుంది.
* హెచ్చు లీక్ నిరోధక శక్తిగలది— మీ ఖరీదైన ట్రాన్సిస్టర్ భాగాలను పాడుచెయ్యదు.
* స్పష్టమైన, ధ్వని వికలతలేని శబ్దగ్రహణ కలుగ జేస్తుంది.

'ఎవరెడి' నం. 1050 బ్యాటరీకొని మీ రేడియోనుండి ఎక్కువ ఆనందం పొందండి.






UC 3772A

రూ. 1.10
పన్నులు అదనం.

## ప్రతి రకపు ట్రాన్సిస్టర్ రేడియోకు తగిన 'ఎవరెడి' బ్యాటరీ ఉంది

# యువ

## సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 21 | మే, 1970 | సంచిక 4, 5




**1970-71** సంవత్సరానికి కేంద్రప్రభుత్వ బడ్జెటు వెలువడింది. ప్రతి రాష్ట్రానికీ, కేంద్రప్రభుత్వం ఆర్థిక సహాయం ఎంత చెయ్యబోతున్నదో, ఆ బడ్జెటులో సూచించడం జరిగింది.

అంతేకాదు; బడ్జెటు వెలువడిన తరువాత, నేషనల్ డెవలప్‌మెంట్ కౌన్సిలు సమావేశం జరిగింది. ఆ సమావేశంలో, వెనుకబడిన రాష్ట్రాల అభివృద్ధికి ఎంత సహాయం చెయ్యాలన్న విషయం కూడా చర్చించబడింది. ఈ చర్చలలో జరిగిన ఒక చిత్రసంఘటన ఏమిటంటే, వెనుకబడిన రాష్ట్రాలకు కేంద్రప్రభుత్వం ఎక్కువగా సహాయం చెయ్యాలని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వాదిస్తే, తమిళనాడు ముఖ్యమంత్రి అభ్యంతరం చెప్పడము; పైగా, సేలంలో ఉక్కు ఫాక్టరీని స్థాపించడానికి కేంద్రప్రభుత్వం అంగీకరించకపోతే, పంచవర్ష ప్రణాళిక 1970-71 కార్యక్రమాలకు తాను అంగీకరించననడం. ఇది నిజంగా విచిత్రమైన వాదన.

స్వాతంత్ర్యం రాకముందు, బ్రిటిషువారి పరిపాలనలో, మదరాసురాష్ట్రం లోని తమిళజిల్లాలూ, మదరాసు నగరమూ చాలా అభివృద్ధిపొందిన విషయం అందరికీ తెలిసినదే. స్వాతంత్ర్యం వచ్చిన తరువాతనూ, ఆంధ్రప్రదేశ్ అంటూ తెలుగువారికి ఒక ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన తరువాతనూ కూడా, తమిళనాడు రాష్ట్రం అత్యధికమైన అభివృద్ధిని పొందింది. ఈ అభివృద్ధికి కారణం, కేంద్రప్రభుత్వం యీ రాష్ట్రానికి చాలా ఎక్కువగా సహాయం చెయ్యటమే.

గత సంవత్సరం, తమిళనాడులోని కొన్ని తాలూకాలలో వర్షాలు సరిగా కురవకపొయ్యేసరికి, కాటకం ఏర్పడిందని పెద్ద అరుపులు అరచి, తమిళనాడు ప్రభుత్వం ఇరవై కోట్లరూపాయలను కరవుబాధితుల సహాయానికి అని కేంద్ర ప్రభుత్వం నుంచి లాగింది. ఈ ఇరవైకోట్ల రూపాయలలో పదవవంతుకూడా కరవునివారణ కార్యక్రమాలకు వినియోగపడకముందే, తమిళనాడులో పుష్కలంగా వర్షాలు కురిసాయి. రాష్ట్రం సుభిక్షమైంది. ఏ విధంగా ఖర్చయిందో కాని, ఆ ఇరవైకోట్ల రూపాయలుకూడా ఖర్చుపెట్టడం జరిగింది.

తమిళనాడులో కరవు అనేపేరుతో కేంద్రం, కోట్లకొలది రూపాయలను తమిళనాడు ప్రభుత్వానికి అర్పిస్తున్న రోజులలోనే, ఆంధ్రదేశంలో రెండు తుపాను దెబ్బలకు అయిదు జిల్లాలు నానాభీభత్సానికి గురిఅయాయి. దాదాపు వెయ్యిమంది ప్రజలు తుపాను దెబ్బకు చనిపోగా, కొన్నివేలఇళ్ళు ధ్వంసమయాయి. కొన్ని లక్షల ఎకరాలలోని పంటలూ, చెరకుతోటలూ, మామిడితోటలూ నాశనమయాయి. ఈ నష్టాన్నుంచి తేరుకోవడానికి, ఆ ప్రాంతంలోని ప్రజలకు అధమం పదేళ్లయినా పడుతుంది. అయినా, కరవుపేరుతో

తమిళనాడుకు ఇచ్చిన డబ్బులో సగంకూడా ఆంధ్రప్రదేశ్ కు కేంద్ర ప్రభుత్వం ఇవ్వలేదు.

ఇలాటి పరిస్థితిలో, ఆంధ్రప్రదేశ్ ను వెనుకబడిన రాష్ట్రాలలో ఒకటిగా పరిగణించి, కొద్దిపాటి సహాయాన్ని చెయ్యడానికి కేంద్రప్రభుత్వం బడ్జెటులో ప్రకటిస్తే, దానికి అభ్యంతరం చెప్పడం, సేలంలో ఉక్కు-ఫాక్టరీని పెట్టడానికి నిర్ణయించకపోతే పంచవర్ష ప్రణాళిక కార్యక్రమాలను తాను ఆమోదించ ననడంలో తమిళనాడు ముఖ్యమంత్రి ధోరణి చాలా విచిత్రం కాదా?

తమిళనాడు జనాభా, మూడుకోట్ల నలభై లక్షలు అయితే, ఆంధ్రప్రదేశ్ జనాభా మూడుకోట్ల అరవై లక్షలు. వైశాల్యంలో తమిళనాడుకు రెట్టింపు ఆంధ్రప్రదేశ్. జనాభాలోనూ, వైశాల్యంలోనూ తమిళనాడు కన్న పెద్దదైన ఆంధ్రప్రదేశ్, పారిశ్రామికంగా తమిళనాడులో మూడవవంతు అభివృద్ధినికూడా ఇంతవరకు పొంద లేక పోయింది. దీనికి కారణం, కేవలము తమిళనాడు పట్ల కేంద్ర ప్రభుత్వం పక్షపాతబుద్ధిని చూపడంతప్ప మరొకటికాదు. దీనికి ఉదాహరణగా, కేంద్రప్రభుత్వం స్థాపించిన పరిశ్రమలను తీసుకొందాము.

ఇప్పటివరకు కేంద్రప్రభుత్వం అన్ని రాష్ట్రాలలోనూ స్థాపించిన పరిశ్రమలలో పెట్టుబడి మొత్తం 2646 కోట్ల రూపాయలు. దీనిలో తమిళనాడులో స్థాపించిన పరిశ్రమల పెట్టుబడి 250 కోట్ల రూపాయలు అయితే, ఆంధ్రప్రదేశ్ లో స్థాపించిన పరిశ్రమల పెట్టుబడి 76 కోట్ల రూపాయలు మాత్రమే. అంటే, తమిళనాడు కన్న ఎక్కువ జనాభా, రెట్టింపు వైశాల్యంగల ఆంధ్రప్రదేశ్ లో, తమిళనాడులో పెట్టిన దానిలో మూడవవంతుకూడా లేదన్నమాట. అయినప్పటికీ, అన్ని వసతులూ వుండి, మేలిరకపు ముడిఇనుము పుష్కలంగా లభిస్తూ, మంచి ఉక్కు, తక్కువ వ్యయంతో ఉత్పత్తి

చెయ్యడానికి వీలుగా విశాఖపట్టణంలో ఉక్కు-ఫాక్టరీని ఎప్పుడో స్థాపించి వుండవలసిన కేంద్రప్రభుత్వం, దీనికీ రాజకీయాలకూ ముడి పెట్టడమూ, రాజకీయంగా తమకు ప్రస్తుతం వున్న సౌకర్యాన్ని ఉపయోగించుకొని, ఉక్కు-ఫాక్టరీని సేలంలో పెట్టించుకోవడానికి తమిళనాడు ప్రభుత్వం ప్రయత్నం చెయ్యడమూ, ఆంధ్రులకు తమ న్యాయమైన కోర్కెలుకూడా భగ్నం అవుతున్నాయనే నమ్మకాన్ని కలిగించక మానవు.

తమిళనాడు ముఖ్యమంత్రి ఏ ధీమాతో ఉక్కు-ఫాక్టరీని సేలంలో పెట్టమని అడిగారో, అంతకన్న ఎక్కువ ధీమాతోనే ఆంధ్ర ప్రజలు ఉక్కు- ఫాక్టరీని విశాఖపట్టణంలో పెట్టమని అడగవచ్చును. ఏమైయితేనేం, ఆంధ్ర, మైసూరు, తమిళనాడు రాష్ట్రాలు మూడిటి లోనూ ఒకొక ఉక్కు- ఫాక్టరీని స్థాపించడానికి నిర్ణయించబడిందని ప్రధానమంత్రి ప్రకటించారు. ఇది ముదావహమైన విషయమే. అయితే, ఇది ఆంధ్రులకు కన్నీటి తుడుపు మాత్రమే కాకుండా, నిజంగానే విశాఖలో ఉక్కు- ఫాక్టరీ నిర్మాణం జరిగేటట్లు చూడాలి. ఆంధ్రులు ఉదాసీనత చూపితే, యీ ఉక్కు- ఫాక్టరీ నిర్మాణం ప్రకటనతో మాత్రమే ఆగిపోవడం జరుగవచ్చును.

---

## చందాదారులకు విజ్ఞప్తి

యువ కార్యాలయం మద్రాసుకు మార్చిన కారణంగా ఏప్రియల్ 1970 సంచిక వెలువడలేదు. చందాదారుల చందాలు ఒక నెల పొడిగించబడును.

యువ కార్యాలయం
1, ఆర్కాట్ రోడ్
మద్రాసు-26




**1**

యాదవుడూ, మాధవుడూ సవతి బిడ్డలన్న విషయం వాళ్ళిద్దరే కాకుండా లోకులుకూడా ఏనాడో మరిచిపోవటం జరిగింది. తాను చాలా బీదవాడై వుండికూడా యాదవుడు తమ్ముడికి బి. ఎల్. దాకా చదువు చెప్పించాడు. తరవాత ఎంతో విశ్వప్రయత్నంమీద ఒక గొప్ప

ధనికుడి కుమార్తెను తనకు మరదలుగా తెచ్చుకున్నాడు. ఆ అమ్మాయి పేరు బిందు వాసిని. ఆమె తండ్రికి ఒక్కగా నొక్క కుమార్తె. అసాధారణమైన అందచందాలు కలది. ఆమె పదివేల రూపాయిల కట్నం తీసుకుని అత్తవారింటికి వచ్చినరోజున, ఆ ఇంటి పెద్దకోడలు అన్నపూర్ణ కళ్ళు ఆనందాశ్రువులతో నిండిపోయాయి.

ఆ ఇంట్లో అత్తా, ఆడబిడ్డల్లాంటి వాళ్ళెవరూ లేరు. అన్నపూర్ణే ఇంటి యజమానురాలు. ఆమె చిన్నతోడికోడలి చుబుకం పట్టుకుని లాలిస్తూ, "ఇంటికి కోడల్నంటూ తెచ్చుకోదలిస్తే, ఇలాంటి పిల్లనే తెచ్చుకోవాలి. లక్ష్మీస్వరూపం!" అని చూడవచ్చిన అమ్మలక్క లందరితో సగర్వంగా చెప్పుకున్నది.

ఆ తరవాత రెండుమూడు రోజులు గడిచేలోపలే అన్నపూర్ణ తన తోడికోడల్ని గురించి చాలా పొరబడిందని తెలిసిపోయింది. బిందువాసిని తన సౌందర్యానికీ, ధనానికీ నాలుగురెట్లు అహంకారమూ, దురభిమానమూ వెంటబెట్టుకుని వచ్చిందని అర్థమైపోయింది.

ఒక రోజున అన్నపూర్ణ, భర్త యాదవుణ్ణి చాటుగాపిలిచి, "రూపాన్నీ, రూకల్నీచూసి భ్రమపడి తమ్ముడికి చేసుకున్నారుగాని, ఈ పిల్ల అచ్చుతాచుపిల్లండీ!" అన్నది.

యాదవుడు ఆ మాట నమ్మక తలగోక్కుని, మూడునాలుగుసార్లు, "ఆఁ, ఏవిటీ? అలాగా! అలాగా!" అని కచేరీకి వెళ్ళిపోయాడు.

యాదవుడు చాలా నెమ్మదస్థుడు. అతడికి జమీందారుగారి కచేరీలో సముద్దారుపని. ఇంటివద్ద పూజార్చనలు క్రమం తప్పకుండా చేస్తూంటాడు. మాధవుడు అన్నకంటె పదేళ్ళుచిన్న. ప్లీడరీ పాసయి ఇప్పుడే ప్రాక్టీసు ప్రారంభించాడు.

భార్య ఏదో చెప్పివుంటుంది; మాధవుడు వదినె దగ్గిరకు మాడావిడిగా వచ్చి, "ఏం, వదినా! అన్నగారికి డబ్బే సర్వం అయిపోయిందా ఏం? రెణ్ణాళ్ళు ఓపికపడితే నేనూ నాలుగుడబ్బులు సంపాయిస్తాను," అన్నాడు.

అన్నపూర్ణ మరిది కేమీ జవాబు చెప్పలేదు.

బిందువాసిని అత్తవారింటికి వచ్చిన రెండు వారాల్లోనే, ఆమెను గురించి మహా విపత్కరమైన రహస్యం బయటపడిపోయింది. ఆమెకు మూర్ఛరోగం వున్నది, ఎవరైనా పల్లెత్తుమాట అన్నా సహించలేదు. ఈ సంబంధం చేసుకోవలసింది కాదన్న అభిప్రాయం ఆ ఇంట్లో అందరికీ కలిగింది—ఒక్క యాదవుడికి తప్ప.

యాదవుడు పూర్తిగా మరదలు పక్షం అయిపోయాడు. "మీరేం తొందర పడకండి; మరదలు నిజస్వభావం ఎలాంటిదో మీకే తెలిసి వస్తుంది. ఆమె భూదేవి

లాంటిది. అంత అందం, తెలివీ వట్టినే పోతుందా?" అన్నాడతను, భార్యతో తమ్ముడితో.

ఈ మాటల్లోని సందర్భశుద్ధి ఏమోగాని. ఒకరోజున ఏదో మాటపట్టింపుతో బిందువాసిని గదికి ఓ మూలచేరి మోహం ముడుచుకు కూర్చున్నది. అన్నపూర్ణకు గుండె బితుకు బితుకుమన్నది. ఆవిడ ఏమాలోచించిందో ఏమో, చప్పున పడక గదిలోకి పరిగెత్తి, తన ఏణ్ణర్థం బిడ్డ అమూల్యచరణుణ్ణి తీసుకొచ్చి, బిందువాసిని ఒళ్లో పడేసింది. బిడ్డనుచూస్తూనే బిందుముఖం వికసించింది. ఆమె పనివాణ్ణి భుజాన వేసుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది.

చాటునవుండి తోడికోడలి ప్రవర్తన గమనిస్తున్న అన్నపూర్ణకు తాను ఆమె వ్యాధికి దివ్యౌషధాన్ని కనిపెట్టినంతగా మురిసిపోయింది. పగలల్లా పనిపాటల్లో మునిగితేలే అన్నపూర్ణకు బిడ్డ ఆలనాపాలనా చూసేందుకు అంతగా అవకాశంలేదు. ఆ భారమంతా చిన్నకోడలు వహించింది.

ఓ నెల గడిచింది. ఒకనాటి ఉదయం బిందువాసిని, అమూల్యుణ్ణి చంకన వేసుకుని వంటింట్లోకివచ్చి, అన్నపూర్ణను, "అబ్బాయి పాలేవి, అక్కాయ్?" అని అడిగింది.

అన్నపూర్ణ చేసే చేసేపని ఆపి, "ఒక్కక్షణం ఆగమ్మా. కాగపెట్టి యిస్తాను," అన్నది భయపడుతూ.

బిందువాసిని ఆ జవాబువిని మండిపడి, "ఎనిమిదింటిలోపలే పాలుకాచి సిద్ధంగావుంచాలని నిన్నకూడా మరోసారి మీతో చెప్పాను," అని వంటావిడతో, "నీకు ఇంటిల్లిపాదికీ ఉడకవేసి పెట్టడానికి తొందరొచ్చిందా? పిల్లవాడి పాలసంగతి ఆమాత్రంకూడా గుర్తులేదా?" అన్నది కటువుగా.

"నీలాగా మాకు పిల్లాడికి బొట్టూ, కాటుక పెట్టటమే పనైతే అన్నీ జ్ఞాపకాలుంటై. ఒక్కనిమిషం ఓపికపట్టు," అన్నది అన్నపూర్ణ.

"ఓహో, అలాగా! అయితే యికనుంచి నువ్వు అమూల్యుడిపాలు ముట్టుకున్నావంటే, నామీద ఒట్టు. నేనుగనక వాడిపాలమాట నీతో చెప్పానంటే నీమీద ఒట్టు," అన్నది బిందువాసిని రుసరుసలాడుతూ.

తరవాత బిందువాసిని స్వయంగా పాలుకాచి పిల్లవాణ్ణి భుజానవేసుకుని వంటగదిలోంచి వెళ్ళిపోయింది. అన్నపూర్ణ ఆశ్చర్యం, బాధా పుట్టిపడేగొంతుతో, "విన్నావా, ఆమెమాటలు! ఒకరోజున నవ్వుతాలకు అన్నాను, అమూల్యుణ్ణి నువ్వే పెంచమని. ఆ ఆసరాతీసుకుని నామీద ఎంత ఒట్టుపెట్టిందో చూశావా?" అన్నది వంటావిడతో



**2**

నాలుగేళ్ళు గడిచిపోయినై. అమూల్యుడి అక్షరాభ్యాసం మహా ఆడంబరంగా జరిగింది. వంటపనుల్లో మునిగివున్న అన్నపూర్ణ దగ్గరకు బిందువాసిని వచ్చి, "అమూల్యుడు నమస్కారం చేయడానికి వచ్చాడు. ఒకసారి బయిటికిరా, అక్కయ్యా!" అన్నది.

అన్నపూర్ణ బయిటికివచ్చి అమూల్యుడి వేషంచూసి విస్తుపోయింది. కళ్ళకు

కాటుక, బుగ్గమీదబొట్టు, మెళ్లో బంగారుగొలుసు, పసుపుపచ్చరంగు ధోవతి, చేతిలో తాడుకు వేలుదుతున్న మట్టి నీరాబుడ్డి, చంకలో చుట్టబెట్టివున్న తాటాకులు—

"అక్కగారి పాదాలకు నమస్కరించు, నాయనా!" అన్నది బిందువాసిని.

అమూల్యుడు తల్లికి నమస్కరించాడు. అతడి వింతవేషం చూసి అన్నపూర్ణ నవ్వుతూ, "నీ తలలో ఎన్ని ఆలోచనలున్నాయే, చెల్లీ! అబ్బాయి బడికి వెళుతున్నాడా ఏమిటి?" అని అడిగింది.

బిందువాసిని నవ్వుతూనేవుంటూ, "గంగారాం పంతులుగారి బడికి పంపుతున్నాను. అబ్బాయిని ఆశీర్వదించు, అక్కా!" అని నౌకరు భైరవుణ్ణి, "భైరవా! అబ్బాయి నెవరైనా కొడతారేమో, జాగ్రత్తగా చూస్తూండమని పంతులుగారితో చెప్పు," అని ఆజ్ఞాపించి, "అక్కా! ఈ అయిదు రూపాయిలూ పెట్టి కొబ్బరి బెల్లం తెప్పించి పనిమనిషి చేత బడికి పంపించు," అంటూ అమూల్యుణ్ణి ఎత్తుకుని ముద్దు పెట్టుకుంటూ వెళ్ళిపోయింది.

అన్నపూర్ణ నేత్రాలు అశ్రుపూరితాలయాయి. ఆమె వంటావిడతో, "కన్న బిడ్డ కాకపోయినా బిందుకు కుర్రవాడిమీదే పంచప్రాణాలు. కడుపున పుట్టిన బిడ్డయితే మరెంతగా చూసుకునేదో," అన్నది.

అంతలో బిందువాసిని అక్కడికివచ్చి, "బావగారితో చెప్పి మన ఇంటిముందే బడి పెట్టించరాదా, అక్కా? ఆ ఖర్చంతా నేనే భరిస్తాను," అన్నది.

అన్నపూర్ణ నవ్వి, "వాడటు బడికి పోయాడో లేదో అప్పుడే నీకు కొత్త ఆలోచనలు వచ్చినయ్యా? వాడితోపాటు నువ్వూ బడికిపోయి కూర్చోరాదా," అన్నది.

బిందు సిగ్గుపడ్డట్టయి, "అక్కడ పిల్లకాయలంతా వట్టి అల్లరిమూక, ఒకవేళ కలంపెట్టి ఎవరైనా వాడికంట్లో పొడుస్తారనుకో. అప్పుడేం కావాలి?" అన్నది.

"అప్పుడు డాక్టరుకు చూపవచ్చులే. కాని—ఏడురాత్రులూ ఏడుపగళ్లూ ఆలోచించినా, యీ కలంపెట్టి కంట్లోపొడవటం అనేది నా మనసుకు తట్టనేతట్టదు. ఇంతమంది పిల్లలు బడికిపోతున్నారుగదా, ఎవర్నీ ఎవరు కలంపెట్టి కళ్ళల్లో పొడిచినట్టు వినలేదు," అన్నది అన్నపూర్ణ.

"నువ్వు వినలేదు గనక అలాంటి ఘోరాలు జరగవనా? సరే, నువ్వు బావగారితో అనిచూడు, ఆ తర్వాత ఏమవుతుందో చూద్దాం" అన్నది బిందువాసిని.

ఆనాటిరాత్రి పొద్దుపోయిం తరవాత యాదవుడు ఇంత నల్లమందు మింగి, హుక్కాగొట్టం నోట్లోపెట్టుకుని, నిషామీద సవారీచేస్తున్న సమయంలో, అతడికి

తలుపు గొళ్ళెం చప్పుడు వినబడింది. యాదవుడు అతి కష్టంమీద కళ్లు రెండూ తెరిచి, "ఎవరది?" అని అడిగాడు.

అన్నపూర్ణ గదిలోకి వెళ్ళి, "మీ మరదలు ఏదో చెప్పుకోవడానికి వచ్చింది, కొంచెం వినండి," అన్నది.

యాదవుడు ఆశ్చర్యపోయి, "మరదలా? ఏమిటమ్మా!" అన్నాడు.

యాదవుడికి మరదలంటే ఎక్కడలేని వాత్సల్యం. బిందువాసిని మాట్లాడ లేదు. ఆవిడతరఫున అన్నపూర్ణే, "ఈ విడ బిడ్డకంట్లో బడిపిల్లలు కలం పెట్టి పొడుస్తారట! అందుకని మన ఇంట్లోనే బడి పెట్టించ మంటున్నది," అని చెప్పింది.

యాదవుడు హుక్కాగొట్టం చప్పునవదిలి ఆత్రుతగా, "కంట్లో కలం పెట్టి పొడిచిందెవరూ? ఏడీ వాడు చూస్తాను," అన్నాడు.

అన్నపూర్ణ హుక్కాగొట్టం భర్తచేతికి అందించి, "ఇప్పటికింకా ఎవరూ పొడవలేదు—పొడిస్తే గిడిస్తే నన్నమాట!" అన్నది.

అప్పటికి యాదవుడు కొంచెం స్థిమితపడ్డాడు. అన్నపూర్ణ గదినుంచి బయిటికి వచ్చింది. బిందువాసిని తలుపుచాటుగా నిలబడి, "బైట అరుగుమీద బడి పెట్టిస్తే..." అన్నది చిన్నగొంతుతో.

"అదెంత పెద్దపనమ్మా. అయితే...ఆ బళ్లో చదువుచెప్పేదెవరు?" అన్నాడు యాదవుడు.

"పంతులుగారు యిక్కడే వున్నారు. నెలకో పదిరూపాయిలు యిస్తే యిక్కడే బడి పెడతా మంటున్నారు. నా కట్నంమీదవచ్చే వడ్డీలోంచి కొంతతీసి యివ్వవచ్చు..."

యాదవుడు తృప్తిపడ్డట్టుగా తలవూపుతూ, "సరే, రేపే ఏర్పాటు చేయిస్తా, అసలు గంగారాం పంతులు బడి యిక్కడికి మార్పిస్తేనే బావుంటుంది," అన్నాడు.

బావగారు సరే నన్న తర్వాత బిందువాసిని కోపమంతా మటుమాయమైంది. ఆమె ఉత్సాహంగా వంటగదికేసి వెళ్ళేసరికి అక్కడ అన్నపూర్ణ ముఖం ముడుచుకుని కూర్చుని వున్నది. ఆమె పక్కన కదంబిని—పనిమనిషి కూర్చుని చేతులు తిప్పుతూ ఏదో మాట్లాడుతున్నది.

బిందువాసిని కోపంగా కదంబిని కేసిచూస్తూ, "ఇక్కడెందుకు? వెళ్ళి నీ పనేదో చూసుకోరాదా," అన్నది.

కదంబిని భయపడుతూ లేచి వెళ్ళిపోయింది. బిందువాసిని రుసరుస లాడుతూ, "పెద్ద యజమానురాలికి సలహాదార్లుకూడా చాలా పెద్దవాళ్ళే దొరుకుతారు," అన్నది.

బిందు, అన్నపూర్ణను సంతోషంగా వున్నప్పుడు అక్కా అనీ, కోపం వచ్చి నప్పుడు యజమానురాలనీ పిలుస్తుంది. అన్నపూర్ణ ఆ మాటలకు కోపం తెచ్చుకుని, "నువ్వు ఎంత అదృష్ట జాతకురాలివో గాని, నువ్వంటే ఇంటిల్లి పాదికీ మోడల్," అన్నది.

"అయినా, నీకు మాత్రం భయం లేదుగా," అన్నది బిందువాసిని నవ్వుతూ.

"భయం లేకపోవటమా? కోపం వచ్చినప్పుడు నీ చండికా స్వరూపం చూసి, ఎవరి గుండె నీరు కాకుండా వుంటుంది? చెల్లీ, నువ్వింకా పసిదానివేమీ కాదు. పిల్లల్ని కనడం మొందలెడితే యీపాటికి నలుగురైదుగురు పిల్లల తల్లివయ్యే దానివి. మీ నాన్నగారు నిన్ను బాగా గారాబంచేసి పాడుచేశాడు," అన్నది అన్నపూర్ణ.

"నా అదృష్టాన్ని నువ్వు ద్వేషించి ఏం ప్రయోజనం, అక్కా! గారాబం చేసి పాడుచేసినవాడు నాన్నకాదు, తమరు!" అన్నది బిందువాసిని.

"నేనా?... నేను కాబట్టి యివన్నీ సహించగలుగుతున్నాను. మరొక రైతేనా..." అన్నది అన్నపూర్ణ కోపంతో తడబడుతూ.

అన్నపూర్ణ మాటలకు బిందువాసిని కిలకిల మంటూ నవ్వి, "నువ్వు సత్తె కాలపు మనిషివి, అక్కయ్యా! ఈకాలంలో పుట్టవలసిన దానివి కాదు," అని రెండు చేతుల్తో అన్నపూర్ణ మెడను పెనవేసి, "ఏదన్నా కథచెప్పు అక్కయ్యా!" అన్నది.

అన్నపూర్ణ కోపగించుకుని, "ఇక చాల్లే, నస్నోదులు!" అన్నది.

అంతలో కదంబిని అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "అబ్బాయి అడక త్తెరలో వేలుపెట్టి కోసుకుని ఏడుస్తున్నాడు," అన్నది.

బిందువాసిని చప్పున లేచి నిలబడి, "అడక త్తెర వాడిచేతిలోకి ఎలా వచ్చింది?" అంటూ పరిగెత్తుకుపోయి అమూల్యుణ్ణి భుజాన వేసుకుని, వేలికి తడిగుడ్డ చుట్టి సముదాయిస్తూ తీసుకువచ్చి, "అక్కా, నీకెన్ని సార్లు చెప్పాను. పిల్లా జెల్లా వున్న యిల్లు, కత్తులూ, కరార్లూ వాళ్ళకు అందకుండా దాయమని!" అన్నది.

"నీ బిడ్డ వేలు కోసుకుంటాడని, అడక త్తెర్ని ఇనప్పెట్లో పెట్టి తాళం వేయ మంటావా?" అన్నది అన్నపూర్ణ.

"అలా అయితే వీణ్ని రేపట్నుంచి తాడుతో కట్టివుంచుతాను. నీ గదిలోకి వెళ్ళే వీలే వుండదు," అన్నది బిందువాసిని.

"విన్నావా, కదంబీ, యీవిడ విచిత్రపు మాటలు..." అని అన్నపూర్ణ ప్రారంభించేసరికి, బిందువాసిని కోపంగా, "ఈ సంగతులన్నీ నౌకర్లతో చాకర్లతో

నువ్వు చెప్పటం ప్రారంభిస్తే, నేను అమూల్యుణ్ణి తీసుకుని మా పుట్టింటికి వెళ్ళిపోతాను," అన్నది.

"అలాగే వెళ్లు. నిన్ను మళ్ళీ రమ్మంటే ఒట్టు," అన్నది అన్నపూర్ణ.

"నేనిక్కడ వుండటం నీ కిష్టం లేదన్నమాట!" అంటూ బిందువాసిని గబగబా గదినుంచి బయటికి వెళ్ళిపోయింది.

రెండు గంటల తరవాత అన్నపూర్ణ తోడికోడలు గదిలోకి వెళ్ళింది. మాధవుడొక మూల కోర్టు కాయితాలు చూసుకుంటున్నాడు. బిందు అమూల్యుణ్ణి పక్కన పడుకోబెట్టుకుని ఏవో కథలు చెపుతున్నది.

"భోజనం చేద్దువు గానిరా!" అన్నది అన్నపూర్ణ.

"నాకేం ఆకల్లేదు," అన్నది బిందు.

అమూల్యుడు పినతల్లికి అతుక్కుపోయి, "మా అమ్మ భోంచేయదు, నువ్వు పో," అన్నాడు.

"నువ్వు నోరుముయ్యి!" అని అన్నపూర్ణ కొడుకును కసిరి, "వీడే కారణం యీ పోట్లాటల కన్నిటికీ. బాగా గారాన పెట్టి నెత్తికెక్కించుకుంటున్నావ్. తర్వాత తెలుస్తుంది. అక్క అన్నట్టే జరిగిందని!" అన్నది అన్నపూర్ణ.

బిందువాసిని అమూల్యుడి చెవిలో ఏదో చెప్పగానే, వాడు, "నువ్వు వెళ్ళే, అక్కాయ్! అమ్మ నాకు కథచెపుతున్నది." అన్నాడు.

"లేచిరా, తల్లీ. రాకపోతే మిమ్మల్నిద్దర్నీ రేపొద్దున్నే ఊరు పంపకపోతే నన్నీ పేరున పిలవద్దు!" అంటూ అన్నపూర్ణ చరచరా వెళ్ళిపోయింది.

"ఇక మాట్లాడకుండా వెళ్ళు. వదినె ఎంత కోపంగా వెళ్ళిందో చూశావా?" అన్నాడు మాధవుడు.

బిందువాసిని, అమూల్యుణ్ణి చంకన వేసుకుని నవ్వుతూ వంటగది కేసి వెళ్ళింది.

## 3

ఒక తల్లి ఆశ్రయంలో యిద్దరు బిడ్డలు పెరిగినట్టు, అమూల్యుణ్ణి ఆశ్రయించుకుని ఇద్దరు తల్లులు ఆరేళ్ళ కాలం యిట్టే గడిపేశారు. అమూల్యు డిప్పుడు ఎంట్రెన్స్ స్కూల్లో రెండవ తరగతి చదువుతున్నాడు.

ఒకనాటి ఆదివారం పొద్దున్నే ఇంటినుంచి బయటికి పోయి, భోజనం వేళ కూడా తిరిగి రాకపోయేసరికి బిందువాసిని అతడికోసం నౌకరు భైరవుణ్ణి పంపింది. గంటా గంటన్నర తరవాత భైరవుడు, అమూల్యుణ్ణి వెంటబెట్టుకుని ఇంటికి తిరిగి వచ్చాడు.



"ఇంతసేపూ ఎక్కడున్నావ్?" అని అడిగింది బిందువాసిని.

అమూల్యుడు తలవంచుకు వూరుకున్నాడు. భైరవుడు, "వీధి కాపు పిల్లలతో కలిసి బిళ్ళంగోడు ఆడుతున్నాడు," అని చెప్పాడు.

ఆ ఆటంటే బిందుకు తగని భయం. "బిళ్ళంగోడు ఆడవద్దని నీ కెన్నిసార్లు చెప్పాను!" అన్న దావిడ కోపంగా.

"నేనక్కడ నుంచునివుంటే, వాళ్ళే బలవంతాన " అంటూ అమూల్యుడు ఆగిపోయాడు.

"బలవంతం చేశారా? సరే, ముందు అన్నం తిను, తర్వాత చెపుతాను," అన్నది బిందువాసిని.

అమూల్యుడికి వడుగు చేసిన రోజున, బోడితల మీద టోపీ పెట్టుకోవడానికి పెద్ద మారాం చేశాడు. బిందు వదలకుండా అతడి నెత్తిన జరీ టోపీ పెట్టింది. అమూల్యుడు ఏడవటం మొదలెట్టాడు. మాధవుడు గదిలోకివచ్చి, అమూల్యుణ్ణి చూసి, "అరెరె, మధురా నగరి శ్రీకృష్ణుల వారై పోయావే!" అన్నాడు.

అమూల్యుడు సిగ్గుపడిపోయి, టోపీతీసి అవతల పారేసి, మంచం మీదికి పోయి బోర్లాపడుకున్నాడు. బిందు భర్త మీద కోపగించుకుని, "పిల్లవాడు అసలే ఏడుస్తూంటే, మీ వేళాకోళం ఏమిటి?" అన్నది.

అంతకు ముందొకనాడు యిలాంటి సంఘటనే మరొకటి చాలా మనస్తాపానికి దారితీసింది ఆ సంగతి గుర్తుకొచ్చి బిందువాసిని మండిపడుతూ, అమూల్యుణ్ణి మంచం మీంచి లేవదీసి, విసవ్రతో రెండేసి, అతడికి తొడిగిన మఖమల్ దుస్తులు విప్పదీసి వేయసాగింది మాధవుడు బయిటికి వెళ్ళాడు. అన్నపూర్ణ గదిలోకి వచ్చి, "మఖమల్ దుస్తులు విప్పేస్తున్నావే మమ్మా?" అని అడిగింది

బిందువాసిని, అమూల్యుణ్ణి వదిలి అన్నపూర్ణ పాదాలవద్ద మోకరించి చేతులు జోడిస్తూ, "మీ పాదాల మీదపడతాను, నువ్విక్కణ్ణించి వెళ్ళిపో, అక్కా. మీ అందరి మూలానా వాడి ప్రాణాలు కడబడుతున్నాయి," అన్నది.

ఆ మాటలకు అన్నపూర్ణ ఏమీ అనలేక స్థాణువులా నిలబడిపోయింది బిందు అమూల్యుడి చెవి పట్టుకుని ఒక మూలకు తీసుకుపోయి నిలబెట్టి, "నువు అల్లరి వెధవ్వి. నీకు శాస్తి తప్పదు. ఇవ్వాళల్లా యీ గదిలో నేవుండు—అక్కా, నువ్వు బయటికిరా తలుపు గొళ్ళెం పెడతాను," అని గది తలుపులకు బయట గొళ్ళెం పెట్టింది.

మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతాల అన్నపూర్ణ యిక నిలవలేక, "నిజంగా వాణ్ణి యీపూట అన్నం తిననివ్వవా, బిందూ? వాడి మూలంగా ఇంటిల్లి పాదీ పస్తుండవలసి వస్తుంది." అన్నది.

"వాళ్ళ ఇష్టం!" అన్నది బిందువాసిని.

"అదేం మాట, చెల్లీ! ఇంట్లో ఒక్కగా నొక్క బిడ్డ. వాడు పస్తుంటే మనందరి కెలా అన్నం సయిస్తుందో చెప్పు?" అన్నది అన్నపూర్ణ.

"అదంతా నాకేం తెలీదు," అన్నది బిందు మొండిగా.

"విను, అక్క మాట తీసెయ్యకు. ఇవాళ్టికి వాణ్ణి క్షమించు. వాడికేమైనా జబ్బుచేస్తే నువ్వే అనుభవించాల్సొస్తుంది," అన్నది అన్నపూర్ణ.

ఆ మాటల్తో బిందు కొంచెం మెత్తబడి, పనిమనిషి కదంబినిని పిలిచి, "పోయి వాణ్ణిలా తీసుకురా! అక్కా, నీకిదే చెప్పటం; ఇహ నా విషయంలో మీరు కలగ జేసుకున్నారంటే—బావుండదు," అన్నది.

ఆ గొడవ ఆ విధంగా సద్దుమణిగి పోయింది. తమ్ముడి ప్రాక్టీసు పెరిగిం తర వాత యాదవుడు ఉద్యోగం మానేసి, సొంత ఆస్తిపాస్తుల పనులు చూసుకో సాగాడు. మరదలు తెచ్చిన పదివేల రూపాయిల కట్నం వడ్డీకిచ్చి, రెట్టింపు చేశాడు. ఆ డబ్బులో కొంతా, మాధవుడి సంపాదనలో కొంతా పెట్టి, ప్రస్తుతం వుంటున్న ఇంటికి అరకోసు దూరంలో పెద్ద భవంతి కట్టించాడు. దుర్గాపూజ అయిం తరవాత అందులో ప్రవేశించాలని యాదవుడు ఆలోచించాడు.

వంద పనులున్నా సరే వదిలిపెట్టి, బావగారు భోజనం చేస్తున్నప్పుడు తలుపు చాటున కూర్చోవటం బిందువాసినికి అలవాటు. ఆవిడకు దేవుడిమీద ఎంత భక్తో, బావగారి మీద అంత భక్తి.

యాదవు డొకనాడు భోజనం చేస్తూ మరదలి నుద్దేశించి, "నీ భవంతి తయా రయిందమ్మా. ఒకసారి వెళ్ళి చూచుకురా. ఇంకేమైనా చేయవలసిన పనులున్న వేమో." అన్నాడు.

"ఇంకా చేయవలసిం దేమీలేదు," అన్నది బిందువాసిని.

యాదవుడు నవ్వి, "చూడకుండానే నిర్ణయాలా, అమ్మా. సరే, మరొక సంగతి. బంధు మిత్రు లందరినీ పిలిచి, శుభ ముహూర్తం చూసుకుని గృహప్రవేశం కావాలని వున్నది, ఏమంటావ్?" అన్నాడు.

"అక్కతో చెబుతాను, ఆమె ఇష్టం," అన్నది బిందు.

"ఆలాగే చెప్పు. మా ఇంటికి నువ్వు లక్ష్మివి. నీ యిష్టానుసారమే పనులన్నీ జరుగుతాయి," అన్నాడు యాదవుడు.

పక్కనే కూర్చునివున్న అన్నపూర్ణ నవ్వుతూ, "మీ లక్ష్మి శాంతం వహిస్తేనే!" అన్నది.

"శాంతం మాటకేం. మా అమ్మ సాక్షాత్ భూదేవి. దయతలిస్తే వరమా యిస్తుంది...అవసరం అయితే కత్తి ఎత్తుతుంది. అదే నేను కోరేది. మా అమ్మ వచ్చిం తర్వాత, ఇంట్లో కష్టాలంటూ లేకుండా పోయినై," అన్నాడు యాదవుడు.

"మీరన్న మాట నిజమే. చెల్లి రాకముందు మనరోజు లెలా గడిచాయో గుర్తుకొస్తే భయమేస్తుంటుంది," అన్నది అన్నపూర్ణ.

బిందు సిగ్గుపడి, ఆ ప్రసంగాన్ని అంతటితో ఆపదలిచి, "మీరు మనవాళ్ళం దర్నీ పిలవండి. ఇల్లు చాలా పెద్దదిగదా, వుండటానికి ఎలాంటి యిబ్బందీ వుండదు. ఇష్టమైనవాళ్ళు అయిదారు మాసాలైనా వుండొచ్చు," అన్నది.

"అలాగే నమ్మా రేపే మన బంధుగణాని కంతకూ ఆహ్వానాలు పంపు తాను," అన్నాడు యాదవుడు.

**4** యాదవుడికి, ఏలోకేసి అనే వేలు విడిచిన చెల్లెలొకామె వున్నది ఆమె కుటుంబం స్థితి అంతగా బాగులేనందున యాదవు డప్పు డప్పుడూ వాళ్ళకు ఆర్థికసహాయం చేస్తూంటాడు ఆ మధ్య ఒకసారి ఆమె కొడుకు నరేంద్రుడికి చదువు చెప్పిస్తాను, రావలసిందని ఉత్తరం రాశాడు. ఏలోకేసి ఉత్తరగ్రామం నుంచి కొడుకు నరేంద్రుణ్ణి వెంటబెట్టుకుని వచ్చింది ఆమె భర్త ప్రియనాధుడు కూడా వారం రోజులు తిరక్కుండానే బయలుదేరి వచ్చేశాడు

ఒకనాటి సాయంకాలం ఏలోకేసీ, అన్నపూర్ణా — అంతా వంటింటి వసారాలో కూర్చున్నారు. ఏలోకేసి తన కొడుకు అసాధారణ రూపాన్ని గురించీ, తెలివితేటల్ని గురించీ మాట్లాడ సాగింది.

"నువ్వే క్లాసురా చదువుతున్నది, నరేన్?" అని అడిగింది బిందువాసిని.

"ఫోర్తు క్లాను. రాయల్ రీడర్, గ్రామరు, జాగ్రఫీ, డిస్మల్ గిస్మల్— ఇంకా యిలాంటి వెన్నో వున్నాయి. అవన్నీ నీకేం తెలుస్తాయి, అత్తా!" అన్నాడు నరేంద్రుడు.

ఏలోకేసి ఓ సారి కొడుకుకేసి గర్వంగా చూసి, "ఒక పుస్తకం, ఒక గొడవా నటమ్మా! బండెడు పుస్తకాలు!" అని కొడుకుతో, "రేపు అవన్నీ పెట్టెలోంచి తీసి మీ అత్తల కొకసారి చూపు," అన్నది

ఇంతలో అమూల్యుడు పరిగెత్తుకుంటూ వచ్చి, బిందువాసిని ఒడిలో కూర్చున్నాడు. ఓ క్షణం ఆగి ఆమె మెడమీద చేయివేసి చెవిలో, "రేపు ఆదివారం— ఇవాళ్టికి పంతులుగార్ని వెళ్ళిపొమ్మని చెప్పవూ?" అన్నాడు.

బిందువాసిని నవ్వి, "వీణ్ణి చూశావా, ఏలోకేసీ! కబుర్లంటే చాలు, కదలడు. ఒసే, కదంబం! అబ్బాయి యివ్వాళ చదువుకోడుగాని, పంతులుగార్ని వెళ్ళిపొమ్మని చెప్పు," అన్నది

"మా నరేంద్రుడు చదువు సంధ్యల్లో మాత్రమే ప్రవీణుడనుకుంటున్నారేమో, నాటకాల్లో వేషాలు వేశాడంటే చూసేవాళ్ళ కళ్లు నీళ్ళతో నిండిపోవల



సిందే. ఒకసారి సీతామ్మ వారి వేషం వేశాడు ఆ సంభాషణ ఒకసారి మీ అత్తలకు వినిపించు, నాయనా!" అన్నది ఏలోకేని

నరేంద్రుడు వెంటనే మోకరించి, చేతులు జోడించి ముకుళితో, "హా, ప్రాణప్రియా! ఏ దుర్ముహూర్తాన మీ చరణదాని " అంటూ ప్రారంభించాడు

బిందువాసిని గాభరాపడి, "ఆగాగు, నరేన్! బావగారు గదిలో వున్నారు," అన్నది.

విన్న కాస్తకే ముగ్ధురాలైన అన్నపూర్ణ, "వింటే మాత్రం ఏమమ్మా! పురాణగాధ మంచి మాటలేగా," అన్నది.

బిందువాసిని అసంతృప్తిగా, "అ పురాణగాధ లేవో మీరు వినండి. మేం వెళ్లిపోతున్నాం," అన్నది.

"అయితే, అది ఆపేసి సావిత్రి పార్టు చెపుతా," అన్నాడు నరేంద్రుడు

"వద్దు," అన్నది బిందు

"సరే, ఆపెయ్ నాయనా. అత్తల కెప్పుడైనా దమయంతి దుఃఖిస్తూ పాడిన పాట వినిపించు. ఒకసారి వింటే వీళ్ళు వదిలిపెడతారేమో చూద్దాం," అన్నది ఏలోకేని.

"ఇప్పుడే పాడనా?" అన్నాడు నరేంద్రుడు.

కోపంతో బిందువాసిన ఒళ్లు మండిపోతున్నది. అది గ్రహించిన అన్నపూర్ణ, "వద్దులే! తరవాత పాడుదువుగాని," అన్నది.

"నేనీ పాట అమూల్యుడికి నేర్పుతాను. నాకు మద్దెల వాయించటం కూడా వచ్చు. తటకిత తగిటత వరస వాయించటం చాలా కష్టం, అత్తా! ఆ రాగిబిందె యిటివ్వు, వాయించి చూపెడతా," అన్నాడు నరేంద్రుడు

బిందువాసిని, అమూల్యుణి లేవమని సౌంజ్ఞ చేసి, అతడు కదలబోయేసరికి, "లే, గదిలో కెళ్ళి చదువుకో, బాబూ!" అన్నది.

"ఇంకా కాసేపు కూర్చుందాం, అమ్మా," అన్నాడు అమూల్యుడు.

బిందు ఏమీ అనకుండా అమూల్యుణ్ణి రెక్క పట్టుకు లేవదీసి, వెంటబెట్టుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది.

అన్నపూర్ణ నరేంద్రుడితో, "నాయనా, నువు చదువుసంధ్యలవీ బాగా నేర్చి మీ తల్లి కష్టాలు పడకుండా చూడు. అమూల్యుడితో అతిగా కలిసి మెలిసి తిరగకు. వాడింకా కుర్రవాడు, నీకన్న చాలా చిన్న," అన్నది.

ఈ మాటలు ఏలోకేశికి ఏమీ రుచించలేదు. ఆవిడ కోపంగా ముఖం పెట్టి, "అదీ నిజమే అన్నపూర్ణమ్మగారూ! పేదవాళ్ళ పిల్లలు పేదవాళ్ళ పిల్లలుగానే బతకాలి. అయినా మీవాడంత పనివాడైతే, మావాడేమంత ముసలాడా? మా వాడేమీ గొప్పవాళ్ళ పిల్లల్ని ఎరగడనుకున్నారా? వాళ్ళ నాటక కంపెనీలో ఎంత మంది రాజులు, రాజకుమారులు వున్నారో మీకేమైనా తెలుసా?" అన్నది.

అన్నపూర్ణ కలవెళపడిపోయి, "ఎబ్బెబ్బే, నేనలా అనటం లేదండీ నా అభిప్రాయం "

"ఇంకా అనేందుకేం వుంది మేము మాత్రం తెలుసుకోలేని మూర్ఖులం కాదు. నరేంద్రు డిక్కడే వుండి చదువుకుంటాడు రమ్మని అన్నయ్య ఉత్తరం రాస్తే వచ్చాం గాని, తిండికి లేక కాదు," అన్నది ఏలోకేశి

అన్నపూర్ణ దిగాలు పడిపోయి, "భగవంతుడి సాక్షిగా మిమ్మల్ని చులకన చేసి నేనేమీ మాట్లాడలేదమ్మా. బాగా చదువుకుని అమ్మ కష్టాలు యీడేర్చ మన్నాను," అన్నది.

"మంచిది మంచిది," అని ఏలోకేశి కొడుకుతో, "నువ్వు బయటికి వెళ్లి కూర్చో. పెద్దవాళ్ల పిల్లలతో కలిసిమెలిసి తిరక్కు," అని అక్కడించి లేచి పోయింది.

అన్నపూర్ణ విసుగ్గా లేచి తుఫానులాగా బిందు గదిలోకి వచ్చి, "నీకోసం

చుట్టరికాలు కూడా వదులుకోవాలా ఏమిటి? అమూల్యుణ్ణి అక్కణ్ణించి ఎందుకు లాక్కు వచ్చావో చెప్పు?" అన్నది.

బిందు ఏమీ తొణక్కుండా, "నా కోసం మీరు చుట్టరికాలు వదుకోవటం ఎందుకు, అక్కా? మీ బంధువులతో సుఖంగా వుండండి. నేను నా బిడ్డను తీసుకుని వెళ్లిపోతాను," అన్నది.

"ఆ వెళ్లే దెక్కడికో కాస్త చెబుదూ? నలుగురి ముందూ తలెత్తుకు తిరక్కుండా చేసిగాని నువ్వు వదలవని నాకు తెలుసు." అని అన్నపూర్ణ గదినుంచి బయిటికి వెళుతుండగా, మాధవుడు ఎదురయాడు. అన్నపూర్ణ అతడితో, "మరిది గారూ! మీరింకో చోటుకు వెళ్ళటమో లేక యీవిణ్ణి వదిలేయటమో చేయండి. ఈవిడ యిక్కడుంటే నేనీ ఇంట కాపరం చెయ్యలేను," అన్నది.

మాధవుడు ఆశ్చర్యపడి, "ఏమిటీ సంగతి?" అని భార్య నడిగాడు.

"నాకేం తెలియదు. మీవదినెగారు చెప్పిందిగా నన్ను వెళ్లగొట్టి వెయ్యమని!" అన్నది బిందువాసిని.

ఆ జవాబుకు మాధవుడు ఏమీ అనలేక టేబిల్ మీద వున్న పత్రిక తీసుకుని వసారా గదిలోకి వెళ్లిపోయాడు.

## 5

ఏలోకేసి చూపులకు సాధువులా కనిపించుతుంది. కాని అంతర్యంలో ఆమె చాలా కఠినురాలు, కుతంత్రాల్లో అందెవేసిన చేయి. పిల్లా పీచూ లేని బిందువాసిని వద్ద ధనం మూలుగుతున్నదన్న అనుమానం కలగ్గానే ఏలోకేసికి ఆమె మీద ఎక్కడ లేని ప్రేమాభిమానాలు పుట్టుకొచ్చినై.

ఒకనాటి పగలు రెండు ఝాముల వేళ ఏలోకేసి, బిందువాసిని దగ్గరకు పని కట్టుకుపోయి, "నీది నీలి మేఘాల్లాంటి జుట్టు. జడ వేసుకోవెందుకని? ఇవ్వాళ మనింటికి జమీందారుగారి అమ్మాయిలు ఆడుకోవటానికి వస్తారు గదా? జడ వెయ్యనా?" అని అడిగింది.

"ఊహుఁ, వద్దండీ, మేలిముసుగు వేసుకోవడానికి వీలుండదు. అదీగాక అమూల్యుడు పెద్ద వాడవుతున్నాడాయె," అన్నది బిందువాసిని.

ఆ మాటలకు ఏలోకేసి విస్తుపోయి, "అవేం మాటలమ్మా? కుర్రవాడు కాస్త పెద్దవాడయితే మాత్రం, ఆడవాళ్ళు జడవేసుకోరా? మా నరేంద్రుడు, వాడి పగవాళ్ళ కళ్లల్లో దుమ్మపడ... మరో ఆర్నెల్లు పెద్దవాడే! అందుకని నేను తల దువ్వుకోవటం మానేస్తానటమ్మా!" అన్నది.

"మీరు మానటం ఎందుకు? నరేంద్రుడు మీరు జడ వేసుకోవటం మొదట్నుంచీ చూస్తూనే వున్నాడాయె. నేనివాళ కొత్తగా జడ వేసుకుంటే అమూల్యుడు వింతగా మాని, గల్లంతు చేస్తాడేమో! నాకు తలవంపులవుతుంది," అన్నది బిందు.

ఆ సమయంలో అన్నపూర్ణ అటుకేసి రావటం చూసి బిందువాసిని, "ఇదుగో అక్కా! తల దువ్వించుకుని జడ వేయించుకుంటావా?" అన్నది.

అన్నపూర్ణ, ఏలోకేసి ముఖం కేసి ఓమారు చూసి, సంగతి గ్రహించి, "నేనెన్నోసార్లు చెప్పానమ్మా, ఆవిడకు అంత తలకట్టునా జడ వేసుకోదు, ఇన్ని నగలున్నా పెట్టుకోదు... కుర్రాడు కూడా ఆ రోజున ఏమన్నాడో విన్నావా, బిందూ!బట్టలు కట్టుకుంటే ఏం వస్తుంది? మా అమ్మకు ఎన్ని వున్నై! కట్టుకుంటుందా ఏమిటి?—అన్నాడు," అన్నది.

బిందు సగర్వంగా తలెత్తి నవ్వి, "కాని, చూడక్కా! కుర్రాణ్ణి నలుగురిలో చెప్పుకోదగిన వాణ్ణిగా చెయ్యాలంటే, తల్లి కాస్త లోకవిరుద్ధంగా వుండటం అవసరం!— అప్పటివరకూ బతికుంటే, ఇదుగో, అమూల్యుడి తల్లి —అని నలుగురూ మెచ్చుకోవటం వింటారు," అన్నది. ఆ మాటలాడేటప్పుడు ఆనందంతో ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయినై.

అది గమనించిన అన్నపూర్ణ ఎంతో వాత్సల్యంగా, "అందుకే మీ అబ్బాయి విషయంలో మేమేం కల్పించుకోవటం లేదు. దేవుడు తప్పక నీకోర్కె తీరుస్తాడు," అన్నది.

బిందువాసిని పమిట చెంగుతో కళ్ళు వత్తుకుని, "ఆ ఒక్క ఆశతోనే నేను బతుకుతున్నాను, అక్కా!" అన్నది. ఆమె శరీరం సంతోషంతో గగుర్పొడిచింది. ఆమె సిగ్గువల్ల తలవంచుకుని చిన్నగా నవ్వి, "అంతే నక్కా! నా ఆశ కేనాడైనా దెబ్బ తగిలిందంటే, నాకు పిచ్చెత్తుతుందమ్మా," అన్నది.

అన్నపూర్ణ నివ్వెరపోయింది. ఆమె తోడికోడలి హృదయం ఎరిగినదే. కాని, ఆవిడ ఆశా, ఆకాంక్షల యొక్క తీవ్రస్వరూపం యింత విస్పష్టంగా యీనాటి వరకూ చూడలేదు.

నాలుగైదు రోజుల తర్వాత ఒకనాటి ఉదయం ఇంటి మంగలి యాదవబాబుకు పనిచేసి, మిద్దెపై నుంచి దిగి వస్తూండగా అమూల్యుడు అతడి దారికి అడ్డం నిలబడి, "కైలాస్! మా నరేంద్రుడి క్రాపులాగా, నా క్రాపు కత్తిరించగలవ్?" అని అడిగాడు.

కైలాస్ ఆశ్చర్యపడి, "ఆ క్రాపు ఎలా చేశారేవిఁటి!" అని అడిగాడు.

అమూల్యుడు తన జుట్టును వేళ్ళతో అక్కడా యిక్కడా పట్టుకుని



చూపుతూ, "ఇదుగో చూడు! ఇక్కడ ముప్పావతిక, ఇక్కడ పాతిక, ఇక్కడ పరక. ఇదిగో యిక్కడ మెడమీద— నువ్వెంత అంట కత్తిరించగలవో అంత కత్తిరించు," అన్నాడు.

కైలాస్ నవ్వి, "అలా మా అయ్య కూడా కత్తిరించలేడు," అన్నాడు.

"అదేం కష్టం కాదు, కైలాస్! ఇక్కడ ముప్పావతిక, యిక్కడ పాతిక..." అంటూ ప్రారంభించాడు అమూల్యుడు.

"మా చిన్నమ్మగారి సెలవైతే తప్ప నేను కత్తిరించను, బాబయ్యా," అన్నాడు కైలాస్.

"అయితే నీ గొడుగిటివ్వు, లేకపోతే పారిపోతావ్," అంటూ అమూల్యుడు కైలాస్ గొడుగు లాక్కుని, ఇంట్లోకి పరిగెత్తి, "అమ్మా! తొందరగా బయటికి రా!" అని కేకపెట్టాడు.

బిందువాసిని అప్పుడే స్నానంచేసి పూజ చేసుకోబోతున్నది. ఆమె అమూల్యుడి వాడావిడి చూసి, "తాకకు! తాకకు! పూజ చేసుకోబోతున్నాను," అన్నది.

"పూజ తరవాత చేసుకోమ్మా. కైలాస్‌కు చెప్పిపో, లేకపోతే వాడు జుట్టు కత్తిరించనంటున్నాడు," అన్నాడు అమూల్యుడు.

అమూల్యుడి మాటలు బిందువాసినికి ఆశ్చర్యం కలిగించినై. వాడికి క్షౌరం

చేయించుకోవటం అంటే తగని చీదర. అటువంటి వాడు తనకు తానై అడుగుతున్నాడు. ఏవిటి కారణం?

బిందువాసిని గదినుంచి బయిటికి వచ్చేసరికి, వాకిటి ముందు నిలబడి వున్న కైలాస్, "అబ్బాయిగారు, నా పీక పట్టేశాడు. నరేంద్రబాబుగారి క్రాపులాగ... ముప్పాతిక... పాతిక... పరక— అలా క్రాపు చేయటం నావల్ల నవుతుందాండీ!" అన్నాడు.

"బాగానే చేస్తావ్. ఆగు, నరేంద్రుణ్ణి పిలుచుకు వస్తాను," అంటూ అమూల్యుడు పరిగెత్తాడు. నరేంద్రుడు ఇంట్లో లేడు. అమూల్యుడు కొద్దిసేపటి తర్వాత తిరిగివచ్చి, "నువ్విక్కడే నుంచుని కైలాస్‌కు క్రాపు ఎలా చేయాలో చెప్పమ్మా," అన్నాడు.

బిందువాసిని నవ్వుకుంటూ నిలబడింది. కైలాస్ క్రాపు కత్తిరించటం మొదలు పెట్టాడు. బిందు అతడికి సౌంజ్ఞ చేసింది. కైలాస్ మామూలుగానే జుట్టు సమంగా కత్తిరించేశాడు. అమూల్యుడు తల తడువుకుని, "భలే బాగుంది!" అని గంతులు వేస్తూ వెళ్ళిపోయాడు.

కైలాస్ పొదీ అదీ సర్దుకుని వెళ్ళిపోతూ, "రేపు నేనీ ఇంటి ముందుకు రావటం ప్రమాదం అమ్మగారూ!" అన్నాడు.

గంట తరవాత అమూల్యుడు అద్దంలో ముఖం చూసుకుని క్రాపు తను కోరినట్టు కత్తెర పడలేదని గొడవ ప్రారంభించాడు. అన్నపూర్ణ అది చూసి, బిందువాసినితో, "నీ కొడుక్కు క్రాపింగు మోజు ఎప్పటినుంచి ప్రారంభమైంది?" అని అడిగింది.

బిందువాసిని చిరునవ్వు నవ్వి, అంతలోనే నిట్టూర్చుతూ, "అక్కా, చిన్న విషయం కాబట్టి నవ్వు వచ్చింది. అన్ని దురలవాట్లూ యిలాగే ప్రారంభమవుతాయని భయంగా వుంది," అన్నది.

అన్నపూర్ణ మరి మాట్లాడలేకపోయింది.

దుర్గాపూజలొచ్చాయి. ఆ పేట జమీందారుగారు మహాజోరుగా ఉత్సవాలు చేస్తున్నాడు. రెండు మూడు రోజులుగా నరేంద్రుడు వాటిలో మునిగి తేలుతున్నాడు.

ఒకనాటి రాత్రి అమూల్యుడు, నరేంద్రుడి వెంటవెళ్ళి హరికథ వినివచ్చాడు. తెల్లవారి అతడు పినతండ్రిని, "నువ్వు హరికథ వింటానికి రాలేదేం?" అని అడిగాడు.

ఇంతలో బిందువాసిని, "ఎలా వుందిరా హరికథ?" అని అడిగింది.

"చాలా బాగుందమ్మా! కలకత్తా నుంచి ఇత్తరు నాట్యకత్తె లొచ్చారు, నరేంద్రుడు చూపించాడు. బాబాయ్, అచ్చంగా అమ్మల్లే వున్నారు. వాళ్లు ఆడతారని నాన్న కూడా చెప్పేళా," అన్నాడు అమూల్యుడు.

"చాలా మంచి పనే చేశావ్," అంటూ మాధవుడు దిగ్గరగా నవ్వాడు.

బిందువాసిని ముఖం కోపంతో ఎర్రనైంది. "మీ గుణాలదాని ఆ మేనల్లుడి మాటలు విన్నారా? వెధవా, నీవిక అక్కడికి కెళ్ళొద్దు. ఆ నాట్యకత్తెలు నాలాగా వున్నారని, నరేంద్రుడా చెప్పింది?" అన్నది.

"ఔను, వాడే చెప్పాడు," అన్నాడు అమూల్యుడు భయపడిపోయి.

"ఏడీ, నరేంద్రుడు? రానీ వాణ్ణి..." అన్నది బిందు.

"నీకేమన్నా వెర్రా ఏం? ఈ గొడవంతా అన్నగారి కూడా తెలిసినట్టుంది. ఇక వూరుకో," అన్నాడు మాధవుడు.

ఆ మాటలతో బిందు కోపం దిగమింగుకుని లోపల్లోపలే కుమిలిపోసాగింది. ఆ సాయంత్రం చీకటి పడకముందే అమూల్యుడు, అన్నపూర్ణ వెంటపడి, "నాట్యం చూడ్డానికి వెళతానే, చూచి యిప్పుడే వస్తాను," అన్నాడు.

"వెళ్ళకు. మీ అమ్మకు కోపం వస్తుంది. వెళ్ళి ఆమెనే అడుగు," అన్నది అన్నపూర్ణ.

అమూల్యుడు, అన్నపూర్ణ పైట చెంగుపట్టుకుని అటూయిటూ లాగి, ఏడుస్తూ, "నువ్వు అమ్మతో చెప్పకు. నేను నరేంద్రుడితో వెళ్ళి తొందరగా వస్తా," అన్నాడు.

"నీవు నరేంద్రుడితో వెళితే..." అంటూ అన్నపూర్ణ ఏదో చెప్పబోయేంతలో అమూల్యుడు పరుగుతీశాడు.

ఓ గంట తరవాత బిందువాసిని అమూల్యుడి కోసం వెతకటం ప్రారంభించింది. అన్నపూర్ణ కిక్కురుమనకుండా వూరుకున్నది. కాని, బిందువాసిని ఆగదీ యీగదీ గాలించటం మానకపోయేసరికి, మెల్లిగా ఆమె ఎదటికిపోయి, "అక్కడ నాట్యం జరుగుతున్నదట. నరేంద్రుడి వెంట వెళ్లాడు, మరేం భయంలేదులే," అన్నది.

"ఎవరెళ్ళమన్నారు? మీరా?" అన్నది బిందువాసిని.

తను వద్దంటున్నా పరిగెత్తిపోయాడని చెప్పటానికి అన్నపూర్ణ భయపడి, "ఇప్పుడేవస్తాడులే," అన్నది.

బిందువాసిని వెలవెలపోతూ తనగదికేసి వెళ్ళింది. కొంచెంసేపటికి అమూల్యుడు యింటికివస్తూనే పినతల్లి పిలవటంవిని, భయంతో మెదలకుండా వెళ్ళి తండ్రి మంచం మీద పడుకున్నాడు.

ఒకరు వద్దన్నారు, ఒకరు వెళ్ళమన్నారు—ఇందువల్ల కలహం తప్పదని గ్రహించి, యాదవుడు, అమూల్యుణ్ణి వెంటబెట్టుకుని మరదలి గదిముందు నిలబడి, "ఈసారికి క్షమించు. ఇక ఎన్నడూ అటువంటి పనులు చెయ్యనంటున్నాడు," అన్నాడు.

ఆ రాత్రి తోడికోడళ్ళిద్దరూ భోజనాలకు కూర్చున్నప్పుడు, బిందువాసిని, "నాకు నీమీద కోపం ఏమీ లేదక్కా!...నేనిక యిక్కడ వుండలేను. ఇక్కడిహ అమూల్యుడు బొత్తిగా చెడిపోతాడు. వెళ్ళవద్దని చెప్పినా వాడికంత దుస్సాహసం ఎలావచ్చింది? వాడి పాడుబుద్ధి చూడు—నాదగ్గిరకిరాక, నీదగ్గిరకువచ్చాడు. నేను కలకత్తాలో ఇల్లొకటి అద్దెకుతీసుకుని వుంటాను. ఒక్కగా నొక్కబిడ్డ చెడిపోతుంటే, జీవితపర్యంతం చూస్తూ కుమిలిపోయేదానికన్న...అదే మంచిది," అన్నది.

అన్నపూర్ణ ఎంతో బాధగా, "మీరంతా వెళ్ళిపోతే, యిక్కడ నే నొక్కత్తెనూ ఎలా వుండగలనమ్మా, చెప్పు," అన్నది.

బిందువాసిని ఓ క్షణం ఆగి, "అది నీకే తెలియాలి. నా నిర్ణయమేదో చెప్పేశాను. ఆ నరేంద్రుడు వట్టి పాపిష్ఠి వెధవ!" అన్నది.

"నరేంద్రుడు చేసిన పెద్దతప్పుమాత్రం ఏముంది? వాళ్ళిద్దరూ అన్నదమ్ములై వుంటే ఏం చేసేదానివి?" అని అడిగింది అన్నపూర్ణ.

"నౌకరు చేత కాళ్లూ చేతులూ కట్టించి బెత్తంపెట్టి బాదించేదాన్ని. ముందు వీళ్ళ నిక్కణ్ణించి సాగనంపు," అన్నది బిందు.

అన్నపూర్ణ కోపంగా తలూపుతూ, "ఆ సాగనంపటం నా చేతుల్లోపనా? వాళ్ళ నిక్కడికి రమ్మన్నవాళ్ళతో చెప్పాలి," అన్నది.

"నీవుండగా నే నివన్నీ బావగారితో చెపితే కోపంరాదూ?" అని అడిగింది బిందువాసిని.

"అవును, తప్పకుండా వస్తుంది. కాని నేను చెప్పానంటే బతికున్నంతవరకూ నాముఖం చూడరు. అదీగాక...వాళ్లు అన్నాచెల్లెళ్ళు," అన్నది అన్నపూర్ణ.

బిందువాసిని లేచి చేతులు కడుక్కొని తన గదిలోకి వెళ్ళి, అక్కడ పక్కమీద అమూల్యుడు లేకపోయే సరికి తిరిగివచ్చి, "వా డెక్కడున్నాడు!" అని అడిగింది అన్నపూర్ణను.

"వా డివ్వాళ నా మంచంమీదపడి నిద్రపోతున్నట్టున్నాడు, తీసుకురానా!" అన్నది అన్నపూర్ణ.

"వద్దులే, అక్కడే పడుకోనీ," అంటూ బిందువాసిని ముఖం ముడుచుకొని వెళ్ళిపోయింది.



నడిరాత్రివేళ అన్నపూర్ణ పిలుపుతో బిందువాసిని తుళ్ళిపడి నిద్రమేల్కొన్నది. అన్నపూర్ణ తలుపుతడుతూ. "నీ కుర్రవాణ్ణి నువ్వేతీసుకో. వీడి గడుగ్గాయితనం భరించటం నావల్లకాదు," అన్నది.

బిందు తలుపుతెరిచి అమూల్యుణ్ణి తీసుకుపోయి మంచంమీద పడుకోబెట్టింది. వాడు మరుక్షణం నిద్రలోకి జారుకున్నాడు. పక్కమంచంమీద పడుకు న్నన్న మాధవుడు, "నీ ఉబలాటం తీరిందా, వదినా?" అన్నాడు నవ్వుతూ.

"నేనేం ఉబలాటపడలేదు, బాబూ! వాడే తల్లికొడుతుందన్న భయంతో నా మంచంమీదికొచ్చి పడుకున్నాడు. నాకు మంచిశాస్తే జరిగింది. నీ దగ్గర పడుకోవటానికి సిగ్గుగావుంది—అంటాడువాడు నాతో. వాడి హాస్యపుమాటలు విన్నారా?" అన్నది అన్నపూర్ణ.

ఇది జరిగిపోయిన పదిరోజులకు బిందువాసినికి పుట్టింటి నుంచి రమ్మని కబురొచ్చింది. తల్లిదండ్రులు తీర్థయాత్రలకుపోతూ కూతుర్ని రమ్మని మేనా పంపారు. అమూల్యుడు వీధిలోంచి ఇంట్లోకివస్తూ, వాకిటిముందున్న మేనా చూశాడు. గదిలోకి రాగానే బిందు కాళ్ళకుపెట్టుకున్న పారాణి కనిపించింది.

"కాళ్ళకి పారాణి ఎందుకు పెట్టుకున్నావ్? ఆ నగలన్నీ పెట్టుకున్నావేం?" అని అడిగాడు వాడు.

అన్నపూర్ణ నవ్వాపుకోలేక ముఖం మీదికి పైట లాక్కొని అవతలికి పోయింది. బిందు కూడా నవ్వుతూ, "ఎప్పుడో నీ పెళ్ళాం వస్తుంది, యీ నగలన్నీ పెట్టుకుంటుందని, ఇప్పట్నించీ వీటిని మేం పెట్టుకోవద్దంటావా? నువ్వు బళ్ళోకి పో," అన్నది.

"అక్కా అలా నవ్వుతూ దూరంగా ఎందుకెళ్ళింది? ఇవ్వాళ నేను స్కూలుకు వెళ్ళను. నువ్వు ఎక్కడికి వెళుతున్నావో చెప్పు?" అన్నాడు అమూల్యుడు.

"నే నెక్కడికి వెళితే నీకేం? నీ అనుమతి కావాలా?" అన్నది బిందు.

"ఊహూఁ, నేనూ వస్తా," అంటూ అమూల్యుడు పుస్తకాలు తీసుకుని వెళ్ళి పోయాడు.

అన్నపూర్ణ మళ్ళీ తిరిగొచ్చి, "వీడింత తేలిగ్గా బడికి పోతాడనుకోలేదు. వాడికి ఎన్ని ఆరాలు కావాలో చూశావా? ఎందుగ్గాని వాణ్ణి వెంటబెట్టుకు పో. బళ్లోంచి వచ్చి నువ్వు కనబడకపోతే, నానా ఆగం చేస్తాడు," అన్నది.

"వాడు బడికి వెళ్ళుంటాడనుకుంటున్నావా, అక్కా? ఊహుఁ, యిక్క డెక్కడో నక్కి సమయానికి హాజరవుతాడు," అన్నది బిందు.

సరిగ్గా అనుకున్నట్టే జరిగింది! అమూల్యుడు అంతవరకూ ఎక్కడో దాక్కొని, బిందు అన్నపూర్ణ పాదాలకు నమస్కరించి మేనా ఎక్కబోయేసరికి, హఠాత్తుగా పరిగెత్తుకుంటూ వచ్చి, ఆమె కొంగు పట్టుకుని నిలబడ్డాడు. తోడికోడళ్ళిద్దరూ నవ్వు కున్నారు.

"వెళ్ళేముందు గల్లంతెందుకు, తీసుకుపో," అన్నది అన్నపూర్ణ.

"తీసుకువెళ్ళటానికేం, అక్కడయినా నన్నొక్కడుగు కదలనిస్తాడా? నేను వీడితో వేగలేను," అన్నది బిందు.

"వాణ్ణి నువ్వే అలా తయారుచేశావ్. అమూల్, యీ రెణ్ణాళ్ళూ నువ్వు నా దగ్గిర వుండిపో," అన్నది అన్నపూర్ణ.

అమూల్యుడు తల అడ్డంగా తిప్పుతూ, "నేను నీ దగ్గిర వుండను," అని గబ గబా పరిగెత్తి మేనా ఎక్కి కూర్చున్నాడు.

## 6

బిందువాసిని పుట్టింటి దగ్గిర్నుంచి తిరిగివచ్చిన పది రోజుల తరవాత, ఒక మధ్యాహ్నం అన్నపూర్ణ ఆమె గదిలో కెళ్ళింది. బిందు మాసిన దుస్తుల గుట్ట ఒకటి ముందు వేసుకుని దిగాలుపడి కూర్చుని వున్నది.

"చెల్లీ! చాకలొచ్చిందా?" అని అన్నపూర్ణ అడిగింది.



బిందువాసిని మాట్లాడలేదు. అన్నపూర్ణ ఆవిడ ముఖంకేసి పరీక్షగా చూసి, "ఏం జరిగింది?" అని ప్రశ్నించింది ఆదుర్దాగా.

బిందువాసిని, కాల్చిన సిగరెట్ పీకలు కొన్ని అన్నపూర్ణకు చూపించి, "ఇవి అబ్బాయి చొక్కా జేబులోంచి బయటపడినై," అన్నది.

అన్నపూర్ణ స్థాణువులా నిలబడిపోయింది. బిందువాసిని కళ్ళ నీళ్ళతో, "నీ కాళ్లు పట్టుకుంటాను, అక్కా! ఆ నరేంద్రుడూ వాళ్ళనైనా పంపెయ్యి, లేక పోతే మమ్మల్నయినా పంపెయ్యి," అన్నది.

అన్నపూర్ణ జవాబేమీ చెప్పలేక, కాసేపు మౌనంగా నిలబడి వెళ్ళిపోయింది.

సాయంకాలం అమూల్యుడు స్కూలునుంచి వచ్చి ఫలహారం తిని ఆడుకోవడానికి వెళ్లాడు. బిందు అతణ్ణి పలకరించలేదు. ఇంతలో భైరవుడు ఏడుపు ముఖం పెట్టుకువచ్చి, "అమ్మగారూ! నరేంద్రబాబు నన్ను నవసరంగా చెంపమీద కొట్టాడు," అని బిందుతో చెప్పాడు.

బిందు విసుక్కుని, "పోయి అక్కగారితో చెప్పుకో," అన్నది.

ఆ రాత్రి అన్నపూర్ణ, బిందు చేతులు పట్టుకుని, "ఏం జరిగినా వాడు నీ కొడుకే, బిందూ. ఈసారికి వాణ్ణి క్షమించు," అన్నది.

"చిన్నతనంలో పెంచాను. ఇప్పుడు వాడు పెద్ద వాడైపోయాడు. నీబిడ్డను నువ్వే తీసుకో. నాకు సెలవిప్పించు," అని బిందు వెళ్ళిపోయింది.

అందరూ పడుకునే వేళ అమూల్యుడు ఏడుపు ముఖం పెట్టుకుని అన్నపూర్ణ దగ్గరకు పండుకోవటానికి వచ్చాడు. ఏం జరిగిందో గ్రహించిన అన్నపూర్ణ విరక్తిగా, "ఇక్కడి కొచ్చావెందుకు? పో యిక్కణ్ణించి," అన్నది.

అమూల్యుడు వెనక్కి తిరిగి చూశాడు. తండ్రి నిద్రపోతున్నాడు. అతను ఏమీ మాట్లాడకుండా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

తెల్లవారగట్ల కదంబం వంట గదికేసి వస్తూ, అమూల్యుడు వరండాలో ఒక మూల పుల్లలూ, పిడకలూ కలిసివున్న గుట్టమీద పడి నిద్రపోతూండడంటం చూసి, గబగబా పోయి బిందువాసినిని పిలుచుకు వచ్చింది. అన్నపూర్ణ కూడా ఆ సమయానికి అక్కడి కొచ్చింది.

బిందువాసిని, అన్నపూర్ణకేసి తీక్షణంగా చూస్తూ, "వీడుంటే నిద్రపట్టదని, రాత్రి వీణ్ణి బయిటికి గెంటావా, అక్కా?" అని అడిగింది.

కొడుకు అవస్థ చూసి అన్నపూర్ణ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆ స్థితిలో బిందు కఠినంగా మాట్లాడటంతో మండిపడి, "నీవు నీతప్పుల్ని యితర్ల నెత్తిన వేసి సంతోషిస్తావు," అన్నది.

బిందువాసిని, అమూల్యుణ్ణి లేవదీయటానికి పోయి, వాడి శరీరం వేడిగా వుంటంతో, "ఈ కార్తీకమాసపు మంచులో రాత్రల్లా పడుంటే జ్వరం రాకేం చేస్తుంది? త్వరగా తగ్గితే బతికిపోతాను," అన్నది.

అన్నపూర్ణ ఆత్రంగా కొడుకును సమీపించి, "ఏదీ, జ్వరం వచ్చిందా?" అన్నది.

బిందువాసిని, అన్నపూర్ణ చేతిని పక్కకు తోసి, "చాలు, నువ్వేం చూడ నవసరం లేదు," అని అమూల్యుణ్ణి ఎత్తుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది.



అయిదారు రోజుల్లోపలే అమూల్యుడికి స్వస్థత చిక్కింది. కాని, బిందు మాత్రం అన్నపూర్ణ అపరాధాన్ని క్షమించలేదు. ఆనాటి నుంచి ఆమె అన్నపూర్ణతో సరిగా మాట్లాడటం మానేసింది. బిందువాసిని అందరి ముందూ తప్పంతా తనమీద మోపటం అన్నపూర్ణ సహించలేక పోయింది. ఒకరోజు ఏదో మాటల సందర్భంలో, ఏలోకేసితో ఆమె, "బిందు మూలానే వాడికి జ్వరం వచ్చింది. వాడి అదృష్టం కొద్దీ చావకుండా బతికాడు," అన్నది.

ఈ మాటలు బిందువాసిని దగ్గరకు ఏలోకేసి క్షణాలమీద మోసుకు పోయింది. అది విన్న తరవాత బిందువాసిని తన తోడికోడలుతో మాట్లాడటం పూర్తిగా మానేసింది.

కొన్ని రోజులుగా సామానులూ అవీ కొత్త ఇంటికి చేరవేస్తున్నారు. యాదవుడు ఎక్కువకాలం ఆ ఇంట్లోనే గడిపేస్తున్నాడు. మాధవుడు ఏదో కేసు పనిమీద పారుగూరు వెళ్ళాడు.

ఇలాంటి సమయంలో పంతులు అమూల్యుడికి పాఠాలు చెప్పేందుకు ఓ సాయంత్రం వచ్చాడు. బిందువాసిని అతనితో, "మా వాడు బడికి రాడు, పాఠాలేవో రోజూ యిక్కడే చెప్పండి," అన్నది.

పంతులు, "చిత్తం," అని వెళ్ళిపోతూండగా బిందు అతణ్ణి వెనక్కి పిలిచి, "మీ శిష్యుడి చదువు సంధ్యలెలా వున్నాయి?" అని అడిగింది.

"చదువుసంధ్యల్లో ఎప్పుడూ మెరుగే..."

"కాని, యిప్పుడు సిగరెట్లు కాల్చటం నేర్చుకున్నాడు," అన్నది బిందువాసిని.

"సిగరెట్లు కాల్చటం నేర్చుకున్నాడా?" అంటూ పంతులు ఆశ్చర్యపోయి, "...పిల్లలు వాళ్ళనూ వీళ్ళనూ చూసి అన్ని దురవాట్లూ అలవరుచుకుంటారు," అన్నాడు.

"ఎవర్ని చూచి నేర్చుకున్నాడు?" అని అడిగింది బిందు.

పంతులు అదోలా తలాడించి, "పిల్లలు కొందరు బడికి వెళ్ళే దారిలో వున్న మామిడి తోటలో జొరబడి పసిపిందెల్ని తుంచేసి, తోటవాణ్ణి కూడా రాళ్ళతో కొట్టారట. తోటవాడు మా హెడ్‌మాష్టరుగారి దగ్గిర ఫిర్యాదు చేశాడు," అన్నాడు.

బిందు ప్రాణాలు బిగబట్టుకుని, "ఆ తరవాత ఏమైంది?" అని అడిగింది.

"హెడ్‌మాష్టరుగారు పిల్లల దగ్గిర పది రూపాయిల జరిమానా వసూలు చేసి, తోటవాణ్ణి శాంత పరిచాడు," అన్నాడు పంతులు.

"ఇందులో మా అబ్బాయి కూడా వున్నాడా? డబ్బెక్కడ తెచ్చాడు?" అని అడిగింది బిందు.

"ఇందులో అమూల్యుడూ, నరేంద్రుడూ కూడా వున్నారు. వాళ్ళిద్దరిదగ్గిరా జరిమానా వసూలైనట్టు హెడ్‌మాష్టరుగారు చెప్పారు," అన్నాడు పంతులు.

"సరే, మీరు వెళ్ళండి," అని బిందువాసిని అక్కడే కూలబడి, "నాకు చెప్పకుండా అమూల్‌కు డబ్బిచ్చే సాహసం, యీ ఇంట్లో ఎవరికున్నది?" అంటూ మూలిగింది. తరువాత లేచి అన్నపూర్ణ దగ్గిరకు పోయి, "అక్కా, అమూల్యుడికి మధ్య మీరేమైనా డబ్బిచ్చారా?" అని అడిగింది.

ఈ ప్రశ్న వస్తుందని అన్నపూర్ణ భయపడుతూనే వున్నది. ప్రశ్న రానే వచ్చింది. ఆమె చిన్న గొంతుతో, "నీ కెవరు చెప్పారు?" అని అడిగింది.

"ఎవరు చెప్పారన్నది ముఖ్యం కాదు! వాడేమని అడిగాడు, నీవేమని యిచ్చావు?" అన్నది బిందు.

అన్నపూర్ణ దిగాలుపడి వూరుకున్నది.

"నేను వాణ్ణి అదుపులో పెట్టటం మీ కిష్టంలేదు. మీరు బుద్ధిపూర్వకంగా నే-రహస్యంగా వాడికా డబ్బిచ్చారు, అవునా?" అన్నది బిందువాసిని.

"నిజమే! ఈసారికి వాణ్ణి క్షమించు, బిందూ. నేను క్షమాపణ కోరుతున్నాను," అన్నది అన్నపూర్ణ.



“ఎప్పటికీ క్షమించను. వాడి ప్రమేయం యిక పెట్టుకోను. కాని, నీ కింత సాహసమా?” అన్నది బిందు కోపంతో వూగిపోతూ.

ఆ చివరిప్రశ్న అన్నపూర్ణకు శూలంలా తగిలింది. చాటునుంచి యింటి నౌకర్లు, చాకర్లు యీ మాటలన్నీ వింటున్నారు. అన్నపూర్ణ యిక సహించలేక, “సాహసమే! నువ్వేం చేయగలవ్, ఉరి తీయిస్తావా?” అని అడిగింది.

“అదే మీకు తగిన శిక్ష!” అన్నది బిందువాసిని మరింతగా రెచ్చిపోయి.

“నా కొడుక్కి నేను రెండు రూపాయలిచ్చుకున్నాను, అది తప్పా?”

“అయినా ఎందుకివ్వాలి? పాడుచేయటానికి డబ్బెక్కణ్ణించి వస్తుంది?”అన్నది బిందువాసిని.

“డబ్బును నువ్వు పాడుచేయటం లేదూ?” అనడిగింది అన్నపూర్ణ.

“నా డబ్బు నేను పాడుచేసుకుంటాను. కాని మీ రెవరి డబ్బు పాడు చేస్తున్నారో చెప్పండి?” అన్నది బిందు నిగ్గతీస్తున్నట్టు.

ఈ ప్రశ్నతో అన్నపూర్ణ రౌద్రమూర్తి అయిపోయింది. ఆమె పేదయింటి బిడ్డ. బిందువాసిని తనను యీసడిస్తున్నదని ఆమె గ్రహించింది. ఆ వెంటనే ఆమె

తొక్కిన తాచులా లేచి, "నువ్వు ధనవంతుల బిడ్డవని ఒప్పుకుంటాను. అంత మాత్రంచేత యితర్లెవరూ తమ బిడ్డకు రెండు రూపాయిలిచ్చుకోలేరని అహంకార పడకు," అన్నది.

"నాకేం అహంకారం లేదు. నువ్వు ఖర్చుపెట్టే ప్రతి దమ్మిడీ ఎవరిదో ఆలోచించుకో," అన్నది బిందు.

"నీ నోటికొచ్చినట్లల్లా వాగక, అవతలికిపో," అన్నది అన్నపూర్ణ.

"అ పోవటం తెల్లవారింతర్వాత పోతాను. మీరు ఎవరి డబ్బు ఖర్చు చేస్తున్నారో, ఎవరి సంపాదనమీద బతుకుతున్నారో, అదికూడా తెలియదా?" అన్నది బిందువాసిని.

"నీ భర్త సంపాదనమీద బతుకుతున్నామనా నువ్వనేది? తమ్ముడికోసం నీ బావగారు ఒక్కసారిగా రెండు ధోవతులైనా కొనుక్కోలేని దశలో వుండగా, నువ్వెక్కడున్నావమ్మా, తోడికోడలా? ఇల్లు తగలబడిపోగా చెట్టుకింద వండుకు తింటూ గడిపినప్పుడు, నీవెక్కడి కెళ్ళావమ్మా, చెల్లీ?" అని అన్నపూర్ణ కళ్లు తుడుచుకుని, "నీ మనసులో మాట వారికి తెలిసివుంటే, యిలా నల్లమందు భాయీలాగా తూగుతూ తూగుతూ కాలం వెళ్ళమార్చే మనిషి కాదాయన. ఆ సంగతి మీ వారికి బాగా తెలుసు, ఆకాశంలో వున్న దేవతలకు తెలుసు. నన్ను అడ్డం పెట్టుకుని వారిని అవమానపరుస్తావా?" అన్నది.

బిందువాసిని ఏమీ జవాబివ్వలేదు. అన్నపూర్ణ మరింత ఉద్రేకంతో, "నీవు నీ వుద్దేశం బయటపెట్టటం మేలే అయింది. దక్షుడు తన పతిని అవమానంచేయగా, సతి ఆత్మహత్య చేసుకున్నది. నేను నీ తిండి తినేకంటే, మరొకరింట వంటపని చేసుకు బతుకుతాను. ఇదే ఒట్టు! నీవు వారిని యింతగా అవమానపరుస్తావా?" అన్నది.

ఆ సమయంలో యాదవుడు వాకిట్లోకి వచ్చి, "ఏయ్," అని భార్యను పిలిచాడు. భర్త గొంతు వినేసరికల్లా అన్నపూర్ణ అభిమానం తుఫానులా లేచింది. ఆమె గబగబా భర్తదగ్గరకు పోయి, "ఛీ, ఛీ! భార్యాబిడ్డల్ని పోషించలేని మగవాడికి, ఉరిపోసుకునేందుకు ఎక్కడా బారెడు తాడు దొరక్కపోయిందా?" అన్నది.

యాదవుడి కిదేమీ అర్థంకాక, "ఏమిటి?" అని అడిగాడు.

"ఏమిటా? నేను ఆవిడ దాసీననీ, మీరు నౌకరనీ మీ మరదలివాళ స్పష్టంగా నాకు చెప్పేసింది," అన్నది అన్నపూర్ణ.

తన గదిలోకిపోయి అంతా వింటున్న బిందువాసిని నాలుక కొరుక్కుని, చెవులు మూసుకున్నది.



అన్నపూర్ణ ఏడుస్తూ, "స్వతంత్రించి ఎవరికీ ఒక్క దమ్మిడీ యిచ్చే అధికారం నాకు లేదు. మీరు బతికుండగానే నేనీ మాట వినాల్సివచ్చింది. ఇప్పుడు మీ ఎదట నిల్చుని శపథం చేస్తున్నాను. ఇవాళ్టినుంచీ నే నిక్కడ అన్నంతింటే అమూల్యుడి మీద ఒట్టు!" అన్నది.

మూసుకున్న బిందువాసిని చెవుల్లో అన్నపూర్ణ మాటలు స్పష్టంగా ప్రతిధ్వనించాయి. ఆమె, "ఎంత ఒట్టు పెట్టుకున్నావమ్మా, అక్కా!" అంటూ అరిచి, పన్నెండేళ్ళ తర్వాత మళ్ళీ మూర్ఛవచ్చి విరుచుకుపడిపోయింది.

## 7

కొత్తగా కట్టిన ఇంటికి యాదవుడు, అన్నపూర్ణ, అమూల్యుడు వెళ్ళలేదు. గృహప్రవేశ సందర్భంలో పూజా, సంతర్పణా చేయాలనుకున్నారు, మాధవుడూ, బిందువాసినీ. బిందు తల్లీ తండ్రీ, పినతల్లీ, ఆమె కూతురూ వచ్చారు. మరి కొంత బంధుగణంకూడా వచ్చింది. ఇల్లంతా చాలా సందడిగా వుంది.

బిందు తండ్రి కూతుర్ని, "నీ కొడుకు కనిపించటంలేదేం?" అని అడిగాడు.

"—ఆ ఇంట్లో వున్నాడు," అన్నది బిందువాసిని ముక్తసరిగా.

"మీ తోడికోడలు యింకా రాలేదేం?" అని అడిగింది తల్లి.

"రాలేదు!" అన్నది బిందు.

"అవున్లే, అంతా వచ్చేస్తే ఆ ఇంట్లో దీపంపెట్టే దెవరులే. తల్లిదండ్రుల తాలూకు ఇల్లు పాడుపెట్టటం ఏమీ మంచిదికాదు," అన్నది బిందువాసిని తల్లి.

కోపం చల్లారగానే అన్నపూర్ణ వస్తుందని బిందువాసినికి గట్టి నమ్మకం వుంది. యాదవుడు రోజూ సాయంత్రంపూట ఒకసారి కొత్త ఇంటికివచ్చి, బైట కూర్చుని సంగతి సందర్భాలు తెలుసుకుని వెళ్ళిపోతున్నాడు. గృహప్రవేశానికి ముందునాటి రాత్రి అతను లోపలికివెళ్ళి, ఏలోకేసినిని పిలిచి ఏర్పాట్లసంగతి అడిగాడు. బిందువాసిని చాటున నిలబడి అంతా విన్నది. బావగారు తనను తండ్రికంటె ఎక్కువగా ఆదరించాడు. ఎప్పుడూ 'అమ్మా!' అని పిలిచేవాడేగాని, మరదలా అని ఎరగడు. తోడికోడలితో తగూవచ్చినప్పుడు తను ఎన్నిసార్లు వెళ్ళి బావగారితో ఫిర్యాదు చేయలేదు. ఆయన ఎదటికి వెళ్ళటానికీనాడు బిందుకు సిగ్గువేసింది. యాదవుడు వెళ్ళిపోయాక గదిలోకిపోయి నోట్లో పయిటకొంగు పెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

పూజనాటి ఉదయం బిందువాసిని, భర్తను, "పొద్దెక్కుతున్నది. పురోహితుడు వచ్చాడు. బావగారు యింకా వచ్చినట్టు లేదేం?" అని అడిగింది.

"ఆయనెందుకు వస్తాడు?" అన్నాడు మాధవుడు.

బిందువాసిని ఆశ్చర్యంగా, "ఆయనెందుకొస్తారా? ఆయన రాకపోతే యిదంతా ఎవరు చేస్తారు?" అని ప్రశ్నించింది.

"నేను చేస్తాను, లేకపోతే ప్రియబాబుబావ చేస్తాడు. అన్నయ్య రాడు," అన్నాడు మాధవుడు.

బిందుకు కోపం వచ్చింది. "రారనగానే అయిపోయిందా ఏవిటి? వారుండగా పూజ చెయ్యటానికి మరెవరికైనా అధికారం వుందా? ఆయనతప్ప మరెవర్నీ యిందులో చేయి చేసుకోనివ్వను," అన్నదామె.

"అలా అయితే పూజా, వ్రతం—ఆ ఏర్పాట్లన్నీ ఆపించు. ఆయన ఇంట్లో లేరు. పనిమీద ఎక్కడికో వెళ్ళారు," అన్నాడు మాధవుడు.

"ఇదంతా తోడికోడలి పన్నుగడ! అయితే, ఆవిడగారు కూడా రాదన్న మాట!" అని బిందువాసిని కంట నీరుపెట్టుకుని తన గదికి వెళ్ళింది.

కాస్సేపటికి ఏలోకేసి వచ్చి, "సామాను గది తాళంచెవి యివ్వమ్మా. మిఠాయి పట్టుకొచ్చారు," అన్నది బిందువాసినితో.

బిందు విసుగ్గా, "అక్కడెక్కడైనా పెట్టమను, తర్వాత చూడొచ్చు," అన్నది.

తర్వాత పినతల్లి ఒకరిద్దరు వంటలక్కల్ని వెంటబెట్టుకు వచ్చి, "ఇవ్వాళ ఎంత బియ్యం పొయ్యాలో చెప్పమ్మా!" అని అడిగింది.



బిందువాసిని ముఖం చిట్లించుకుని "ఎంత కావాలో నాకేం తెలుసు! ఇంత వయసొచ్చింది మీకు తెలీదూ?" అన్నది.

పినతల్లి ఆశ్చర్యపడి, వంటలక్కలతో "ఈవిడ మాటలు వినండి! ఎంత మందిని భోజనానికి పిలిచారో నాకేం తెలుసు!" అన్నది.

బిందువాసిని కోపగించుకుంటూ, "అయితే వెళ్ళి ఆయనగార్నడుగు. ఇలాంటి పనుల్లో మా అక్కగార్నే చెప్పుకోవాలి. అమూల్యుడి వడుగైనప్పుడు ఆమె 'ఇదెంత కావాలి, అదేం చేయాలి, నువ్వీ పని చూడు, ఆ పని చెయ్యి' అని నా కొక్కమారైనా చెప్పిందా! ఈ ఇంట్లో వాళ్ళందర్నీ కలిపినా ఆమె కాలిగోరుకు పోలరు," అన్నది.

ఇంతలో కదంబిని వచ్చి, "అమ్మా! అయ్యగారు పూజా వస్త్రాలు......" అంటూ ప్రారంభించేసరికి బిందువాసిని, "మీరందరూ కలిసి నన్ను పిరుచుకు తినండి. ఫో, నా యెదటనుంచి!" అన్నది.

మరికొంత సేపటికి మాధవుడు వచ్చి, ఒకటికి రెండుసార్లు పిలిచి, "పలకవేం! వినబడటంలేదా?" అన్నాడు.

"వినబడటంలేదు...ఈ పనులేవీ నాచేత కావు......కావు......సరేనా!" అంటూ అరిచింది బిందు.

మాధవుడు స్తంభించిపోయి భార్య ముఖంకేసి చూస్తూ నిలబడ్డాడు. బిందువాసిని రుద్ధకంఠంతో, "మీరు నన్నేంచేస్తారు? మెడకు ఉరిపోస్తారా? పొయ్యండి," అని ఏడుస్తూ గదినుంచి బయలుదేరింది. ఆమెకు పురోహితుడు ఎదురై "చాలా పొద్దెక్కింది. ఏర్పాట్లేమీ పూర్తయినట్లు లేదు," అన్నాడు.

"ఇలాంటి శుభకార్యాల్లో ఆలశ్యం జరక్కుండా వుంటుందా?" అని బిందువాసిని అతడికి కటువుగా జవాబు చెప్పి, పక్కన ఒక పళ్లెం ఉంటే దాన్ని గట్టిగా ఓ తన్ను తన్ని మరో గదిలోకి పోయి నిర్జీవిలా చాప మీద పడుకున్నది. పది నిమిషాల తర్వాత ఆమెకు ఓ పరిచయ కంఠస్వరం వినబడింది. అన్నపూర్ణ వరండాలో నిలబడి ఉన్నది.

బిందువాసిని కళ్ళు తుడుచుకుని తోడికోడలు ముందుకుపోయి, చేతులు జోడించి, "పదీ పదకొండు కావచ్చింది. ఇంత శత్రుత్వమైతే ఎలానమ్మా? నువ్వు పుచ్చుకోమంటే విషం పుచ్చుకుంటాను. ఇంటికిపోయి ఓ గిన్నెడు పంపు," అని తాళపు చెవుల గుత్తి ఆమె పాదాల ముందు పారేసి, తన గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకుని దొర్లుతూ ఏడవటం ప్రారంభించింది. అన్నపూర్ణ తాళపు చెవుల గుత్తి తీసుకుని, సామాను గది తలుపులు తెరిచి అందులో ప్రవేశించింది. ఆ తరవాత పను లన్నీ చకచకా జరిగిపోయినై.

సూర్యాస్తమయంవేళ బిందువాసిని నడవాలో ఏదో ఆలోచిస్తూ నిలబడి వుండగా, భైరవుడు వచ్చి, "అబ్బాయిగారు బళ్లో లేరండి!" అని చెప్పాడు.

బిందు అతణ్ణి కసురుతూ "దౌర్భాగ్యుడా! ఈ వేళప్పుడు పిల్లలు బళ్లో వుంటారా? ఒకసారి ఆ యింటికి వెళ్ళి చూసి రాకపోయావా?" అన్నది.

"వెళ్ళా నమ్మగారూ, ఇంట్లో కూడా లేరు," అన్నాడు భైరవుడు.

"ఎక్కడ ఏ వెధవల్తో బిళ్ళంగోడు ఆడుతున్నాడో! దెబ్బ తగిలి ఓ కన్ను పోతే ఆ అన్నపూర్ణగారి కళ్ళు చల్లబడతై. నువ్వు మళ్ళీ పోయి ఎక్కడున్నాడో వెతికి తీసుకురా," అన్నది బిందు.

అన్నపూర్ణ సామాను గది గడపలోపల కూర్చుని, ముత్తైదువులతో మాట్లాడుతూ, తోడికోడలి ఈ యీసడింపు మాటలు విన్నది. తరవాత కొంచెం సేపటికి భైరవుడు వచ్చి, బిందుతో, "అబ్బాయిగారు ఇంట్లోనే వున్నారు. రమ్మంటే ఇక్కడికి రా నన్నారు," అని చెప్పాడు.

బిందు ఓ క్షణంసేపు వూరుకుని, "ఇది వాడి తప్పుకాదు. తల్లి లక్షణాలే వాడికీ వచ్చాయి. ఇక ఆ తల్లికొడుకుల ముఖం చూస్తే ఒట్టు!" అన్నది.

రాత్రి బాగా పొద్దు పోయిం తరవాత అన్నపూర్ణ ఇంటికి వెళ్ళటానికి బయలు దేరింది. మాధవుడు ఆమెను పంపటానికి వచ్చాడు. బిందు గబగబా వచ్చి భర్తతో, "పంపటానికి బయలుదేరారుగాని, ఆమె ఇంతవరకూ వచ్చి నీళ్లు కూడా మింగలేదు, తెలియదా?" అన్నది.

"ఆ సంగతి తెలియవలసింది నీకు. ఇక్కడ పనులన్నీ అభాసుపాలవుతూంటే నేనే వెళ్ళి పిలుచుకు వచ్చాను," అన్నాడు మాధవుడు.

"బాగానే వుంది. మీరూ వారి పక్షమేనన్న మాట!" అన్నది బిందువానిని కోపంగా.

మాధవుడు భార్య కేమీ జవాబు చెప్పకుండా, "ఆలశ్యం ఎందుకు, పద వదినా!" అన్నాడు.

అన్నపూర్ణ రెండడుగులు ముందుకు వెయ్యగానే బిందు పెద్ద గొంతుతో, "జాతి శత్రుత్వం! నోటికొచ్చినట్టు పది కల్పించి చెప్పి, తరవాత ఒట్టుపెట్టుకుంటే సరా! నాలుగు రాత్రిళ్లు పగళ్ళు బిడ్డ ముఖం చూడకుండా చేసింది. భగవంతుడు న్యాయం చేయకపోడు!" అని నోట్లో గుడ్డపెట్టుకుని ఏడుపు నాపుకుంటూ వంటి ట్లోకి పోయి విరుచుకు పడిపోయింది.

అన్నపూర్ణ చప్పున వెనుదిరిగి మాధవుడితో "ఏమిటీ? చూద్దాం పదండి," అన్నది ఆదుర్దాపడుతూ.

"చూడనవసరంలేదు, పదండి," అన్నాడు మాధవుడు.

* * *

నాలుగైదు రోజుల తరవాత బిందు తలి దండ్రులూ, బంధువులూ రేపు వెళతారనగా, బిందు మూలుగుతూ మంచంలో పడుకుని ఉన్నది. పక్కన కూర్చుని కదంబిని విసనకర్రతో విసురుతున్నది. బిందు చిన్న గొంతుతో, "అక్కయ్య వచ్చిందా?" అని అడిగింది.

"లేదమ్మగారూ! మేమింతమందిమి వుండగా ఆవిడగార్ని శ్రమ పెట్టటం ఎందుకు?" అన్నది కదంబిని.

బిందు కొంచెంసేపు వూరుకుని, "ఇదే మీకున్న తల తిక్క. నన్నిలాగే ఏదో రోజున చంపేస్తారు. గృహప్రవేశంరోజున కూడా మీరంతా ఇంటినిండా వున్నారు గాని, ఆవిడ లేకుండా మీరేం చేయగలిగారు!" అన్నది విసుగ్గా,

బిందు తల్లి గదిలోకి వచ్చి, "అల్లుడుగారి అంగీకారమైంది. నువ్వు మాతో పాటు కొన్నాళ్ళుండి వద్దువుగాని రా," అన్నది.

బిందు తల్లి ముఖంకేసి చూస్తూ, "నేను వెళ్ళటం వెళ్ళకపోవటం వారి యిష్టం మీద ఆధారపడి వున్నదా ఏమిటి? నేను నా శత్రువు ఆజ్ఞ లేనిదే కదిలే దెలా!" అన్నది.

"నీ తోడికోడలి మాటా నువ్వనేది? ఇప్పు డామె అనుజ్ఞలతో పని లేదు. మీరు విడిపోయి ఈ ఇంటి కెప్పు డొచ్చారో, ఆనాటితోనే, ఆవిడతో పని తీరి పోయింది. ఇప్పుడు మీవారి అనుజ్ఞ అయితే చాలు," అన్నది తల్లి.

"కాదు! కాదు! ఆమె బతికున్నంతవరకూ—ఎక్కడున్నా సరే, సమస్తమూ ఆమే! నువ్వెన్ని చెప్పినా ఆవిడ అనుజ్ఞ లేందే ఇల్లు కదల్లేనమ్మా. లేకపోతే బావ గారు నొచ్చుకుంటారు," అన్నది బిందువాసిని.

బిందు తల్లి యిక అంతగా పట్టుపట్టలేదు. వచ్చిన బంధు జనమంతా యెవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. అంత పెద్ద యింట్లో బిందు ఒంటరిదానిలా బాధపడ సాగింది. కింది అంతస్తులోని ఒక భాగంలో ఏలోకేని వుంటున్నది. పై అంతస్తులో బిందు వుంటున్నది. మిగతా మేడ అంతా బావురుమంటూ ఖాళీగా వున్నది. ఎప్పుడో భవిష్యత్తులో—ఆ కొడుకూ, కోడలూ ఉంటారని భావించి బిందువాసిని, ఆ పై అంతస్తు కట్టించింది.

ఒకనాటి ఉదయం మాధవుడు ఆఫీసు గదిలో కూర్చుని కాయితాలు చూసు కుంటూండగా, బిందు అక్కడి కొచ్చి, "బావగారు నౌకరీ చేస్తున్నారా?" అని అడిగింది.

మాధవుడు తలెత్తకుండానే, "అవును," అన్నాడు.

"అవునేమిటి? ఇది వారు నౌకరీ చేయదగ్గ వయసా?" అన్నది బిందువాసిని.

"ఎవరూ వయసునుబట్టి నౌకరీలు చేయరు, తిండిలేక అవసరం కొద్దీ చేస్తారు," అన్నాడు మాధవుడు.

"వారికి తిండి కెందుకులేదు? మేం తోడికోడళ్ళం పరాయివాళ్ళం పోట్లాడు కుంటాం. మీకు వారు అన్నగారేగా!" అన్నది బిందు.

"సవతి తల్లి బిడ్డలం. జ్ఞాతులం!" అన్నాడు మాధవుడు.

ఆ మాటలకు బిందు విస్తుపోయి, "మీరు బతికుండగానే వారిచేత నౌకరీ చేయిస్తారా?" అన్నది.

మాధవుడు తల పైకెత్తి భార్యకేసి చూసి, "ఎందుకు చెయ్యనియ్యను? ఈ లోకంలో ఎవరి అదృష్టం వారిది. దానికి దృష్టాంతరం నేనే. తలిదండ్రు లెప్పుడు పోయారో నే నెరగను. కాని, ఏనాడూ కష్టాలు నన్నంట లేదు. కాలేజీ ఫీజూ,

పుస్తకాలకు డబ్బు ఎక్కణ్ణించి తెచ్చి చెల్లించారో కూడా తెలియదు. తరవాత నేను ప్లీడరు నయ్యాను. ఇంతలో నువ్వు యింత డబ్బు మూటగట్టుకుని యీ ఇంటికి వచ్చావు. పెద్ద మేడ కూడా తయారైంది. కాని, అన్నగారి సంగతి! ఎప్పుడూ ఎముకలు విరిగేటట్టు కష్టపడతారు. చిరిగిన బట్టలు కడతారు. ఏదో కొన్నాళ్ళు మనతోపాటు సుఖంగా కాలక్షేపం చేశాడు. అందుగ్గాను భగవంతుడు వడ్డీతో సహా కట్టిపుచ్చుకుంటున్నాడు," అన్నాడు.

బిందు స్తంభించిపోయింది, నోటమాట పెగల లేదు. మాధవుడు ఏదో కాయితం కోసం వెతుకుతూ, "ఉద్యోగం కూడా భలే ఉద్యోగం! రాధాపురపు తాలూకు రానూపోనూ అయిదుకోసులదూరం. తెల్లారగట్ల నాలుగ్గంటలకే లేచి పగ లల్లా తిండీ తిప్పలూ లేకుండా పనిచేసి, రాత్రికి ఇంటికి వచ్చి, రెండు మెతుకులు తినటం—జీతం కూడా యెంత? పన్నెండు రూపాయలు!" అన్నాడు.

బిందు ఆపాదమస్తకం కంపించిపోతూ, "పగలల్లా తిండి లేదా? పన్నెండు రూపాయిల జీతమా?" అన్నది.

"అవును. పెద్దతనం వచ్చింది, నల్లమందు వేసుకుంటాడు. భగవంతుడికి ఆయన మీద దయ కలిగినట్టుంది. ఇక కొద్ది కాలంలోనే ఆయన కష్టాలు గట్టెక్క వచ్చు," అన్నాడు మాధవుడు.

బిందు కళ్ళవెంట బొటబొట నీరుకారింది. ఆమె భర్త పాదాల మీద పడి ఏడుస్తూ, "బావగారికి ఏదైనా ఏర్పాటు చెయ్యండి. ఆ బండ చాకిరితో యెంతో కాలం బతకరు," అన్నది.

మాధవుడు కూడా కన్నీళ్ళు పెట్టుకుని, "నేనేం చెయ్యను, వదిన మన డబ్బు చిల్లి కానీ ముట్టదు," అన్నాడు.

"అదేం నాకు తెలియదు. మీరు నాకు దైవము. వారు మీకంటే ఎక్కువ... మనసులో అనుకోవటానిక్కూడా వీల్లేని మాట!" అన్నది బిందువాసిని.

మాధవుడు కుర్చీలోంచి లేస్తూ, "ఒకసారి ఆ యింటికి వెళ్ళిరా. వాళ్ళ ఎదట నిలబడు. అన్నీ చక్కబడతాయ్," అన్నాడు.

బిందు బొంగురుపోయిన గొంతుతో, "మీరు వెళ్ళండి. వెళ్ళకపోతే అమూల్యడి మీద ఒట్టు!" అన్నది.

"నువ్వు వెయ్యి ఒట్లు వేసునున్నా నేను పోయి అన్నగారితో యీ డబ్బు వ్యవహారం మాట్లాడలేను. ఆ సాహసం నాకు లేదు," అన్నాడు మాధవుడు.

బిందు కదలా మెదలక నిలబడి భర్త ముఖంలోకి చూడసాగింది. "నువ్వు వెళ్ళ లేవా?" అని అడిగాడు మాధవుడు.

బిందు "ఊహుఁ, వెళ్ళలేను," అని మెల్లిగా జవాబు చెప్పి అక్కణ్ణించి కదిలి తన గదికి వెళ్ళిపోయింది.

## 8

మాధవుడు కొత్తగా కట్టిన మేడముందు నుంచే బడికి వెళ్లే దారివుంది. మొట్టమొదట కొన్నాళ్ళు గొడుగు అడ్డం పెట్టుకుని, ఆ దారి వెంట వెళ్ళేవాడు అమూల్యుడు. రెండు రోజులుగా ఆ ఎర్రగొడుగు ఆ మార్గాన వెళ్ళటం లేదు. అయినా బిందు మేడ మెట్ల మీది గది పక్కన కూర్చుని అలాగే చూస్తున్నది. సాయంకాలం అయినా అమూల్యుడు ఆ దారి వెంట రాలేదు.

బిందు కళ్ళు తుడుచుకుంటూ కిందికి దిగివచ్చి, నరేంద్రుణ్ణి పిలిచి, "ఏరా, నరేన్! స్కూలుకు వెళ్లే దారి ఇదే కదా? అమూల్యుడు కనబడడేం?" అని అడిగింది.

"వాడీ దారిన రావటానికి సిగ్గుపడుతున్నాడత్తా. అట్లా అట్లా తిరిగి స్కూలుకు వస్తాడు," అన్నాడు నరేంద్రుడు.

బిందు మనస్సు చివుక్కుమన్నది. అయినా బలవంతాన చిరునవ్వు తెచ్చుకుని, "సిగ్గెందుకు? ఈ దారినే రమ్మని చెప్పు," అన్నది.

"రాడు. ఎందుకు రాడో తెలుసా?" అన్నాడు నరేంద్రుడు.

"ఎందుకని?"

నరేంద్రుడు మెల్లిగా, "ఆ మూడో పంతులున్నాడే, ఆయన అమూల్యుడి చెవులు బాగా మెలేశాడు," అన్నాడు.

బిందు మండిపడిపోతూ, "ఎందుకు మెలేశాడు? వాడి ఒంటి మీద చెయ్యి వెయ్యవద్దని నేను చెప్పలా?" అన్నది.

నరేంద్రుడు చేతులూ తలా తిప్పుతూ, "ఇదంతా నాకు టిఫిన్ తెచ్చిపెట్టే నౌకరు వెధవ్వల్ల జరిగింది. వాడు నాకు టిఫిన్ తెచ్చేసరికి అమూల్యుడు పరిగెత్తుకుంటూ వచ్చి, ఏమిటో చూపు? అన్నాడు. ఆ సంగతి నౌకరు అమ్మతో చెప్పాడు. అమ్మ, అమూల్యుడివి దిష్టికళ్ళనీ, టిఫిన్ వాడికి చూపొద్దనీ నాకు చెప్పి, ఈ సంగతి పంతులుతో అన్నది. పంతులు అమూల్యుడి చెవులు మెలేశాడు," అన్నాడు.

"అమూల్యుడికి ఎవరూ టిఫిన్ తీసుకురావటం లేదా?" అని అడిగింది బిందువాసిని.

"టిఫిన్ ఎక్కణ్ణించి వస్తుందత్తా? పాపం, వాళ్ళు చాలా పేదవాళ్లు. వాడు కానీని అటుకులు జేబులో పోసుకొచ్చి, చెట్ల చాటుకు పోయి కూచుని, తింటాడు," అన్నాడు నరేంద్రుడు.



బిందువాసిని కళ్ళముందు మేడా, దాని ముందున్న చెట్లూ గిర్రున తిరగసాగినై. ఆమె నిలబడ్డ చోటే కూలబడిపోయి, "ఇక నువ్వు పో, నరేన్!" అన్నది.

ఆ రాత్రి మాధవుడు భోజనం చేసి పడకగదిలోకి పోయి పడుకుని అలా కళ్లు మూశాడు. బిందు అక్కడికిపోయి కాళ్ళదగ్గిర కూర్చున్నది. చప్పుడుకు మాధవుడు కళ్ళు తెరిచి, "ఏమిటి?" అని భార్యను ప్రశ్నించాడు.

బిందు మాట్లాడకుండా తల వంచుకున్నది. మాధవుడు ఆమె మనోబాధ గుర్తించి, "నా దగ్గిర దిగులుపడి యేం లాభం? వదినె దగ్గిరకు వెళ్ళు," అన్నాడు.

బిందు పెద్దగా ఏడుస్తూ, "మీరు వెళ్ళండి," అన్నది.

"నేను నీ తరఫున వెళ్ళి చెబితే అన్నయ్య వినడు," అని మాధవుడు పక్కకు తిరిగి పడుకున్నాడు. బిందువాసిని కొంచెంసేపు అక్కడే కూర్చుని, మెల్లిగా లేచి పోయింది.

మర్నాటి ఉదయం యాదవుడు, బిందువాసిని తండ్రికి జబ్బుగా వున్నదనీ, అవిడను వెంటనే పుట్టింటికి పంపమనీ, తమ్ముడికి ఉత్తరం రాసి పంపాడు. ఆ వుత్తరం చూసి బిందువాసిని కంట నీరు పెట్టుకుని, వాడావిడిగా పుట్టింటికి ప్రయాణమైంది. బండి కదలబోయే సమయంలో ఆమె, వృద్ధురాలయిన వంటావిడకు నమస్కారం చేసి, "నువు ఎలాగయినా బ్రాహ్మణ బిడ్డవు, వయసున పెద్దదానివి. మళ్ళీ యిక్కడికి తిరిగి రానవసరం లేకుండా, ఇదే నాకడసారి ప్రయాణమయ్యేట్టు ఆశీర్వదించు," అన్నది.

వంటావిడ ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేక బావురుమన్నది.

ఆ సాయంత్రం వంటావిడ యాదవుడి ఇంటికిపోయి, ఓందువానిని అన్న మాటలు అన్నపూర్ణకు చెప్పింది. రాత్రి భర్త ఇంటి రాగానే అన్నపూర్ణ అతడికి యీ సంగతి చెప్పి, నిట్టూరుస్తూ, "అయ్యో, ఈ వెళ్ళటమే కడసారి వెళ్ళటం అనుకుందిట, చెల్లి. దేవుడు చల్లగా చూసి, మా అమ్మను మా ఇంటికి క్షేమంగా చేర్చాలి," అన్నది.

"నువు మొందటినుంచీ ఆవిడ మనను సరిగా అర్థం చేసుకున్నావు కావు. మా అమ్మ మనకు ఎంత మంచిదో మీరెవరూ గుర్తించలేదు," అన్నాడు యాదవుడు.

"అది కూడా, అక్కయ్యా, అంటూ ఓసారి యిక్కడికొచ్చింది కాదు. కావాలంటే తన బిడ్డను బలవంతంగా తీసుకుపోవచ్చు. గృహప్రవేశం రోజున పొద్దుగూకులూ పనిచేసి తిరిగొస్తూంటే, నన్నెన్ని మాటలన్నది!" అన్నది అన్నపూర్ణ బాధగా.

"ఇంత వయసొచ్చినా క్షమించకపోతే... పెద్దదానవై ఏం లాభం? మాధవుడూ, నువ్వూ కలిసి మా అమ్మ ప్రాణాలు బంధించి వధచేసి పారేస్తున్నారు," అన్నాడు యాదవుడు.

అన్నపూర్ణ కళ్ళవెంట జలజలా నీళ్ళు రాలినై. ఈ సంభాషణ వింటున్న అమూల్యుడు, యాదవుణ్ణి, "నాన్నా! అమ్మరానని ఎందుకు చెప్పిపోయింది?" అని అడిగాడు.

అన్నపూర్ణ కళ్ళు తుడుచుకుని, "ఏరా, మీ అమ్మ దగ్గిరకు వెడతావా?" అని అడిగింది.

అమూల్యుడు తల తిప్పుతూ, "వెళ్ళను!" అనేశాడు.

అయిదారు రోజుల తర్వాత యాదవుడు కచేరీకి వెళ్ళవలసిన సమయంలో చుట్ట కాలుస్తూ కూర్చున్నాడు. అన్నపూర్ణ తొందరచేస్తూ, "వేళ కావస్తున్నది," అన్నది.

యాదవుడు తొట్రుపడుతూ చుట్ట అవతల పారేసి, "ఇవ్వాళ నా మనస్సేం బావోలేదు. రాత్రి మా అమ్మ వచ్చి తలుపు చాటున కూర్చున్నట్టు కలవచ్చింది, రామా! రామా!" అనుకుంటూ లేచి కచేరీకి బయలుదేరాడు.

ఆ పగలు అన్నపూర్ణ దుఃఖభారంతో కుమిలిపోతూ వంటపనులు చేసుకుంటూండగా, మాధవుడి నౌకరొకడు వచ్చి, "చిన్నమ్మగారికి చాలా జబ్బుగా వుందట. మరిదిగారు చూట్టానికి వెళ్లారు," అని చెప్పాడు.

అన్నపూర్ణ కంపించిపోతూ, "ఏం జబ్బురా?" అని అడిగింది.

"వివరాలు తెలియవమ్మా. మాటిమాటికీ మూర్ఛ వస్తున్నదనీ, బాగా జబ్బు చేసిందనీ అంటున్నారు," అన్నాడు నౌకరు.

యాదవుడు రాత్రికి ఇంటికొచ్చి, యీ వార్త విని బావురుమన్నాడు. "ఎంత సంబరపడి బంగారు ప్రతిమలాంటి మరదల్ని తెచ్చుకున్నానో ఎరుగుదువా? నే నిప్పుడే వెళతాను," అన్నాడతను.

అన్నపూర్ణ విచారంతో కుంగిపోతూ వరండాలోకి పోయి, అక్కడి చీకట్లో కూలబడ్డది. కొద్దిసేపటికి వాకిట్లో మాధవుడి మాటలు వినిపించినై. అన్న పూర్ణ ప్రాణాలు బిగపట్టుకుని, చెవుల్లో వేళ్లు కుక్కుకుని రాయిలా కూర్చున్నది.

వంటిల్లంతా చీకటిగావుండటం చూసి మాధవుడు యిటువైపు గదిలోకివస్తూ, చీకట్లో కూర్చున్న అన్నపూర్ణను చూసి, "వదినా, బహుశా విని వుంటావు!" అన్నాడు.

అన్నపూర్ణ తల ఎత్తలేకపోయింది. "అమూల్యుడు వెళ్ళటం చాలా అవ సరం. కాలం ముగుస్తున్నట్టుంది," అన్నాడు మాధవుడు.

అన్నపూర్ణ కిందపడి ఏడ్వసాగింది. యాదవుడు మతిపోయినవాడల్లే అక్కడికి పరిగెత్తుకువచ్చి, "నేను చెపుతున్నానుగా, అలా ఎన్నటికీ జరగదు, మధూ! నేను తెలిసిగాని తెలియకగాని ఎవళ్ళకీ బాధ కలిగించలేదు. భగవంతుడీ వయసులో నా కిటువంటి శిక్ష వేయడు," అన్నాడు.

మాధవుడు మాట్టాడలేదు. "నువ్వేమీ ఆదుర్దా పడొద్దు, మాధవ్. నే వెళ్ళి మా అమ్మను తీసుకొస్తాను. బండి సిద్ధంగా వుందా?" అన్నాడు యాదవుడు.

"నేనేం ఆదుర్దాపడటంలేదు, మీరే పడుతున్నారు," అన్నాడు మాధవుడు.

"త్వరగా బండి పిలు. లేకపోతే నడిచేవెళతా," అంటూ యాదవుడు అటూ యిటూ తిరగసాగాడు.

మాధవుడు వెళ్ళి బండి తీసుకొచ్చాడు. అందరూ - అన్నపూర్ణా, అమూల్యు డితో సహా బండెక్కారు. "ఆఁ ఆఁ, సంగతేచెప్పు," అన్నాడు యాదవుడు.

"నేనయితే లేను. నాలుగైదురోజులపాటు జ్వరం కాసిందట. తరవాత మూర్ఛలు రావటం మొదలైంది. అప్పటినుంచి మందు సంగతటుంచి, ఎవరూ ఒక్క పాలచుక్కకూడా తాగించలేకపోయారట. ఇప్పుడెలావుందో తెలీదు, బతుకుతుం దని ఆశ లేదంటున్నారు," అన్నాడు మాధవుడు.

"ఆశ లేకపోవటం ఏమిటి, కావలసినంతుంది, మాధవ్! మా అమ్మ బతుకు తుంది. భగవంతుడు యీ వయసులో నా మాట అబద్ధం కానీయడు," అన్నాడు యాదవుడు పెద్దగా.

మాధవుడు ఒంగి అన్నగారి పాదాలకు నమస్కరించి మెదలకుండా పూరు కున్నాడు.

# 9

ఎన్నాళ్లుగా బిందువానిని అన్నం తినకుండా కృశించిపోతున్నదో-ఆ సంగతి ఎవరూ తెలుసుకోలేకపోయారు: పుట్టింటికి వెళ్ళగానే ఆమెకు జ్వరం వచ్చింది. మర్నాడు రెండుమూడుసార్లు మూర్ఛలు వచ్చినై. వైద్యులు ఎంతో ప్రయత్నంచేసిన మీదట ఆమెకు కొద్దిగా తెలివి వచ్చింది. కాని నాడి మాత్రం చాలా బలహీనంగా వున్నది.

బిందు యిలాంటిస్థితిలో వుండగా మాధవుడు వెళ్ళాడు. ఆమె భర్త పాదాలకు నమస్కరించింది. కాని, అతను పాలు నోట్లో పోయబోగా పళ్ళు గట్టిగా బిగించుకున్నది. ఎంత బతిమాలినా ఒక్క చుక్కయినా మింగలేదు.

మాధవుడు హతాశుడై పోయి, "ఆత్మహత్య చేసుకోవటం ఎందుకు?" అని అడిగాడు.

బిందు కనుకొలకుల నుంచి అశ్రువులు జాలువారుతున్నై. ఆమె కొంచెం సేపు పూరుకుని, హీనమైన స్వరంతో, "నా ఆస్తిపాస్తులన్నీ అమూల్యుడి కివ్వండి. రెండువేలు మాత్రం నరేంద్రుడి కివ్వండి - బాగా చదివించండి. వాడికి అమూల్యుడంటే చాలా ప్రేమ," అన్నది.

మాధవుడు ఎంతో ప్రయత్నంమీద దుఃఖాన్ని ఆపుకోగలిగాడు. బిందు భర్తను మరింత దగ్గరగా రమ్మని సౌంజ్ఞ చేసి, "నా అంత్యక్రియలు అమూల్యుడు తప్ప మరెవరూ చేయటానికి వీల్లేదు," అన్నది.

మాధవుడు దుఃఖాన్ని పళ్ళబిగువున ఆపుకుంటూ, "ఎవరినైనా చూడాలని వుందా?" అని అడిగాడు.

బిందు తలాడిస్తూ, "లేదు," అన్నది.

బిందు తల్లి వచ్చి మందియ్యబోయింది, కాని బిందు పళ్ళు బిగించి పక్కకు తిరిగి పడుకున్నది.

* * *

సూర్యోదయం అవుతున్న సమయంలో మాధవుడు గదిలోకి వచ్చి, దీపం ఆర్పి, కిటికీ తలుపులు తెరిచాడు. బిందు కళ్ళు తెరిచి భర్తను చూసి, చిరునవ్వు నవ్వి, "ఎప్పుడొచ్చారు?" అని అడిగింది.



"ఇదే రావటం. అన్నయ్య పిచ్చివాడిలా విలపిస్తున్నాడు," అన్నాడు మాధవుడు.

"ఆ సంగతి నాకు తెలుసు! వారి పాద ధూళి ఏమన్నా తెచ్చారా?" అన్నది బిందువాసిని.

"ఆయనా వచ్చారు, బైట కూర్చుని చుట్ట కాలుస్తున్నారు. వదినెగారు కాళ్లు కడుక్కుంటున్నారు. అమూల్యుడు బండ్లోనే నిద్రపోయాడు. తీసుకుపోయి మేడ మీద పడుకోబెట్టారు—తీసుకురానా?" అన్నాడు మాధవుడు.

బిందు కొంచెంసే పాగి, "వద్దులే, పడుకోనీయండి," అని పక్కకు వత్తిగిలి పడుకున్నది.

అన్నపూర్ణ గదిలోకి వచ్చి, మంచం తలగడ వైపున కూర్చుని, తల మీద చెయ్యివేయగానే బిందువాసిని ఉలిక్కిపడింది. అన్నపూర్ణ ఒకటి రెండు నిమిషాలు తనను తాను సంబాళించుకుని, "మందెందుకు పుచ్చుకోవటం లేదు చెల్లీ? చద్దామనా?" అన్నది.

"ఏమో...తెలుసు, అక్కా!" అన్నది బిందు మెల్లిగా.

"మొహం యిటు తిప్పు. మీ బావగారు నిన్నింటిక్కి తీసుకుపోవటానికి

స్వయంగా వచ్చారు. కుర్రాడు యేడ్చి యేడ్చి నిద్రపోయాడు. నా మాట విని మొహం యిటు తిప్పు," అన్నది అన్నపూర్ణ.

బిందువాసిని అప్పటికీ మొహం తిప్పలేదు. యాదవుడు అక్కడికి వచ్చి, నిమిషం సేపు రెప్పవేయకుండా బిందు కేసి చూసి, కన్నీరు గుడ్లలో కుక్కుకుంటూ, "ఇంటికి వెళదాం లే, అమ్మా! తీసుకువెళ్ళటానికి వచ్చాను," అన్నాడు.

ఆ సమయాని కా గదిలోకి బిందు తల్లి తండ్రీ, నౌకర్లూ వచ్చారు. వాళ్ళు యాదవుడి ముఖం చూసి కన్నీళ్ళు పెట్టుకున్నారు. యాదవు డొకక్షణం మౌనంగా వూరుకుని, బొంగురుపోయిన గొంతుతో, "ఒకనాడు... నీవింత దానవై వుండగా, మా ఇంటి లక్ష్మిలాగ నిన్ను తీసుకువెళ్ళటానికి వచ్చాను. మరోసారి ఇక్కడికి రావలసి వుంటుందని నేనానాడు అనుకోలేదు. నామాట విను! వచ్చింతర్వాత నిన్ను తప్పక తీసుకుపోవాలి, లేకపోతే మరి ఆ ఇంటికేసి తలెత్తి చూడను. నేనబద్ధం ఆడనని నీకు తెలుసుగా, అమ్మా!" అన్నాడు.

యాదవుడిలా అని గది నుంచి బైటికిపోయాడు. బిందువాసిని, అన్నపూర్ణ కేసి ముఖం తిప్పి, "ఇక ఏం చివాట్లు పెడతావో పెట్టక్కా! అబ్బాయిని నా పక్కలో పడుకోబెట్టి, మీరంతా బైటికిపోయి కాస్త విశ్రాంతి తీసుకోండి. ఇంకేం భయం లేదు... నేను చావను!" అన్నది.






# ఒకే ప్రశ్న రెండు జవాబులు

అమ్మా! నువ్వూ, నాన్నగారూ అంగీకరించకున్నా సరే, మేమందరం కలిసి, మీకు షష్టిపూర్తి మహోత్సవం చేసితీరుతాం!" అన్నారు ముక్తకంఠాలతో ప్రభాకర్, భాస్కర్, లలిత, సవిత!

"మిమ్మల్ని మేం సపోర్టు చేస్తున్నాం!" అన్నారు ప్రభాకర్ భార్య రోహిణి, భాస్కర్ భార్య రజని, లలిత భర్త శ్యాంప్రసాద్, సవిత భర్త రామ్మోహన్!

ప్రభాకర్, భాస్కర్‌లు మా కొడుకులు; లలిత, సవిత మా కూతుళ్ళు।

మరి యిద్దరు కొడుకులు, యిద్దరు కూతుళ్ళు, కోడళ్ళు, అల్లుళ్ళు అంత పట్టు దలగా, ముచ్చటపడి వేడుక జరిపిస్తా మనాలేగానీ, వద్దనే తల్లిదండ్రు లుంటారా ఎక్కడేనా? శ్రీవారూ, నేనూ సంతోషంగా అంగీకరించాం। పిల్లలందరి సంతోషానికి అవధుల్లేవు।

"అమ్మా! ఇక్కడ.... ఈ పల్లెటూళ్ళో ఆ ఉత్సాహం ఏమంత గొప్పగా వుండదు। హైద్రాబాదులో అయితే, ఎంతోమంది గొప్పగొప్ప ఆహూతులు వస్తారు........ డబ్బు ఖర్చు అయినా చాలా సరదాగా.... గ్రాండ్‌గా వుంటుంది!" అన్నాడు ప్రభా కర్. ప్రభాకర్ అంబాలాలో ఆర్మీ డాక్ట రుగా పనిచేస్తున్నాడు. హోదా, సిరీ— సంపదా అన్నీ వున్నాయి। హైద్రాబాదులో ఈ మధ్యే పెద్ద బంగళా కొన్నాడు.

"అసలు అన్నయ్య ఆలోచనలో మరో కిటుకుంది అమ్మా!" అన్నాడు భాస్కర్ నవ్వుతూ, ప్రభాకర్ వేపు చూస్తూ.

"ఏమిటో చెప్పవోయ్ మరదీ!" అంది రోహిణి.

"ఈ సాకుతో—ఎక్కువ పలుకుబడి గల పెద్దల్ని పరిచయం చేసుకోవా లనీ...."

"సర్లె! ఎలా అయినా అనుకోండి. అక్కడయితేనే వసతిగా వుంటుంది!" అన్నాడు ప్రభాకర్. ముందు ఏర్పాట్లు చేయించడానికై పిల్లలందరూ నాలుగు రోజులు ముందుగానే వెళ్ళి పోయారు. రెండురోజుల తర్వాత నేనూ, శ్రీవారూ బయల్దేరాం। ట్రెయిన్‌లో ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లో హాయిగా వుంది ప్రయాణం....మరో ఇద్దరు ప్రయాణీకులు తప్ప మరెవరూ లేరు।

వారు హాయిగా నిద్రపోతున్నారు. నాకు మాత్రం నిద్ర రావటంలేదు. నా హృదయం ఆనందంతో, గర్వంతో, తృప్తితో నిండివుందీ క్షణంలో.

నలుగురు బిడ్డల తల్లిని। అందరికి అందరూ ఉన్నతవిద్యలూ, సిరిసంపద లతో హాయిగా బ్రతుకుతున్నారు। అంతే కాదు, చాలా కుటుంబాలలో అల్లుళ్ళూ, కూతుళ్ళూ కీచులాడు కుంటూండటం చూశాను. అత్తింటి వేపువారికీ, అల్లు ళ్ళకూ ఉప్పూ, నిప్పూలా వుండటమూ నాకు తెలుసు। మరికొన్ని కుటుంబాలలో కొడుకులూ, తల్లిదండ్రులూ ఆగర్భశత్రు వుల్లా పోట్లాడుకోవటమూ, ముఖాలు చూచుకోకుండా వుండటమూ నాకు తెలుసు। అత్తగార్లనీ, మామగార్లనీ పురు గుల్నిలా విదిల్చివేసే కోడళ్ళూ నాక్కని పించారు। తల్లిదండ్రుల పరువు బుగ్గిచేసి స్వైరవిహారం చేసే కూతుళ్ళను చూశా న్నేను।

కానీ నా బిడ్డలు మాత్రం....పై వారంద రిలాకాక, సంస్కారమూ, సహృదయత,

నాగరికతలు సమపాళ్ళుగా జీర్ణించుకున్న వారు! వారికి జీవితసహచరులుగా వచ్చిన వారు కూడా అలాటివారే! దూరదూర ప్రాంతాల్లో ఉద్యోగరీత్యా వున్నవారంతా ప్రతి ఏడాదీ మా దగ్గరకు వచ్చి మా యిద్దరికీ స్వర్గం యిక్కడే వుందని నిరూపించి మరీ వెడతారు! ఇంతకంటే మా క్కావలసినదేమిటి!

ఈనాడు—జరగబోతున్న ఈ షష్టి పూర్తి—మా దంపతుల బంగారు కలల పరమావధి!

"వేడివేడి శనక్కాయలు....శనక్కాయల్!" ఖంగుమంటున్న గొంతులో ఆలోచనలు ఎగిరిపోయాయి! శ్రీవారు కూడా అప్పుడే నిద్రలేచారల్లే వుంది. శాలువా దగ్గరగా లాక్కుంటూ కూర్చున్నారు.

ఆ శనక్కాయలమ్మే కుర్రాడు మా బెర్త్ దగ్గర్నుంచి కదల్లేదు. మాకేసే చూస్తున్నాడు. శ్రీవారు వాడి వేపు చూచి నవ్వారు. "వద్దురా బాబూ! చాలావరకు పళ్ళూడిపోయాయి మా యిద్దరికీ! నమల్లేము!"

కానీ ఆ కుర్రాడు కదల్లేదు...."బాబుగారూ! తవరు....తవరు....వేణుగోపాలరావు కదండీ? అమ్మగోరూ.........తవరు రాధమ్మగోరు కదండీ!" అన్నాడు శనక్కాయలబుట్ట బెర్త్‌మీద పెట్టుకుని—మా ఎదురుగా కూర్చుంటూ!

వారితో బాటు నేనూ ఆశ్చర్య పోయాను....

"ఇంకా నన్ను గుర్తుపట్టలేదాండీ! నేనేనండీ రాముల్ని! మీ శేషు తమ్ముణ్ణి!"

ఒక్కసారిగా మెరుపు కొట్టినట్లైంది నాకు. శేషు! శేషు గుర్తుకువచ్చింది.

"ఓహో! నువ్వట్రా రాములూ! అప్పుడు బాగా చిన్నవాడివి. ఇప్పు డెదిగిపోయావు. పైగా నాకు చూపు సరిగా ఆనదు....గుర్తించలేక పోయాను. సర్లె! ఇంతకూ శేషు ఎక్కడుంది?" శ్రీవారి ప్రశ్న.

"ఇంకెక్కడిశేషు బాబూ! అది పాపం! తెగులుతో తీసుకుని తీసుకుని....ఆరేళ్ళు మంచంలోవుండి.....పదిరోజుల కిందటే చచ్చిపోయింది! పాపం! చచ్చేముందు కూడా మీ గురించి చెబుతానే వుణ్ణిందంటీ!"

"పాపం!" శ్రీవారి కళ్ళల్లో జాలి....
నాకు ఒళ్ళంతా ఏదో కోపం! మరేదో సంతోషం....

శేషు చచ్చింది! తెగుళ్ళతో తీసుక తీసుక చచ్చింది! కావల్సిందే! నేనన్నట్లే, నేనాశించినట్లే జరిగింది దానికి! విజయ గర్వంతో శ్రీవారికేసి చూశాను.........నా కళ్ళల్లోని భావం పసిగట్టారో ఏమో.... విరసనగా ముఖం చిట్లించుకున్నారు.

"అయితే......మీ అక్కను ఉద్ధరిస్తా నన్న ఆ మేనత్త కొడుకు ఏమయ్యాడురా?" అక్కసుగా అడిగాను. రాములు నిర్లిప్తంగా నవ్వాడు."ఏ మేనత్తకొడుకు

ఉద్ధరిస్తాదమ్మగోరూ? చెడిందాన్ని? ఆ దెప్పుడో జారుకున్నాడు. ఎట్టాగో నేనే సాకాను...మా అమ్మ చచ్చి కూడా నాలు గేళ్ళు కావొత్తోంది........తమ రెక్కడి కెల్తుండారండీ!" గర్వంగా చెప్పాను. పక్కస్టేషన్ రాబోతూండగా రాములు, తన బుట్ట బుజానికి తగిలించుక లేవాడు శలవు తీసుకుంటూ. శ్రీవారు వాడి చేతిలో పదిరూపాలనోటు పెట్టారు. వాడు దిగి వెళ్ళిపోయాక—

"పాపం! ఇంకా 'శేషు' మీద జాలి కరిగిపోయినట్లుంది మీలో!" అన్నాను హేళనగా!

నా వేపు క్షణకాలం చూశారు.... "ఇంకా నీలో మానవత్వం చోటు చేసుకో లేదల్లే వుంది!" అన్నారు మెల్లిగా! నాకు ఒక్కసారిగా కోపం ముంచుకువచ్చింది! ఎంతమాటన్నారు? శేషును పల్లెత్తుమాట అనకూడదు ఈయనగారిముందు!సుమారు ఇరవై సంవత్సరాల క్రితం శేషు విష యంలో ఇలాగే తీవ్రవాగ్బాణాలు విసురు కున్నాం! ఆనాటి కీనాడు మళ్ళీ "శేషు" (చచ్చిపోయినా!) కారణంగా మాటల ఈటెలు విసురుకున్నాం!

శ్రీవారు శాలువా కప్పుకుని మళ్ళీ పడుకున్నారు. నాకు నిద్రరావటం లేదు. శేషు చుట్టూరానే ఆలోచనలు పరిభ్రమింప సాగాయి....అవి నన్ను పట్టు బలవం తంగా గతంలోకి నెట్టుకు వెళ్ళాయి.

* * *

పెళ్లైన ఆరేళ్ళ తర్వాత కూడా—నా జీవితంలో ఏలాటి విసుగూ, నిరాశా చోటుచేసుకోలేదంటే, నేనెంత అదృష్ట వంతురాలినో-అని నేనే మురిసిపోతాను!

కారణం అత్తమామల, ఆడబడుచుల అదుపూ, ఆజ్ఞలు లేని కాపురం. గృహ సీమకు నేను రాణిని.....నాకు శ్రీవారు సర్వస్వం!

గృహకృత్యాలకూ, గృహసీమకూ సంబంధించినంతవరకూ శ్రీవారు ఏలాటి జోక్యమూ కల్పించుకోరు.జమ ఖర్చులూ, పెట్టుపోతలూ—సర్వంనావే! ఇక ఇంత కంటే ఏం కావాలి స్త్రీకి! అలాగే శ్రీవారి ఆఫీసు విషయాల్లో, బయటి విషయాల్లో నేనూ తల దూర్చను! అంతకంటే 'రిలీఫ్' మగాడికేముంటుంది!

వచ్చిన చిక్కల్లా పనిమనుషులతో నే! ఈ విషయంలో నాకు చాలా నిక్కచ్చి అయిన అభిప్రాయాలున్నాయి! చక్కగా నేను చెప్పిన అన్ని పనులూ 'నీట్'గా చేయాలి.....గొణక్కూడదు.....యెదురు చెప్పకూడదు...పొరబాట్లు చేయకూడదు.

అన్ని నిబంధనలలో ఏ ఒక్కటీ నేను పడిలించుకోలేక పోవటంవల్ల నే నేమో... ఏ ఒక్క పనిమనిషీ పట్టుమని పదిరోజు లుండలేదు నా దగ్గర........ఒక్కసారి కాబోలు ఒకత్తె నెలరోజులు వుంది. "రికార్డుబ్రేక్ చేసిందోయ్!" అని అన్నారు శ్రీవారు ముప్పైయ్యో రోజు! ఆ మరు నాడే అదీ చాలించుకుంది! ఇక ఆ తర్వాత



నెలకు యిరవై రోజులూ నేనే పనిమనిషి అవతారం దాల్చాల్సివుండేది!

"పనిమనిషిని వుంచుకున్నా, తీసేసినా నీ పెత్తనమే—అది నీ రాజ్యం కాబట్టి నేను జోక్యం కల్పించుకోను!" అని శ్రీవారు ఒక్క బొల్చె నీళ్ళు కూడా తోడే వారు కారు.

ఆ రోజు...."అమ్మగోరూ...కాసిన్ని బిచ్చం వెయ్యండమ్మగోరూ!"

వరండాలోనుంచి కంచుగంటలా విని పించిన కేకతో, అసలే అంట్లు తోముతూ ఆయాసపడిపోతున్న నేను "ఓ పిడికెడు భిక్షం దానికి మీరు వెయ్యకూడదా!" అంటూ వరండాలోకి వచ్చాను చేతులు కొంగుకు తుడుచుకుంటూ! మరుక్షణం 'షాక్' తిన్నట్లయ్యాను. పద్దెనిమిదేళ్లుండ గల అమ్మాయి....నిండు యౌవనంతో మిసమిసలాడ్తున్న నల్లని శరీరంతో.... మూడు గజాల చాలీచాలని బట్ట, చిరుగు లలో—శరీరాన్ని దాచుకోవాలనే ప్రయ త్నంతో సతమత మైపోతోంది. పేపరు చాటు చేసుక శ్రీవారు హైరానపడిపోతు న్నారు ('జాలితో-బాధతో'-అని తర్వాత నాతో అన్నారు!)

"రాధా! ఓ పాతచీరె ఇవ్వు...క్విక్!" అన్నారు మెల్లిగా ఇంగ్లీషులో. అప్పటికి పరిస్థితి పూర్తిగా బోధపడింది. ఆ సరికే-అటు పూర్తిగా టౌనూ, ఇటు పూర్తిగా పల్లెటూరు కాని ఆ వూరిలోని—కొత్తగా పెట్టిన హైస్కూలు తాలూకు కుర్రాళ్ళు కొందరు-ఎదురింటి మేడమీది నుంచి ఆ అమ్మాయి అణువణువూ పరిశీలిస్తూ,

వ్యాఖ్యలు-నవ్వులూ, కేరింతలు ఈలలు రూపంలో బట్వాడా చేస్తున్నారు.

"త్వరగా ఇలారా!" అన్నాను.

ఆ అమ్మాయి వచ్చింది. లోపలికివెళ్ళి, ఓ నడిపాతచీరె, జాకెట్టు తెచ్చి దాని ముఖాన గిరాటు వేశాను.'త్వరగా కట్టుకో అవి. అయినా ఇంత సిగ్గులేకుండా వచ్చా వేమిటి!' అన్నాను కోపంగా. 'ఏం చెయ్య నమ్మగోరూ! గుడ్డల్లేవు!' అంటూ సణిగింది. 'ఇలా అడుక్కు-తినకుంటే ఎద్దల్లే వున్నావు. పనిపాట్లు చేసుకోలేవూ?' అది నా రెండో ప్రశ్న.

"పని త్తే చేత్తా నమ్మగోరూ!" వినయంగా అంది.

"మరి నీ కెవరున్నారు?"

"నా మొగుడు నన్నొగ్గేసిందమ్మగోరూ! ఆడికీ, నాకూ నా చిన్నతనంలో పెళ్ళయిందట! మా అమ్మ, తమ్ముడు వున్నారు. తమ్ముడు కూడా ఇట్టాగే అడుక్కు-తింటున్నాడు!"

"అఘోరించలేకపోయాడు! అడుక్కు-తినటం ఓ పెద్ద వుద్యోగంలావుంది మీ ప్రాణానికి! సర్లె, రేపట్నుంచి నా దగ్గర పనిచెయ్యి. జీతమిస్తాను. అన్నం పెడతాను! మీ తమ్ముడికి కూడా ఏదైనా పని నేర్పు...."

"ఓ!" సంతోషంగా అంగీకరించింది.

అలా 'శేషు' పనిమనిషిగా ప్రవేశించింది. అది వచ్చిన మరుక్షణం నుంచీ నాకు అదనంగా మరో రెండు కళ్ళు పుట్టుకువచ్చాయి! వాటిలో ఒకటి హమేషా శేషు వెనకాలే పరుగులు తీసేది. మరోటి శ్రీవారి మీదకు మళ్ళేది.

అలమారులో పెట్టిన చిల్లర డబ్బులు శేషుతీసి బొడ్డున దోపుకోవటం లేదుకదా? కొబ్బరినూనె సీసాలోనుంచి, నూనె వంపుకోవటం లేదుకదా? నా హేర్‌పిన్స్ ముట్టుకోవటం లేదుకదా? ఇలా పరిశీలించటమే నా మూడోకన్ను కార్యక్రమం.

ఇక నాలుగో కన్నుకు మరీ బ్రిస్క్-ప్రోగ్రాం! శ్రీవారు దానివేపు (శేషువేపు!) దొంగచూపులు చూడటం లేదు కదా? విన్నను ఈయనగారు దానికి తలనూనె కొనుక్కోమనీ, సబ్బు కొనుక్కోమనీ, ఓ రూపాయి యిచ్చారుట (ఆ సంగతి శేషే నాతో చెప్పింది. "నీ తలమీదికి నూనె ఎలా వచ్చిందీ?" అన్న నా మూడో కన్ను ప్రశ్నకు సమాధానంగా!)-మరి ఆ రూపాయి యివ్వటంలో దాన్ని పరిశుభ్రంగా వుండాలని శాసించటంలో ఆయనగారిలో 'స్వార్థం' ఏమీ లేదు కదా? బాత్‌రూం కిటికీలోంచి, పెరట్లో జామి చెట్టుక్రింద అంట్లు తోముతున్న 'శేషు'తో 'కళ్ళ' కబుర్లు చెప్పటంలేదు కదా? (ఛీ-ఛీ, ఆయనలాటి వారు కారు. సంస్కార హృదయులు. ఏకపత్నీ వ్రతులు....." అంటూ అడపా తడపా మనస్సు చీవాట్లు వేసినా—నాలుగోకన్ను బొత్తిగా ఖాతరు చెయ్యదలాటి మాటల్ని!)

"శుభ్రంగా తల దువ్వుకోవటం, వంటి

విండా బట్ట, కడుపునిండా తిండి అమర ఉంటో-నీ శేషు పోతపోసిన గ్రీక్ శిల్పంలా వుందోయ్ రాధా!'' అంటూన్న వారి మాట లలో అంతరార్ధం-ఆశ,ఏవేనావున్నాయా? ఇలాటి సవాలక్ష విషయాలు శోధించ టంతో క్షణం తీరిక దొరకటం లే దానాలుగోకన్నుకు!

షుమారు రెండు నెలల తర్వాత— పై రెండు కళ్ళూ అలసిపోయాయి. వాటి అవిరామ పరిశోధనలో — సత్ఫలితాలూ, అవి ఆశించిన సంఘటనలూ ఏవీ దొరక లేదు! దాంతో అసలు కళ్ళకు ఎక్కడలేని పౌరుషమూ వచ్చి, అ ద న పు కళ్ళను రెంటినీ పొడిచి పొడిచి పారేశాయి!

శేషు మెరికలా తేలింది. ఇంటి పను లన్నీ నిముషాలమీద చేస్తుంది! వంటపనికి కూరలు తరిగిస్తోంది. మసాలాలూ, పచ్చళ్ళు నూరి ఇస్తుంది. దాని తమ్ముడు రాములు కూడా దానికి సాయంగా పన్లు చేస్తున్నాడు. శ్రీవారికి బజారు పని తప్పింది. శేషు వచ్చాక నాకు పని మనుష లను మార్చే అవకాశమూ, పనిమనిషి అవతారమూ మరి వచ్చేందుకు ఆస్కారం లేకుండా పోయింది! ఒక్క మాటలో చెప్పాలంటే శేషులేకుంటే మేమెలా బ్రత గ్గలం? అన్న స్థితికి వచ్చేశాం! దాని క్కాస్త జలుబు చేస్తే చాలు—రెండు టాబ్లెట్స్ — ఓ కప్పు కాఫీ నేనే స్వయంగా ఇచ్చేస్తాను! (కారణం రేపొ ద్దున అది పడుకుంటే, నా నడ్డి విరిగి పోతుంది, చాకిరీ చేసుకోలేక. అన్న స్వార్థం నా అంతరాంతరాలలో వుంది.

శేషు అప్పుడప్పుడూ చెప్పే కబుర్లను బట్టి-దానికి చిన్నతనంలోనే 'వెంకడు' కిచ్చి పెళ్ళిచేసింది వాళ్ళమ్మ. వెంకడు బెంగుళూరులో మిలిట్రీ శిక్షణ కేంద్రంలో స్వీపరుగా పనిచేస్తున్నాడుట! అక్క డెవరో ఒక తైను చేరదీశాడుట. అంచేత దీన్ని పిల్చుకుపోలేదుట! ఇవన్నీ శేషు చెప్పింది.

"పాపం! నీ బ్రతుకెల్లా అయ్యిందే శేషూ! పోనీ వా డెప్పుడో ఓనాడు తిరిగి రాకపోడు! అందాకా కష్టాలు ఓర్చుకో! వాడొచ్చాక—హాయిగా చిలకా గోరిం కల్లా వు o దు రు గానీ!'' అన్నాను ఓదార్చుతూ.

"అదితో నేను బెంగుళూరెల్లనండమ్మ గోరూ!'' అంది శేషు భయంగా నా వేపు చూస్తూ.

"ఎందుకని?''

"కొట్టి చంపుతాడేమోనని భయం!'' అంది తలొంచుకుని. నాకు జాలేసింది. "పోన్లే ఇక్కడే వుందురుగానీ ఇద్దరూ. ఎలాగూ మీ అయ్యగారు పెద్ద ఆఫీస రయ్యారు. నౌకరుగా వాణ్ణేవేసుకుంటారు. నువ్వూ వాడూ మా యింటి దగ్గరే పడుం దురుగానీ!'' అన్నాను. నిజానికి పిల్లలు పుట్టాక, వాళ్ళ సంరక్షణ చూసుకోవడం నాకు తలకుమించిన పని అవుతోంది. హాయిగా శేషు పిల్లలకు స్నానాలూ—

బట్టలూ— పాలు కలిపివ్వడాలూ అన్నీ చూసుకొంటోంది. శేషు-వెంకడూ ఇద్దరూ ఉంటే నా పని హాయిగా వుంటుంది!

ఇలా నేను శేషు భవిష్యత్తును నిర్ణయిస్తూండగానే ఓ చిన్న సంఘటన జరిగింది. ఆ రోజు వుదయం ఎంచేతో కాస్త పెందరాళే నిద్ర మెళకువ వచ్చింది (శేషు వచ్చాక ఉదయం ఏడుదాటాకే నిద్రలేస్తున్నాను రోజూ!) పెరట్లోకి వెళ్ళాను. ఆ సరికే శేషు బాయిలర్‌లో నీళ్ళుపోసి, స్టవ్ మీద పాలు కాచుతోంది.... పెరట్లో గోడ అవతల ఎవరో యువకుడు నిల్చుని-సన్నగా "శేషూ!' అంటూ పిలిచాడు. ఇది మంత్రముగ్ధలా పెరటి గోడ దగ్గరికి వెళ్ళింది! ఇద్దరికిద్దరూ నన్ను గమనించ లేదు. గుసగుసలుగా కబుర్లు చెప్పుకుంటున్నారు! నవ్వుకుంటున్నారు.

కాస్సేపీ వరస చూచి — శేషును పిలిచాను. కంగారుగా వచ్చింది. "వాడెవడు? నీ మొగుడు గాని వచ్చాడా?" అన్నాను.

"కాదమ్మగారూ! మా మేనత్త కొడుకు!"

"రోజూ వస్తుంటాడా?" అనుమానంగా చూస్తూ అడిగాను. "ఊహూఁ! ఇయ్యాలే వచ్చాడు." అంది.

ఎంచేతో 'శేషు' వాలకం కనిపెట్టాలనిపించింది నాకు. పూర్తిగా వోని మూడో కన్ను నా ప్రయత్నానికి తన హర్షం వెలిబుచ్చింది!

మర్నాడు సినిమా హాల్లోంచి బయటికి వస్తూ—నేలవేపు ఎక్జిట్ నుంచి వస్తున్న శేషు-దాని మరో మేనత్త కొడుకునూ గుర్తించింది నా మూడో కన్ను.

ఇలా శేషు 'బావ'ల సంఖ్య ఎక్కువగానే ఉందని తెలిసిపోయింది!

చూచి చూచి ఓ రోజున కేక వేశాను దాన్ని. "నీ వరసేం బాగా లేదు. చెట్టంత మొగుడు బతికుండగా—వాడి కళ్ళుకప్పి, ఇలా తిరుగుతావా? ప్రతి 'బావ' తోనూ నీకు మాటలేమిటి?" అంటూ కేకలేస్తున్న నా ప్రశ్న పరంపర పూర్తి కాకుండానే శ్రీవారు నన్ను పిలిచారు. గదిలోకి వెళ్ళగానే "ఏమిటా అర్థంలేని కేకలూ? నీ ఈ 'బావ'తో నీకేం పనో, దానికీ దాని బావలతో అదే పని!" అన్నారు కొంటెగా నవ్వుతూ! మరో సమయంలో అయితే ఆ జోక్ ఎంజాయ్ చేసేదాన్నేమో కానీ, ఈ క్షణంలో వళ్ళు మండుకొచ్చింది. "నాకూ, దానికీ ఏమిటి సామ్యం?" అన్నాను మండిపడుతూ.

"ఏం? ఎందుకు లేదు? దానిలోనూ వయసుంది. మనసుంది. కోరిక లున్నాయి. తీర్చుకొనే దారి దొరికింది...."

శ్రీవారి మాటలకు అడ్డొస్తూ అరిచాను. "బావుంది. మొగుడు బ్రతికే ఉన్నాడు దానికి. వాణ్ణి వంచించి .... ఇదిలా...." శ్రీవారు ఇల్లెగిరి పోయేటట్లు నవ్వారు. "వాడిని ఇది వంచించే దేమిటి మధ్యలో? వాడు దీన్నేనమ్ముకుని వుంటేగా వంచన

~ ... ... ... ప్రేమ
వుండేడ్చిందా? మన కెందుకు వాళ్ళ
వూసు?''

శ్రీవారలా ఎదురువాదం వేసుకొం టున్న కొద్దీ నాలో 'శేషు' ను సంస్క రించాలన్న పట్టుదల హెచ్చసాగింది. పది రోజులపాటు పతి భక్తిని గురించీ, అందులోగల ఇహమూ, పరమూ గురించీ పురాణ కథలు చెప్పాను శేషుకు.

భర్తకాక — ఇతర పురుషుల మీద మనసు నిలపడం, వారితో తిరగడం, నరకానికి యెలా దారి అవుతుందో లెక్క ల్లిచ్చాను!

చివరకు అలాటి స్త్రీ బ్రతుకు యెంత దుర్భర వేదనలకు గురి అవుతుందో—ఆ స్త్రీకి సమాజంలో యెంతటి చెడ్డ పేరు ముద్రపడుతుందో, వర్ణించి వర్ణించి, తోమి వదిలిపెట్టాను.

భారతీయ సంస్కృతి సభ్యతల్ని కాపాడాల్సిన విధి ఈ దేశపు స్త్రీల మీద (నా దృష్టిలో ఈ క్షణం వున్నది శేషు ఒక్కటే!) ఎంతగా ఆధారపడి వుందో దాని బుర్ర పగిలిపోయేలా బోధించాను. శేషు అన్నీ విన్నది. ఓర్పుగా వూకొట్టింది. అవసరమైనచోట 'అవునమ్మగారూ. కాదు మరీ?' అని కూడా అంది!

కానీ మరునాడే మరో 'బావ' తో షికార్లు కొట్టింది (ట!)

ఈసారి కేకలేశాను. ''ఇలా అయితే ఇక నీలాటి అపవిత్రురాలికి నా యింట్లో స్థానం వుండదు ప...మ్మన్నాను. శేషు తలూపిందేగానీ దాని పద్ధతి మార్చుకో లేదు.

హఠాత్తుగా ఓ రోజు బెంగుళూర్ నుంచి వెంకడు వూడిపడ్డాడు. దాన్ని పిల్చుకువెడతానన్నాడు! కానీ శేషు నసే మిరా వెళ్ళనంది. కనీసం వాడు ఇక్కడే వున్నాడన్న భయమేనా లేకుండా, తన 'బావ' లతో కబుర్లు సాగించిందిట!

రెండు రోజుల తర్వాత వెంకడు నా దగ్గరకూ, శ్రీవారి దగ్గరకూ వచ్చాడు. ''మీరు నచ్చచెప్పి నా వెంట దాన్ని పంపం డమ్మగారూ! లేదా ఈడే దాంతోపాటు పడుంటా! అట్లయినా దాన్ని ఒప్పించండి'' అన్నాడు.

శేషును పిలిచాను. వరండాలోకి వచ్చి ఓ వారగా నిల్చుంది. శ్రీవారు కాస్తా పేపర్లో ముఖం దాచేసుకున్నారు. ఈ మగాళ్ళ కిదో జబ్బు. ఏదేనా సీరియస్ సమస్యవస్తే చాలు, పేపర్‌ని డాలులా వుపయోగిస్తారు!

''శేషూ! వెంక దేమంటున్నాడో విన్నావా?'' అన్నాను యజమానురాలి హోదా కంఠంలో ఖంగుమనిపిస్తూ!

''ఆ! మా బాగా వింటున్నానమ్మ గారూ! ఆదెవత్తో— వున్నవరకూ డబ్బు గుంజుకుని, బెగుళ్ల తగిలించి—పంపే సిందీణ్ణి! ఇప్పుడు నా మీద ప్రేమ పుట్టు కొచ్చింది!''

అంత నిక్కచ్చిగా అది చెప్పేసరికి

క్షణకాలం దిమ్మెరపోయాను నేను!లోలో పల ఆ కలవరపాటును అణిచేసుకుని తీక్షణంగా దానివేపు చూశాను. "ఛాల్లే— వెధవ కబుర్లూ నువ్వూ! వాడంత వాడొచ్చాడు నీ దగ్గరకు. ఇక వెధవ్వేషాలెయ్యక, వాడితో హాయిగా మా ఔట్ హౌస్‌లో వుండు....ఇద్దరూ చిలకా...."

నామాట పూర్తికాకుండానే శేషు గట్టిగా అరిచింది. "అమ్మగారూ? మీరైనా చెప్పండి. ఇక ఆడితో కాపురం నేచెయ్యను!" నేను నిర్ఘాంత పోయాను. శేషు....! దీన్ని నేను చేరదీసాను! మనిషిని చేశాను! మనుగడ కల్పించాను! చివరకు నన్నే ఎదిరిస్తోంది! నా ఆజ్ఞ జవదాటుతోంది! నాలోని అహం కోడె త్రాచులా లేచి బుసలుకొట్ట నారంభించింది!

చివరిసారి అరిచాను. "అంతేనా నీ నిర్ణయం?"

"అంతే!"

నాకు శృంగభంగమైనట్లైంది! వెంకడితో గట్టిగా చెప్పాను."ఈ భ్రష్టతో నీకు పనేమిట్రా? నువ్వు హాయిగా మరో పెళ్ళిచేసుకో! ఇక చూడుకో.........దీని బతుకు.......కుక్కలు చింపిన విస్తరల్లే అవుతుంది...!"

వెంకడు వెళ్ళిపోయాడు. శేషూ వెళ్ళిపోయింది! శ్రీవారి వేపు చూశాను. నిశ్చలంగా కూర్చుని వున్నారు ఏమీ జరగనట్లే....

"విన్నారా అంతా!"

"ఆ!"

"రేపట్నుంచీ దాన్ని పనిలోంచి తీసేస్తాను!" కోపంగా అరిచాను.

"ఎందుకూ?"

"ఎందుకేమిటి? దాన్ని ఇంత దాన్ని చేసిన నా మాటే విననంతటి కొవ్వు పట్టింది దానికి!" నా మాటలకు అడ్డొస్తూ శ్రీవారు అరిచారు "స్టాప్. ఎంతదాన్ని చేశావ్?"

"మనిషిని చేశాను!"

"ఎందుకోసం చేశావు?"

జవాబుకోసం తడుముకున్నాను.

"నీకు పనిమనిషి కావాల్సి చేరదీశా – నమ్మకంగా వుంది కాబట్టి ఆదరించావు. నీవు ఇచ్చే జీతానికి పది రెట్లు చాకిరీ చేస్తోంది కాబట్టి అభిమానం చూపించావు. మరిందులో నీ ఉద్ధరింపేముంది?"

నాకు కోపం అవధులు దాటింది. "ఇలా దాన్ని మీరు వెనకేసుకు రావటం..."

"వెనకేసుకురావటంలేదు రాధా! కాస్త నింపాదిగా ఆలోచించు. దాని వ్యక్తిగత సమస్యలూ, సరదాలూ దానివి! అందులో నీ జోక్యం ఎందుకు? అసలలాటి విషయాల్లో తల దూర్చే హక్కు నీ కెక్కడుంది?"

"అలా అని నా ఇంట్లో ఓ అపవిత్రురాలిని-ఓ భ్రష్టను తిరగనివ్వమంటారా?"

"ఈ లోకంలో ఎందరు అపవిత్రులు లేరు? ఎందరు భ్రష్టలూ- భ్రష్టులూ లేరు?

మరి ఈ ప్రపంచంలో నువ్వు బ్రతకటం లేదా?"

శ్రీవారి వాదన నాలోని కోపాన్ని మరింత రెచ్చగొట్టింది. "మీరు ఎన్నైనా చెప్పండి. దాన్ని పనిలోంచి తీసేస్తాను... తిక్క కుదిరించేస్తాను!"

శ్రీవారు పెద్దగా నవ్వారు. "దాని తిక్క కాదు కుదిరేది—మన తిక్క!" నాకు నిజంగా తిక్క రేగిందా మాటలతో!

శ్రీవారు శాంతంగా నా భుజం మీద చెయ్యివేసి అడిగారు. "కొన్ని ఇలాటి విషయాలు చూచీ చూడనట్లుండాలి రాధా!"

"............"

"పోనీ ఓ మాటడుగుతాను చెప్పు. నీ బిడ్డల్లో ఓ బిడ్డ ఇలా ప్రవర్తిస్తుందనుకో...."

శ్రీవారి ప్రశ్న పూర్తి కాకుండానే ఛర్రుమన్నాను. "నరికిపారేస్తాను........ అంతే!" లోపలికి వెళ్ళిపోయాను.

ఏం దేశం గొడ్డుపోయిందా? ఇంతోటి పనిమనిషి నాకు దొరకదా? నా చేతినిండా డబ్బుంది! కావలసినంత పలుకుబడి ఉంది. ఒకరు కాదు, పది మంది నౌకర్లను పోషించే స్తోమతు వుంది! ఈ శేష బంగారు కత్తికాదు. దీన్ని మానిపించేస్తాను. అంతేకాదు, దీనికి మరెక్కడా పని దొరక్కుండా చూస్తాను. తోక కోసి సున్నం పెడతాను. మొలిచిన కొమ్ములు కత్తిరిస్తాను..........దృఢ నిశ్చయానికి వచ్చాను.

మరునాడే శేషను పనిలోనుంచి తీసేశాను. కొత్త పనిమనిషిని పిల్చుకున్నాను. ఆ రోజంతా శేష ఏడుస్తూనే నా చుట్టు తిరిగింది. నాకు దయ కలగలేదు.

"అమ్మగారూ! ఒక్క సంగతి........ అదే, ఆడంచే నా కిష్టం లేదు—వది లెయ్యండి. నా జీతం తగ్గించినా సరే, మీ పాదాలదగ్గరే పడుంటా....!" అంటూ కాళ్ళా వేళ్ళా పడింది. నేను ససేమిరా బెట్టువదల్లేదు. ఏడుస్తూ చివరకు అది అంది "అమ్మగారూ! నేనేం తప్పుచేశానని తవరిలా నా నోటికాడి కూడు లాగెయ్యటం?" నేను ఇల్లెగిరిపోయేలా అరిచాను. "యింకా నీ తప్పేమిటో నే చెప్పనవసరంలేదు. కాలమే చెబుతుంది. నన్ను విసిగించక వెళ్ళు! మళ్ళీ నీ ముఖం నాకు చూపించకు!"

"అయ్యగారూ!" అంటూ శ్రీవారి గదిలోకి ఏడుస్తూవెళ్ళింది శేష.... వెనకాలే నేనూ వెళ్ళాను.

"రాధా! తొందరపడ్తున్నావు సుమా! క్షమించలేవూ?" అన్నట్లు చూశారు శ్రీవారు నావేపు. నేనూ శ్రీవారికి కళ్ళతోనే జవాబిచ్చాను. "గృహపరిధికి సంబంధించిన మైనర్ విషయాలలో మీ జోక్యం-అధికారం అనవసరం!"

శ్రీవారు పలక్కపోవడంతో శేష డీలా పడిపోయింది. ఏడ్చుకుంటూ వెళ్ళిపోయింది.

పర్నాటినుంచే నేనే ఓపినంతవరకూ

'శేషు'ను గురించిన 'చెడు'ను గురించీ (ఆలిండియా రేడియోలో కుటుంబ నియంత్రణ కార్యక్రమాల్లా) వివరంగా-విపులంగా, పసిపిల్లలకూ్కడా అరటి పండు వలిచి చేతులో పెట్టినట్లు చెప్పాను! ఇన్నాళ్లూ నేను కాబట్టి దాన్ని భరాయించ గలిగాననీ - మా శ్రీవారులాటి ఏకపత్నీ వ్రతులు మాత్రమే దాని జాలంలోనుంచి తప్పించుకోగలరనీ.... ఎన్నో - మరెన్నో చెప్పాను! అది పరోక్షంగా విన్న శ్రీవారు కళ్ళలో రక్తంలాటి కోపం - లావాలాటి కోపం పెల్లుబికటమూ నాకు తెలుసు. ఓ రోజు "మరీ పశువ్వి కాకు!" అన్నారు - ఇంకా కోపం మింగుకోలేక!

ఓ రెండు నెలలు తిరక్కముందే, శేషు, దాని అమ్మ, తమ్ముడు ఎక్కడికో వెళ్ళిపోయారని తెలిసింది. అప్పుడప్పుడూ శేషు గుర్తుకు వచ్చినపుడల్లా శ్రీవారు భారంగా, జాలిగా నిట్టూర్చేవారు. నేను మాత్రం కసిదీరా...."దాని పొగరు అణిగి వుంటుంది. అది బ్రతకలేక ఛస్తుం టుంది!" అని మనసారా దీవించేదాన్ని.

తర్వాత-రోజులు నెలలు జరుగుతున్న కొద్దీ 'శేషు' జ్ఞాపకాలుకూడా నాలో పూర్తిగా మాసిపోయాయి. పిల్లలూ, వాళ్ళ చదువులూ, పెళ్ళిళ్ళూ, డాబులూ, దర్జాలూ .. 'శేషు' లాటి కీటకాన్ని గుర్తు చేసుకోవాల్సిన అవసరమూ నాకు కలగ లేదు!

ఆనాటి కీనాడు........శేషు తమ్ముడు రాములు కనిపించి శేషును గుర్తుకు తెచ్చాడు!

"స్టేషన్ వస్తోంది. లే!" అన్నారు శ్రీవారు. ఆలోచనలకు ఫుల్‌స్టాప్ పడింది.

స్టేషన్‌కు భాస్కర్ కారు తీసుక వచ్చాడు. బంగళాలో అడుగెట్టి—ఆ ఏర్పాట్లన్నీ చూచి నా హృదయం ఆనందం తోనూ, గర్వంతోనూ నిండిపోయింది.

* * *

ఆరోజు ఉదయంనుంచీ వూపిరి సలప నంతటి సందడి. ఆహూతులు వేల సంఖ్యలో వచ్చారు. షష్టిపూర్తి మహో త్సవం శాస్త్రయుక్తంగా జరిగింది! నేను, శ్రీవారు, నలుగురు పిల్లలూ, కోడళ్లూ, అల్లుళ్లూ-అందరం కలిపి గ్రూప్ ఫొటో తీయించుకున్నాం.

ముఖ్యులైన కొందర్ని మాకు పరి చయంచేశారు పిల్లలు. "వీరు మిసెస్ బెనర్జి! నగరంలో చాలామంది కోటీశ్వ రుల్లో వీరు ఒకరు!" ప్రభాకర్ పరిచయం చేశా డొకామెను. ఆవిడ దాటివెళ్ళాక.... నా చెవిలో చెప్పింది సవిత "అదో కార్నర్‌లో సోఫాలో కూర్చునివున్నతను మిసెస్ బెనర్జి మొదటి భర్త-రామదాస్!"

నేను ఆశ్చర్యంగా చూశాను సవిత వేపు.

"ఉష్! అలా వెర్రిమొగం వెయ్య కమ్మా! కొంపదీసి ఆవిణ్ణీమాట అడిగేవు సుమా! పరువుపోతుంది!" నా గొంతులో ఏదో అసహ్యం పేరుకుంది గళగలా-




మ్రింగలేనిది!

"ఈమె మిస్ తార! ప్రఖ్యాత సినీ తార!" భాస్కర్ మరొకామెను నాకు పరిచయం చేశాడు.

వుల్లిపొరల్లాంటి బట్టల్లోవున్న తార తమాషాగా నవ్వింది.... భాస్కర్, ప్రభాకర్, రామ్మోహన్, శ్యాంప్రసాద్-తార అందాన్ని చూపులతో జుర్రేస్తున్నారు. ఆహూతులలో చాలామంది ఆమె సౌందర్యావలోకనంలో మైమరచి వున్నారు.

"ఛీ....ఛీ....ఇలాటివాళ్ళ నెందుకు పిలిచారే!" అన్నాను లలితతో విసుగ్గా-రహస్యంగా!

లలిత నావేపు గుడ్లురిమి చూచింది. "ఛాల్లే అరవకు! వింటే మా ప్రాణం పోతుంది! రేప్పొద్దున నా కూతురికి ఆవిడ స్వంత పిక్చర్లో ఓ రోల్ ఇస్తానని మాటిచ్చింది కూడాను. నీ చాదస్తంతో మా భవిష్యత్తు చెడగొట్టకు!"

నా గుండెల్లో ఏదో వికారం—అణచుకోలేనిది....!

గొల్లున నవ్వులు వినిపించి తృళ్ళిపడి చూశాను. అక్కడో అమ్మాయి. అవివాహిత (మిస్ మోహిని, ఎం. ఏ. అట!) ఏదో ఛలోక్తులు విసురుతూ నవ్వుతోంది. ఆమె బుగ్గమీద చిటికె వేసి ఏదో కబురు చెబుతున్నాడు మరొకాయన .... శ్యాంప్రసాద్ ఆమె చెయ్యిపుచ్చుక నా దగ్గరకు

పిలుచుకువచ్చాడు....

"ఈమె మిస్ మోహిని, ఎం. ఏ. అత్తయ్యా! భలే చలాకీపిల్ల! పెళ్ళోద్దంటోంది! కొంటెపిల్ల?" మళ్ళీ ఆమె చెవి సుతారంగా మెలిపెట్టాడు శ్యాం.

కడుపులోనూ తిప్పేస్తోంది .... ఏదో బాధ-చెప్పలేనిది!

సాయంత్రం అయ్యేసరికి దాదాపు అలసిపోయాను...శారీరకంగానే కాదు.... మానసికంగా కూడాను!

"అమ్మా! నువ్వూ, నాన్నగారూ పెందరాళే భోంచేసి పడుకోండి .... మా ఫ్రెండ్స్ మరికొందరొస్తారు. డిన్నర్ ఏర్పాటు చేయించాం! పొద్దుపోతుంది మాకు. అందాకా మీరు వెయిట్ చెయ్యట మెందుకు?" అన్నారు పిల్లలు!

నిజానికి నాకూ విశ్రాంతిగా పడుకోవా లనిపిస్తోంది. శ్రీవారు అలసటగా వున్నారు. ఇద్దరం భోంచేసి మేడమీద మాకై కేటాయించబడిన గదిలో పడుకున్నాం. మిసెస్ బెనర్జి, ఆమె మొదటి భర్త....మిస్ తార....మిస్ మోహిని, ఎం.ఏ.....వాళ్ళ చుట్టూరా ప్రదక్షిణలు చేస్తూ—వారిని నెత్తికెక్కించుకు తిరుగుతున్న నా పిల్లలూ—కోడళ్ళు .... కొడుకులు .... మిగతా ఆహూతులు....ఏమిటో మన సంతా బేజారుగా వుంది. పదిగంటలు దాటుతోంది. క్రిందహాల్లోంచి నవ్వులూ... కేరింతలూ....పాత్రల చప్పుళ్ళూ....ఏదో ఇంగ్లీష్ మ్యూజిక్ వినపడ్తోంది....!

డిన్నర్ మొదలైంది కాబోలు! ఆ వేడుక చూద్దామనే కుతూహలం రేగింది నాలో... శ్రీవారిని తట్టి లేపాను. "అలా వెళ్ళి ఆ సరదా చూద్దామా?" అన్నాను.

"ఉదయంనుంచీ చూచిన సరదాల కంటే మరికాస్త పెద్ద మోతాదులో వుంటుందేమో ఇది....పద!" స్వగతంలా అనుకుంటూ నా వెంట వచ్చారు. గది బయటికి వచ్చి—రెయిలింగ్ దగ్గరకు వచ్చాము....

క్రింద హాల్లో కనిపించిన దృశ్యం...?

సవిత, లలిత, రోహిణి, రజని.... మరెవరో చాలామంది స్త్రీలూ, ప్రభాకర్, భాస్కర్ .... శ్యాం, రామ్మోహన్ .... ఇంకెవరెవరో పురుషులూ....

వావివరుసలు లేకుండా ఒకరి నడుముల చుట్టూరా మరొకరు చేతులువేస్తూ.. నవ్వుతూ, నవ్విస్తూ, హత్తుకుంటూ, మోటుమాటలూ .... గ్లాసుల చప్పుళ్ళతో, హాలంతా ప్రతిధ్వనిస్తుంటే...పశువుల్లా... అనాగరికుల్లా....అసహ్యకరంగా....

నా కళ్ళు తిరుగుతున్నాయి. నా ఒళ్ళు తూలుతోంది. నే నేమైపోతున్నాను....? నా చుట్టూరా శ్రీవారి చేతులు అల్లుకోవడం మాత్రం నాకు తెలుసు....

కళ్ళు తెరచి చూశాను. నా మంచం చుట్టూరా నా కొడుకులూ, కూతుళ్లూ, మరి కొందరు ఆహూతులు గాభరాగా నిల్చుని నావేపే ఆత్రుతగా చూస్తున్నారు.

" కంగారుపడకు....!" అంటున్న




ట్లున్నాయి వారి చూపులు. కానీ ఆ కళ్ళ లోతుల్లో "చూశావా? మరి నీ బిడ్డలూ - వారి చుట్టూరా వున్న నాగరిక సమాజం... ఎలావుందో వారందరినీ నువ్వు సంస్కరించగలవా?" అన్న ప్రశ్న దాగివున్నట్లు నా హృదయానికి ఏదో అనుభూతి.

శ్రీవారు అందర్నీ బయటికి పంపేశారు, నాకు విశ్రాంతి కావాలన్న మిషతో .... అందరూ వెళ్ళిపోయాక.... చాలా ఏళ్ళతర్వాత ...శ్రీవారి గుండెల్లో ముఖంపెట్టి ఏడ్చాను! నా అంతరాంతరాలలోనుంచి శేషు కంఠం ప్రతిధ్వనిస్తోంది. "అమ్మగారూ! నేనేం తప్పు చేశాను? నా నోటికాడి కూడెందుకు తీస్తున్నారు?"

అవును.... శేషుచేసిన తప్పేమిటి?

"నీ బిడ్డలిలా ప్రవర్తిస్తే?" ఒకనాటి శ్రీవారి ప్రశ్న!

"నరికిపారేస్తాను...." నా జవాబు ఆనాడు ...

కానీ ఈనాడు?

నా బిడ్డలు .... వారి చుట్టూరా చాలా మంది అలాటి బిడ్డలూ....వారందర్నీ నేనేం చేయగలను? ఏమీ చెయ్యలేనా?

మళ్ళీ శేషు ప్రశ్న నా చెవుల్లో ప్రతిధ్వనిస్తోంది. అదేప్రశ్న....ఒకే ప్రశ్న.

కానీ దానికీనాడు జవాబులు రెండు!

రెండూ విభిన్నమైనవి!

ఉలిక్కిపడ్డాడు రాజారావు!—తనను రాసుకుంటూ ఇద్దరు ఆడపిల్లలు కిల కిలలాడుతూ వెళ్ళిపోయారు.

వాళ్ళలోకం వాళ్ళదిలాగానే వుంది గానీ, పరిసరాలను పరికించవలసిన అవ సరంకూడా లేదన్నట్లు ప్రవర్తించారు వాళ్ళు.

వాళ్ళెవరో అతనికి తెలియకపోలేదు!

తన యింటికి నాలుగిళ్ళ యివతల ఆ మేడమీదనుండి అటుప్రక్కగా వెళ్ళే టప్పుడూ, వచ్చేటప్పుడూ వినిపిస్తూనే వుంటాయి వాళ్ళ ఇకఇకలు, పకపకలు.

దానికితోడు మరొకటుంది!

పుష్పక విమానం కైలాస పర్వతం దగ్గరకు రాగానే మరి ముందుకు సాగ టానికి వీల్లేదన్నట్లు ఠక్కున ఆగిపోయిం దిట! ఆ మాట ఎంతవరకు నిజమో తెలి యదుగానీ, ఆ మేడముందుకు రాగానే విద్యార్థిబృందం తాలూకు నడకలే కాదు, వాహనాలుకూడా ఒకవేళ ఆగకపోయి నట్లయితే, మెల్లిగా పెళ్ళివారి నడకలా సాగవలసిందే!—అది రూల్!!

*　　　*

రాజారావు ఇంట్లో అడుగుపెట్టగానే రాజు, రామం, శశి కాళ్ళకు చుట్టేశారు.

ప్రొద్దున్న తను నిద్దర లేవకుండానే వాళ్ళు బళ్ళోకి పోతారు. తను ఆఫీసుకు బయలుదేరే వేళకి వాళ్ళింట్లో వుండరు. వాళ్ళు బళ్ళోంచి తిరిగి వచ్చేసరికి తనింట్లో వుండడు. అటువంటి పరిస్థితిలో తనింట్లో అడుగుపెట్టగానే, ఏదో పొరు గూరు వెళ్ళిన తండ్రి అప్పుడే తిరిగివచ్చి నట్లుంటుందేమో వాళ్ళ ప్రాణానికి!

తన పిల్లల ప్రవర్తనపట్ల రాజారావు ఉద్దేశ్యం అదయితే కావచ్చు. కాని ఆ పసి హృదయాలలో వున్న ఆలోచన— రోజూ మా బెలావున్నా - ఆరోజుమాత్రం అదికాదు! ....మరి?

నవ్వుతూ దగ్గరకు పిలిస్తే భుజం మీదెక్కి స్వారీ చేసేటంతటి చనువయితే ఆ పిల్లలకు వుంది. కాని కోపంతో కోర చూపు చూడనే అక్కరలేదు, కనుబొమలు ముడుచుకుంటేనే చాలు, ఆ ఛాయలకు రావటానికయినా ధైర్యం చెయ్యలేరు.

ఆ నాటి దినచర్యకు తోడు ఆఫీసు నుంచి ఇంటిదాకా నడిచివచ్చినందుకు అలసట, మనసుకు చికాకు కలిగిస్తున్నా దాన్ని ప్రక్కకునెట్టి నవ్వుముఖంతో పలకరించాడు రాజారావు పేరుపేరునా.

తమ హృదయాలు సంతోషంతో పొంగిపోతున్న విషయం వ్యక్తం చేయ గలిగారు గానీ, ఆ ఆనందానికి గల కారణ మేమిటో చెప్పే ధైర్యంమాత్రం లేక పోయింది వాళ్ళల్లో ఎవరికీ.

తన కేసు తను వాదించుకోలేని ముద్దా యికి న్యాయవాది దొరికినట్లు కాఫీకప్పుతో ఎదురువచ్చే తల్లిని చూపి కొండంత ధైర్యం వచ్చినట్లుంది, చిలిపిగా కళ్ళు చికిలిస్తూ ఏవేవో సైగలుచేసారు ముగ్గురూ కలిపి.

కుర్చీలో కూర్చుని కాఫీ సేవిస్తున్న భర్తను అనునయంగా అడిగింది అనసూయ. "మీరేమీ అననంటే ఒక్క విషయం చెబుతానండి!"

"ఊఁ!"

"మధ్యాహ్నం భోజనాలుచేసి పిల్లలతో ఆడుకుంటూంటే ఏదో తలుపుగిరిన చప్పుడయింది. తలుపు తీసి చూచేసరికి ఒక కుక్కపిల్ల 'మొయ్ మొయ్' మని ఏడుస్తూ లోపలికి వచ్చిందండి. అప్పటినుంచి పిల్లలంతా దాన్ని ఒక్క క్షణం కూడా వదిలిపెట్టి వుండలేదంటే నమ్మండి. దాన్ని మనం పెంచుకుందామని ఒకటే గోల పెడుతున్నారు పాపం! మీరు 'ఊఁ' అంటే...."

"బాగానే వుంది. ఏదీ? ఎక్కడుంది?"

నేనంటే నేనంటూ ముగ్గురుపిల్లలూ పోటీలుపడి పరిగెత్తారు, దాన్ని తీసుకు రావటానికి.

వాళ్ళ చేతుల్లోంచి దాన్నందుకుని, ఆప్యాయంగా దువ్వి క్రింద వదిలిపెట్టాడు రాజారావు.

భార్యవైపు తిరిగి 'సరేలే, చూద్దాం!' అన్నట్లు తల తాటించాడు.

కుప్పిగంతులతో గదిమూలకు పోయి ముడుచుకుని పడుకుందా కుక్కపిల్ల. పిల్లలు ముగ్గురూ దానివెంటబడి చుట్టూ మూగారు.

"దీని పేరు 'రోజా' అని పెడితే బాగుంటుంది కదూ?" రాజు సలహా అది.

"కాదు! 'లిల్లీ' అని పిలుద్దాం!" రామం తన అభిప్రాయాన్ని చెప్పాడు.

"అదేం కాదు! 'పప్పీ'!" అంది ముద్దుమాటల్తో శశి.

వాళ్ళ సంభాషణలు విన్న రాజారావుకి ఎందుకో గానీ వీధి మొదల్లో కనిపించిన ఆడిపిల్లలు గుర్తుకువచ్చారు. మనస్సు పరిపరివిధాల పోయింది.

"ఏమిటీ, ఇది ఆడకుక్కా?" అనుమానం రహితం చేసుకోటానికి భార్యనడిగాడు.

"అవునండి!"

"లాభంలేదు!" పెదవి విరిచాడు రాజారావు.

ఆ సంభాషణను అదోవిధంగా అర్థం చేసుకున్న ఆ పిల్లలకు అధైర్యం పట్టుకుంది. దిగులుగా తల్లివంక చూసారు.

"ఆడుకోండర్రా, మీరు వెళ్ళి ఆడుకోండి!—నాన్నగారు ఒప్పుకున్నారుగా, అది మనింట్లోనే వుంటుంది!" అంటూ వాళ్ళని అవతలకి పంపించేసి తిరిగి వచ్చింది అనసూయ.

"ఏమిటండీ మీ అనుమానం?"

కొన్నిక్షణాలు ఆలోచనలో మునిగి తేలాక ఒక నిశ్చయానికి వచ్చాడు రాజారావు—"అది మనింట్లో వుండటానికి వీల్లేదు!"

"ఏం? ఎందుకని?" కటువుగా ఆరంభమైన వాక్యం అనునయాన్ని వ్యక్తం చేస్తూ మారిపోయింది. "అది కాదండీ! పాపం, పిల్లలు ఎంతో ముచ్చట పడుతున్నారు. వాళ్ళకోసమయినా ...."

"అవొచ్చు!—ఏ పని చేయబోయే ముందయినా ముందుచూపు చాలా అవసరం. బాధల్ని కొని తెచ్చుకునే పనుల జోలికి అసలు పోకపోవడమే మంచిది."




అర్థం కానట్లు భార్య చూడటంతో చెప్పుకుపోయాడు.

"అదికాదు, అనూ!—దీన్నిప్పుడు పెంచి పెద్ద చేసినందువల్ల తర్వాత వచ్చే బాధలగురించి ఆలోచించావా?"

"ఏమిటండీ ఆ బాధలు!"

"ఇది ఆడకుక్కని మరిచిపోకు!—అంటే ఇది పెరిగి పెద్దదయాక ఊళ్ళో వున్న మగకుక్కలన్నీ మనింటిదగ్గరే వుంటాయి—ఆడకుక్కని పెంచి మావాడొక డెన్ని బాధలు పడ్డాడో నీకేం తెలుసు?"

అలాగే చూస్తూ వుండిపోయిన అనసూయ చాలాసేపటికి గానీ తేరుకోలేదు.

"కానీ పిల్లలు...."

"మరేం ఫరవాలేదు! దాన్ని గురించి కూడా ఆలోచించాను. వాళ్ళతో అసలీ విషయం చెప్పొద్దు. వాళ్ళంతా నిద్రపోయాక, అర్ధరాత్రి దాన్ని తీసికెళ్ళి అవతలి వీధిలో వదిలేసి వస్తాను. తెల్లవారి లేచాక పిల్లలడిగితే కుక్కపిల్ల ఎటో పారిపోయిందని చెప్పు. తెలిసిందా?"

ఆమె మనస్సు ఎందుకో బాధపడింది. ఆ బాధ కనిపించకుండా ముఖాన్ని ప్రక్కకు తిప్పుకుని "సరే, మీ యిష్టం!" అంటూ వెళ్ళిపోయింది.

*

వీధి తలుపు గడియవేసి లైటార్పి మంచంమీద విశ్రమించిన రాజారావుకి ఐదునిముషాలయాక చెంప చెళ్ళుమన్నట్లయింది—దానికి కారణం అతని మనోనేత్రం ముందు మెదిలిన ఆ దృశ్యం! అంతరాత్మ నిలేసి అడిగిన ఆ ప్రశ్న!!

"దారిన పోయే కుక్కపిల్ల గనుక నువ్వలా చెయ్యగలిగావు! కడుపున పుట్టిన కూతురు మాటేమిటి?...."


మీ ఆఫీసులో ఖాళీలేమైనా ఉన్నాయా సార్
ప్రస్తుతం ఆ వరండా బహాటే ఖాళీగా ఉంది అంతే
GER
వ. తులసీరాం


అబ్బా... ఆ జేమ్సుబాండ్ సినిమాలు చూడొద్దంటే విన్నారు కాదు
శేఖర్




(గత సంచిక తరువాయి)

"ఉన్నాయనుకోండి. కాని మరీ మోటుగా వుంటున్నా యవి. చిన్న పిల్లలకి యిటువంటివే బాగుంటాయి. అయినా మొన్న పుట్టినరోజుకు పాపం, ఒక్క గౌనుమాత్రమేగా దానికి కొన్నాం?"

నవ్వాడు రామారావు. "సరే నీ యిష్టం. నేను కాదంటే మాత్రం వింటావా? మరి నువ్వుకూడా ఏమైనా కొనుక్కోరాదూ?"

"చాల్లెండి. పన్నెండేళ్ళ కొడుకు తల్లిని. ఇంకా నాకు షోకులెందుకు? నడవండి వెళ్దాం. ఇంతకీ సుపుత్రులేం కొన్నారు?"

"నీకు తీసిపోయేవాళ్ళేం కాదు, నీ సుపుత్రులు. వెళ్ళేవరకూ ఒక్కో బూటు కొనుక్కుంటా మన్నవాళ్ళు వెళ్ళినతర్వాత రెండేసి కావాలని పేచీపెట్టి నా ప్రాణం తీసి మరీ కొనుక్కున్నారు ......అల్లరి వెధవ, ఈ గోపీగాడిని ఎప్పుడూ బజారుకు తీసుకు రాకూడదు." అన్నాడు విసుగూ, కోపం మిళాయించి.

"పోనిద్దురూ" రమ భర్తను వారించింది. "మనం మాత్రం యింకెవరికి పెట్టాలి గనుక? పిల్లల సరదా ఆమాత్రం తీర్చలేమా? నడవండి బాబూ వెళ్దాం మరి!" అంటూ సుభద్ర వేపు తిరిగి "ఏమండీ యింకా మీ సెలెక్షన్ కాలేదా, మేం వెళ్ళమా మరి?" అన్నది.

అంతవరకూ రమనూ, అతిలోక సుందరమైన ఆమె స్వభావపు తీరుతెన్నులనూ అచ్చెరువుతో గమనిస్తూన్న సుభద్ర

అప్పుడు ఈ లోకంలోకి వచ్చింది.

నవ్వేస్తూ అన్నది సుభద్ర; "నాకు అన్నీ బాగానే వున్నాయి మరి! అరుణకు తీసుకున్న మాదిరి చెవుల లోలకులు మా సుగుణా జానకిలకు కూడా తీసిపెడు దురూ, సరదాపడ్తున్నారు వాళ్ళూను."

చలపతి తన చెవులను తానే నమ్మ లేకపోయాడు. 'సుభద్రలో ఏ దైవం ప్రవేశించాడో కద. ఆ రోజు కారోజు, ఆ క్షణాని కాక్షణం యింతింత మార్పు తీసుకవస్తున్నాడు!' రమ ఎదురుగా సుభ ద్రతో ఏమీ మాట్లాడలేక మౌనంగా వూరు కున్నాడు.

"బలేబలే పిన్ని మనకు కూడా కొంటోంది" అంటూ జానకి సంతో షంగా నాట్యం చేసింది.

సుగుణా జానకి లిరువురికీ చెరో ముత్యాల లోలకుల జతా తీసుకున్న తర్వాత చిన్న ముత్యపు వుంగరం తీపించి సుభద్ర. "దీనికికూడా తూకంవేసి బిల్లు రాయండి." అన్నది.

"అది నాకు!" అన్నది తపీమని జానకి.

"మరి నాకో?" సుగుణ అడిగింది.

"దొంగల్లారా!" నవ్వుతూ మంద లింపుగా అన్నది సుభద్ర. "అది రవికి. మీరిద్దరూ కొనిపించుకున్నారు కాని తమ్ము డికి ఏమైనా కొనమని అడిగారా యిందాక ట్నుంచీ?"

"అవును. అది తమ్ముడికి బాగుం టుంది." సుగుణ ఒప్పుకుంది. జానకి అయిష్టంగా వూరుకుంది.

ఇంటికి వస్తూనే నరసమ్మ దగ్గరకు పరుగెత్తారు సుగుణా, జానకీ. "చూశావా చూశావా మాకు పిన్ని ఎంత మంచివి కొన్నదో!" అంటూ తమ క్రొత్త నగలు చూపించారు. "రవికి ఒక వుంగరం కూడా కొంది!"

నరసమ్మ సంతోషించింది. "అవు నమ్మా, పిన్నమ్మగార్నీ నాన్నగార్నీ విసి గించకుండా వుంటే అలాగే మంచిమంచి వన్నీ కొనియిస్తారు. అందుకే అల్లరి చేయకుండా బుద్ధిగా వుండాలి మరి మీరు!"

రవికి ఉంగరం పెట్టటానికి అటుగా వచ్చిన సుభద్ర, ఆ సంభాషణంతా ఆమూ లాగ్రంగా విన్నది. 'నరసమ్మ పాపం మంచిదే! పిల్లలకు సవతితల్లిని గురించి చాటున చెడుగా ఏమీ నూరిపోయడం లేదు.' అనుకుంది మొదటిసారిగా సుభద్ర.

ఏమీ ఎరగనట్లుగా ఎదురుగా వెళ్ళి "రవి ఏడీ నరసమ్మా?" అనడిగింది.

"నిద్రపుచ్చానమ్మగారూ, కొంచం అన్నం తిని పడుకున్నారు." అన్నది బట్టలు ఉతకటం ఆపి నరసమ్మ.

"సరేలే....ఏమిటది? ఇప్పుడు ఉతుకు తున్నావ్?"

"నా చీరలు అమ్మగారూ!"

వెనుదిరగబోతూ మళ్ళీ ఆగి అన్నది సుభద్ర: "అలా తడిచీర కట్టుకున్నా వేమిటి?"

"మధ్యాహ్నం ఉతికిన చీర యింకా ఆరలేదు. కట్టుకున్న చీరమీద రవిబాబు అన్నం తింటూ చారు బాగా ఒలక బోశారు. అందుకనీ....ఆ తడిచీరే కట్టుకుని యిది వుతుక్కుంటున్నాను." ఈ ఆరాలన్నీ ఎందుకో తెలియక బెదిరిపోతూ చెప్పింది నరసమ్మ.

"ఆ రెండు చీరలే వున్నాయా, మరి లేవా?"

సుభద్ర ప్రశ్నకు మాట్లాడలేదు నరసమ్మ.

"రేపు బజారు వెళ్ళినప్పుడు తెస్తాలే. ఎన్ని, నాలుగు చాలా?"

కలో నిజమో తెలియక మతిపోయింది నరసమ్మకు. "ఎందుకమ్మగారూ అన్ని? రెండు వుండనే వున్నాయిగా? మరొక్కటైతే చాలు," అన్నది అణకువగా.

"మరీ ఒక్కటే ఎలా సరిపోతుంది?" అనుకుంటూ వెళ్ళిపోయింది సుభద్ర, విరావళించి చూస్తూన్న నరసమ్మను గమనించకుండా.

## 13

"ఏమిటి సుభద్రా నువ్వేమిటో కొనుక్కుంటానంటూ బయలుదేరి మళ్ళీ అలా చేశావేమిటి? నువ్వేమీ కొనుక్కోక పోవటం నాకేం బాగులేదు." అన్నాడు చలపతి రాత్రి పడుకుంటూ.

"ఊరికేనే." అన్నది అన్యమనస్కంగా వున్న సుభద్ర.

"సుభద్రా!" లాలనగా పలుకరించాడు. చాలసేపు ఆమెను పరిశీలనగా చూచిన చలపతి.

"ఊఁ."

"ఏమి టీమధ్యన అలా అదోలా వుంటున్నావ్? దాచకుండా నాకు చెప్పు."

"ఎలా వున్నాను?" ఎదురు ప్రశ్నించింది సుభద్ర.

"అలా ఎదురు అడిగి తప్పించుకుంటే నేనేం చెప్పగలను? పది పన్నెండు రోజులనుంచీ నువ్వు యిదివఱకటి సుభద్రవు మాత్రం కాదు."

తప్పనిసరిగా నవ్వింది సుభద్ర. "మారిపోయానంటారా? అందరికీ ప్రయోజనమైన మార్పే అయితే అది మంచిదే కదా! అయినా నే నెలా మారానో ఏమిటో చూచే మీకు తెలుస్తుంది కాని, నామటుకు నాకేం తెలుస్తుంది?"

మరి మాట్లాడటానికేమీ మిగలలేదనిపించింది చలపతికి. అయినా యింకొక్కసారి ప్రయత్నించి చూచాడు. "పోనీలే. బలవంతమేమీ లేదు. నీ కిష్టమైతేనే చెప్పు........నీకేమైనా కొంత మార్పు కావాలని వుంటే పోనీ కొన్నాళ్లు మీవాళ్ళింటికి వెళ్ళి వుండిరా. వెళ్తావా?"

సుభద్ర నుంచి జవాబులేదు.

"చెప్పు సుభద్రా. నా దగ్గఱ సిగ్గు దేనికి? మీవాళ్ళందర్నీ వదలిరావటం నీకూ యిదే కొత్తకదా? ఒకవేళ మీ అమ్మా నాన్నగార్లను చూడాలని నీకు

బెంగగావుంటే వెళ్ళి కొన్నాళ్ళుండిరా."

"ఊఁ." అంగీకారంగా తలవూపింది.

"సరే. అయితే రేపే టిక్కెట్టు రిజర్వ్ చేయిస్తాను."

## 14

పుట్టింట అందరూ ఆప్యాయంగా యిచ్చిన ఎదురుకోలుకూ, ప్రదర్శిస్తూన్న ప్రేమానురాగాలకూ మురిసి తబ్బిబ్బైపోయింది సుభద్ర. నాలుగు రోజుల వఱకూ ఆమె చలపతినీ, పిల్లలనూ యించుమించుగా మఱచిపోయింది.

సాయంత్రం తీరుబడిగా కూర్చుని వున్న సుభద్ర చెంతకు పెద్దవదిన కామాక్షి వచ్చి కూర్చుంది.

"ఈ చీర ఎంత సుభద్రా? ఓ వందైనా వుంటుంది కదూ?" అన్నది సుభద్ర కట్టుకున్న చీరను నాణ్యం చేస్తూన్నట్టు కొంగు నలిపి నలిపి చూస్తూ.

వింతగా చూచింది సుభద్ర. "ఏమో. తెలియదు వదినా! అయినా మరీ అంత వుంటుందా?"

"అయ్యో. ఎందుకుండదు? అసలే పట్టుచీర, దానికితోడు జరీ అంచు! అయినా నీకెందుకు తెలియదు?"

"ఎలా తెలుస్తుంది?" విసుగ్గా వుంది సుభద్ర జవాబు. "ఇప్పుడు నాకోసమని ప్రత్యేకంగా కొని నెత్తినపెట్టారా ఏం? ఇంట్లో యిదివఱకు వున్న పాతదే."

"ఓ! అలాచెప్పు మరి!" కామాక్షి కనుబొమలెగరేస్తూ కళ్ళు చిత్రంగా కదిలించింది. "ఇవన్నీ మీ సవతివన్నమాట! నువ్వు పెట్టుకుంటూన్న నెక్లెస్, గాజులు అన్నీకూడ ఆవిడవేనా?"

"ఆ." పరధ్యానంగా అన్నది సుభద్ర చలపతీ, పిల్లలూ తలపుకు రాగా.

కామాక్షి కళ్ళు పెద్దవిచేసి గుడ్లు నిలబెట్టేసింది. "ఎంత అదృష్టవంతురాలవ్ సుభద్రా!" అన్నది సాగదీస్తూ, మెచ్చుకోలు మిశితంచేసి. "వచ్చినప్పటినుంచీ చూస్తున్నాను. చాలా నగలూ బట్టలూ మార్చుతున్నావ్. ఎంత ధనికురాలవైపోయావ్!"

మరుగుతూన్న పాయసం గొంతు దిగక నాలుకను కాల్చుతూ బాధ పెడ్తూన్నట్లుగా వుంది సుభద్రకు ఆ మాటలు వినటం.

అంతలోనే చిన్న వదిన కాంతం అటుగా వచ్చి మాటలో మాట కలిపింది. "ఏమిటే సుభద్ర మాటేనా అంటున్నావ్ అక్కయ్యా? అవును మరీ జమీందారిణి అయిపోయింది. అయినా ముగ్గురు పిల్లల తండ్రైన ముది వరుడికి కట్టబెట్టడంలో ఆ మాత్రం ప్రయోజనమైనా లేకపోతే ఎలాగలే!"

ఒక చెంపన చుంబిస్తూ మరో చెంపన ఛెళ్లు మన్పించినట్లున్న ఆ విసుర్లకు దిమ్మెరబోయి చూచింది సుభద్ర. పెనుగాలిలో చిగురుటాకులాగా అల్లల్లాడిపోయింది ఆమె అంతరంగం.




"ఇంతకీ ఈ నగలూ, గుడ్డలూ చూచుకొని మురుసుకోవడమేనా, అసలు ముచ్చట్లూ మురిపాలూ ఏమైనా ఉన్నాయా? నీ మీద ఏమైనా కాస్త యిది వుందా మీ ఆయనకి?" కన్నుగొడుతూ చవకబారు నటిలాగా అడిగింది కాంతం తిరిగి.

ముచ్చెమటలు పోశాయి సుభద్రకు.

అంతలో సుభద్ర చిన్ననాటి స్నేహితురా లొకామె రావడంతో వదినల నోళ్లు మూతబడ్డాయి. వారి వాగ్బాణాల తూట్లకు మదిలో యింకా మధనపడుతూనే వున్న సుభద్ర బాల్యస్నేహితురాలిని పలుకరించాలనే మర్యాదను కూడా మరచి అలాగే మౌనంగా చూస్తూ వూరుకొంది.

స్నేహితురాలే మొదట పలుకరించింది.

"నేను లీలనే సుభద్రా! ఏమిటలా చూస్తావ్? నాల్రోజులై వచ్చావట!

ఎక్కడా మా కెవరికీ దర్శనా లేలేవేమిటి?"

"వద్దా మనుకుంటున్నాను లీలా. అలాగే అశ్రద్ధ అయిపోయింది." బలవం తాన నవ్వు తెచ్చుకుంటూ అన్నది సుభద్ర.

"అమ్మయ్యో!" కామాక్షి ఏదో విప రీతం జరిగినట్టు వ్యాఖ్యానం ప్రారంభిం చింది. "సుభద్ర లీలను గుర్తుపట్ట గలిగిం దేవ్ కాంతం!" అన్నది అమితాశ్చర్యం పొందినట్లుగా గావుకేక పెడుతూ.

కాంతం విషపు నవ్వు నవ్వింది. "అదే నేనూ అనుకుంటున్నాను. అయినా లీల పిచ్చిగానీ, సుభద్ర యిప్పుడేమన్నా వెను కటి సుభద్రేమిటి? ధనవంతురాలు వీధుల వెంట తిరుగుతూ సామాన్యమైన ఇళ్ళల్లో అడుగుపెడ్తుందనెలా అనుకున్నావ్ తల్లీ లీలాకుమారీ నువ్వు?"

ఈ ధ్వనీ ప్రతిధ్వను లేమిటో అర్థం గాక విచలితురాలై చూచిన లీల అంత లోనే కొంతవరకూ గ్రాహ్యం చేసు కున్నదై, "ఏమిటండీ మీరు మరీ అలా మాట్లాడుతారు? మా సుభద్ర అటువంటి దేం కాదు." అన్నది.

అప్పటికి సుభద్రకు కర్తవ్యం బోధ పడింది. "నడు లీలా, కాస్త అలా మీ యింటికి వెళ్ళి వద్దాం. మీ అమ్మగార్ని వాళ్ళనీ చూచి చాలా రోజులైంది. నడు." అంటూ లీల భుజం మీద చేయివేసి వెళ్ళి పోతూ, "అమ్మా! నేను లీల యింటికి వెళ్తున్నానూ!" అంటూ లోపలున్న తల్లి నుద్దేశించి చెప్పి లీలతో సహా నిష్క్రమించింది.

"ఏమిటే బాబూ మీ వదినలు కొత్తిగా అలా మాట్లాడుతున్నారు?" అన్నది లీల యిల్లు దాటి రాస్తా మీదికి వచ్చాక.

పేలవంగా నవ్వింది సుభద్ర. "నీకు తెలియదా లీలా వాళ్లెటువంటివాళ్ళో! పెళ్ళి పెటాకులూ లేకుండా పుట్టింట పడివుం దనీ, పెట్టి పోషిస్తున్నామనీ అప్పుడు దెప్పిపొడిచే వాళ్ళు. ఇప్పుడేమో ముది మొగుడైనా విలువైన నగలూ, దుస్తులే ముచ్చట్లూ మురిపం అని సరిపెట్టుకో మంటూ అన్యాపదేశంగా అని ఎత్తిపొడు స్తున్నారు." అన్నది.

"ఏడిశారు లెద్దూ!" చులకనగా తీసి పారేసింది లీల. "వచ్చి నాల్గురోజులైం దవి అప్పుడే వెళ్ళగొట్టేందుకు మార్గా లాలోచిస్తున్నారన్నమాట! అసలు కొందరు రాబందులై పుట్టవలసిన వాళ్ళు ఎంచేతో మనుష్యులై పుడ్తారు."

"చిన్ననాటి నేస్తురాలివి- నువ్వొచ్చా వని కూడా వాళ్ళు నోళ్లు మూయలేదు చూశావా? స్నేహితురాళ్ళం మాట్లాడుకొనే అవకాశం యివ్వాలనే యింగిత జ్ఞానం కూడా లేకుండా అక్కడే కదలకుండా వాగుతున్నారు చూశావా? అందుకే నే నిలా వచ్చేశాను."

సానుభూతితో వింటూన్న లీల మాట్లాడలేదు.

"అయినా అంతా నా ఖర్మలే లీలా.

వాళ్ళైనా ఉన్నమాటేగా అన్నారు? వాళ్ళందరికీ బరువై పెరిగి పెరిగి ఆపైన రెండో పెళ్ళివాడితో పెళ్ళై............'' దుఃఖపు జీరతో గొంతు లోంచి మరి మాట రాలేక పోయింది.

''ఛ ఛ! అదేమిటి సుభద్రా అంత బేలవై పోతావ్? ఎవళ్ళో ఏదో అంటే అదే నిజమని నిన్ను నువ్వే హీనపరచు కుని బాధపడతావా? లభించిన దానితో సంతృప్తి పడాలికాని కుక్కల అరపులకు కూడా చలించిపోతే యిక మనం భవి ష్యత్తులో బ్రతికి బట్టకట్టినట్లే!''

అంతలో సంభాషణ కడ్డువస్తూ విన వచ్చిందో పిలుపులాంటి కేక. ''లీల క్కయ్యా, మా యింటికి రాకుండా వెళ్ళి పోతున్నావా?''

ఇద్దరూ అటు చూచారు. ఒక యింటి కిటికీలోంచి పదేళ్ళ అబ్బాయి పిలుస్తు న్నాడు.

''ఓ! ఇది కుసుమ యిల్లు కదూ? నేను గమనించలేదు. ఇక్కడ వుందా కుసుమ?'' అనడిగింది సుభద్ర లీలను.

''ఆ వుంది. వెళ్దాం వస్తావా?'' లీల కంఠంలో ఏదో అనిర్వచనీయమైన మార్పును గుర్తించింది సుభద్ర. ''శాశ్వ తంగా ఇక్కడే వుండటాని కొచ్చింది కుసుమ.''

''ఏమిటీ???'' విపరీత వార్త విన్న సుభద్ర అరిచింది ఆశ్చర్యంగా. ''శాశ్వ తంగా ఇక్కడుంటుందా? ఏమిటి నువ్వ నేది?''

''ఏం చెప్పను సుభద్రా?'' లీల కంఠం వణికింది. ''నువ్వు పెళ్ళై వెళ్ళిన నాలుగు నెలలలోనూ యిక్కడ మన స్నేహితుల జీవితాలలో చాలా మార్పులు జరిగాయి. నీకే తెలుస్తాయిగా? పద కుసుమను చూద్దాం ముందు.''

అడుగుల శబ్దం విని ''ఎవరూ?'' అని ప్రశ్నిస్తూ చేతి కర్రతో దారి తడుము కుంటూ వంగి నడుస్తూన్న ఓ ముసలమ్మ హాలులోకి వచ్చింది.

''కుసుమ వుందా అవ్వా?'' అని ప్రశ్నిస్తూన్న సుభద్ర నోరు తక్కున చేతితో మూసింది లీల. ''నేను లీలను వచ్చాను కుసుమా. ఎలా వున్నావే?'' అంటూ కుసుమను పట్టుకునడిపించి ఒక కుర్చీలో కూర్చోబెట్టింది లీల.

దిగ్భ్రాంతయై శిలాప్రతమలా నిల బడింది సుభద్ర.

పేరుకు తగ్గట్టే కుసుమబాల వలె నాజూకు సౌందర్యంతో ఒకనాడు మిడిసి పడిన కుసుమేనా ఈమె! కళాశాలకంతా అందగత్తె అని పేరుమోసిన కుసుమకు ఏమిటీగతి? కొన్ని పళ్ళు లేవు. కళ్ళు కన్పించటంలేదు. ముఖం కాలిపోయిన గుర్తుగా నల్లగా వుంది. తలమీది జుట్టు పూర్తిగా తలను కప్పడంలేదు. పిశాచి లాగా వుంది. ఈమె కుసుమేనా? లీల నాటక మాడ్తూందా ఏమైనా? అలాగే పరీక్షగా చూడసాగింది.

"ఏమైనా మాట్లాడు లీలా. అలా కూర్చున్నావేమిటి?" కుసుమ ప్రశ్నించింది.

ఆ కంఠం విని నిర్ధారించుకుంది సుభద్ర; అవును ఈమె కుసుమే. వీణా నాదం వంటి అటువంటి కంఠస్వరం వరమై సంగీతసిద్ధి, ఇంటినిండా లబ్ధిగల కుసుమ నేలమీద నడిచేదా? సామాన్యులను కన్నెత్తి చూచేదా? అటువంటి కుసుమ కేమిటీ రాత?

"ఏమైనా జబ్బు చేసిందా కుసుమకు?" ఎలాగో నోరు పెగుల్చుకుని మెల్లగా అడిగింది ప్రక్కనున్న లీలను.

"ఎవరది?" కుసుమ ఆరాగా అడిగింది. "ఎవరు లీలా, ఏదో కొత్త గొంతు విన్పిస్తోంది! ఎక్కడో ఎప్పుడో విన్నట్లుంది!"

"సుభద్ర వచ్చింది కుసుమా నిన్ను చూడటానికి. ఈ మధ్యే వచ్చింది అత్తవారింటి దగ్గర నుంచి."

"అహా!. చాలా సంతోషం." సంతృప్తిగా అన్నది కుసుమ. "నీకు కూడా నా మీద లీలలాగే అభిమానమా సుభద్రా? చూచావా నా బ్రతుకెలాగై పోయిందో! మీరంతా స్నేహంగా నా చుట్టూ తిరిగినప్పుడు కన్నుమిన్నుగానక మిమ్మల్ని ఛీదరించుకునేదాన్ని; యిప్పుడు మీరంతా వస్తేనే చాలన్నట్లు ఎదురు చూస్తూంటాను!" కన్నులనుంచి నీరు అదేపనిగా స్రవిస్తూంటే తుడుచుకోనైనా తుడుచుకోకుండా కూర్చుంది కుసుమ దుఃఖిస్తూ.

"ఛ. ఊరుకో కుసుమా. ఏం చేస్తాం? అంతా దురదృష్టం!" తనకు కూడా దుఃఖం రాగా, దిగమ్రింగుకుంటూ ఓదార్చ ప్రయత్నించింది సుభద్ర.

"అవునులే. ఏడ్చిమాత్రం ఏం ప్రయోజనం? అయినా ఎందుకు నే నేడవడం? ఇంకెవరి కోసం బ్రతకాలి, ఎందుకేడవాలి? గుప్పెడు విషం మ్రింగితే పీడాపోయె! కాని నా కెవరూ విషం తెచ్చిపెట్టరు. తెచ్చుకుందామన్నా నాకు కళ్ళూ కాళ్ళూ లేవు!"

మ్రాన్పడిన సుభద్ర మాట్లాడలేక పోయింది. లీల స్థితికూడా అలాగే వుంది.

అంతలోనే కళ్ళు తుడుచుకుని మామూలుగా అయిపోయింది కుసుమ. "సరే. పాపం నువ్వెంతగానో నన్ను చూడాలనివస్తే నా సొదతో విసిగిస్తున్నట్టున్నాను. పోనియ్ ...ఇంతకూ నువ్వు సంతోషంగా వున్నావా సుభద్రా? మీవారూ నువ్వూ అన్యోన్యంగా వుంటారా?" కుశల ప్రశ్న చేసింది.

ప్రసంగం మారడంతో సుభద్రలోని భారం కూడా కొంత తగ్గింది. "ఇష్టంగానే వుంటాం కుసుమా. నేను సుఖంగానే వున్నాను."

"అదే అదే కావాలి సుభద్రా. సంతోషం. చాలా సంతోషం నువ్వు సుఖంగా సంసారం చేసుకుంటున్నందుకు. మీరంతా పేదవాళ్ళని పురుగుల్ని విదిలించి




నట్టు విదిలించుకునేదాన్ని. నాకే కష్టమూ లోటూ వుండదనుకునే దాన్ని. కాని చూశావా నా కండకావరాన్ని భగవంతు డెలా అణగ్గొట్టేశాడో! డబ్బుతో కష్టా లను పోగొట్టుకోలేం కదూ!"

కంపరమెత్తింది సుభద్రకు. ఇక అక్కడ ఎక్కువసేపు కూర్చుంటే మతి పోతుందేమోనన్పించి. "వస్తాం కుసుమా. వెళ్ళేలోగా మళ్ళీ వస్తానులే." అంటూ లేచింది.

లీల కూడా లేచింది. "నేను మళ్ళీ రేపో ఎప్పుడో వస్తాలే కుసుమా, ఇవాళ కొంచం పనుంది. వెళ్ళనా మరి!" అన్నది.

"వెళ్ళి రండి సుభద్రా, లీలా. మీతో మాట్లాడుతూంటే ఏమిటో కాస్త ఓదార్పు!" లేచి కర్రతో నేల తట్టు కుంటూ దారి వెతుక్కుని వారి దగ్గరకు వచ్చి ప్రేమగా నిమిరింది. ఘోరమైన ఆ ఆకారం తనను స్పర్శిస్తూంటేనే జుగు ప్సతో మేను జలదరించింది సుభద్రకు. గబగబా బయటపడింది.

కుసుమ అందానికి మురిసి ఆమెను ఆరాధించిన అసంఖ్యాకమైన యువకు లనూ, నింగి నేలా తెలియకుండా కన్నూ మిన్నూ గానక ప్రవర్తించిన ఒకనాటి కుసుమనూ, "కుసుమా; ఒక్కసారి కారెక్కనీయవూ!" అని ఆశగా అమాయ కంగా బ్రతిమాలి, "ఛీ, నీ మురికి గుడ్డ లతో మా కారెక్కుతావా? పో పో! సిగ్గు లేదూ!" అని కుసుమ చేత అన్పించుకొని

సిగ్గుతో, నిరాశతో క్రుళ్ళిపోయి ఏడ్చిన ఒకనాటి తన పాత జీవితాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ పరధ్యానంగా నడుస్తోంది సుభద్ర.

"ఏమిటే కుసుమ గురించేనా నీ ఆలోచన అంతా?" అంటూ పలుకరించింది లీల. "ఎవరో చాలా గొప్ప ఆఫీసర్ని ప్రేమించి పెళ్ళాడింది కుసుమ. వాళ్ళు వీళ్ళకంటే ధనవంతులు. ఆ పెళ్ళిని మన మెవ్వరం కళ్ళతో కూడా చూడటానికి అనర్హులం మన్నట్లుగా అస్సలు ఎవర్నీ పిలవలేదు. పెద్దపెద్దవాళ్ళనే కాని. ఆ తర్వాత కులాసా విహారాలకు కాశ్మీర్ యింకా ఏమేమిటో తిరిగొచ్చారు. క్రితం నెల ఎక్కడికో వెళ్తూంటే—వీళ్ళున్న విమానం కలకత్తా దగ్గర పడిపోయి కాలిపోయిందిట. భర్త ఆకారం కూడా మిగల లేదు. కుసుమకు ఈ చావూ బ్రతుకూ కాని దుస్థితి దాపరించింది."

"ఎంత ఘోరం!" అన్నది శ్రోత సుభద్ర. అంతకు మించి ఆమె ఏమీ మాట్లాడలేకపోయింది.

చాలా సేపటికి సుభద్ర అడిగింది. "అన్నట్టు ఇప్పుడు కోమలి ఎక్కడుంది లీలా? తెలుసా నీ కేమైనా?"

"ఏ కోమలీ?" ఆలోచిస్తూ అడిగింది లీల. "వాడి పెళ్లాం అలా వుంది. దీని మొగుడిలా నడుస్తాడు" అంటూ తెగ పేర్లుపెట్టి హేళన చేసేది అందరినీ- ఆ కోమలేనా?"

"ఆ ఆఁ, తనే." అన్నది చిన్నగా నవ్వుతూ సుభద్ర.

"ఇక్కడే ఉంది పుట్టింట్లో. ఏం వెళ్లామా?"

"అబ్బే వద్దు, ఊరికినే జ్ఞాపకం వస్తేను అడిగేను."

"అబ్బో. బ్రతుకు బజార్న పడినా ఆ గీర మాత్రం చావలేదు మనిషిలో!"

"అదేమిటి, ఏమైందో?" కుతూహలంగా అడిగింది సుభద్ర.

"ఏమో ఏమైందో? కోరి కోరి ఎన్ని ఎన్ని గొప్ప సుందరాకారుడినే పెళ్ళాడింది. నీకు తెల్సుకదా!"

"ఔను, అయితే?"

"ఏ మొచ్చిందో మరి ఇద్దరి మధ్యనా. ఇంకా ఏడాది పూర్తైందో లేదో విడాకులకు ప్రయత్నిస్తోంది."

"అరె! ఎంత విడ్డూరం!" అన్నది సుభద్ర.

"విడ్డూరమే మరి! అయినా అదంతా మనకే, వాళ్ళకేం లేదు. అప్పుడే మరొకడితో స్నేహం పెళ్ళిబేరాలు కూడా సాగుతున్నాయి!"

ఉలికిపడింది సుభద్ర, ఒకనాడు చలపతికీ తనకూ జరిగిన సంభాషణ తలపుకు రాగా. కాస్సేపైనా తన గొడవను విస్మరించి, తనను తాను మఱచిపోదామని బయటకు వచ్చిన సుభద్రకు యిక్కడ కూడా మనశ్శాంతి లోపించింది.

"ఇవాళ ఏమిటో బాగుండలేదు లీలా నాకు. వెళ్ళిపోతాను. రేపు వస్తాలే మీ యింటికి." అన్నది అభ్యర్థిస్తున్న ధోరణిలో.

"అదేం? ఇంటిదగ్గఱ బయల్దేరే టప్పుడు బాగానే వున్నావ్ కదా? ఈ దిక్కుమాలిన గొడవలన్నీ చెప్పి నీ మనస్సు పాడుచేశా ననుకుంటాను. ఛ," నొచ్చుకుంటూ అన్నది లీల.

"లేదు లేదు. అదేంలేదు కానీ నన్ను వెళ్ళనీ."

"సరే పద. మీ యింటి వఱకూ వచ్చి దిగబెడ్తాను."

నవ్వేసింది సుభద్ర. "ఎందుకు లీలా, నే నేమైనా క్రొత్తదాన్నా ఈ వూరికి?"

"అబ్బే, అందుకు కాదులే. నాకూ అటువేపు పనుంది. మీ అవతలి వీధిలో కమల లేదూ? తనతో కొంచం పనుంది నాకు."

"కమలకు ఇద్దరు పిల్లలుకదూ?" గుర్తు తెచ్చుకుంటూ అడిగింది సుభద్ర.

"అవును. ఇప్పుడు తనుకూడా ఉద్యోగం చేస్తోంది, వాళ్ళాయనగారి ఆఫీసులోనే."

"అలాగా? చాలా అదృష్టమే!"

"నీ ముఖం. ఏమిటి అదృష్టం?"

"అదే....తను చేస్తూన్నది!" నసిగింది సుభద్ర.

"ఏమో బాబూ, నాకు మాత్రం అలా అన్పించదు. అవతల ఆఫీసు పని. ఇటు పిల్లల గోల. భర్త ఏమంత అధికారం చేయడనుకో. కాని ఏ సాయం చేయ కుండా అలా చూస్తూ వూరుకుంటాడు. ఇది కాక అత్తా ఆడబిడ్డలకుకూడా చాకిరీ, వాళ్ళ అధికారాలూ!"

"పోనీ అంతశ్రమపడి ఆ ఉద్యోగం చేయకుంటే నేం?" అమాయకంగా అడిగింది సుభద్ర.

"అయ్యో నీ పిచ్చి! ఉద్యోగం చేయక పోతే ఎలాగ? భర్త కొచ్చే మూడు వందలూ ఆ కుటుంబాని కేమాత్రం? అంచేత అప్పులు పాలవ్వకుండా దరిద్రంలో ఈదులాడకుండా తన సంపాదనతో కూడా సాయపడ్తోంది కుటుంబానికి. చాలా ఓర్పువుందిలే. పట్టుదలగా యిప్పుడు టైపూ, షార్టుహేండూ నేర్చుకుని ఆ ఉద్యోగం సంపాదించి రెండు వందల యాభై సంపాదిస్తోంది!"

"ఎందుకో నాకూ కమలను చూడాలని వుంది పద."

"ఓ. రా. దానికేం. ఎటొచ్చీ తనకు పాపం మనతో మాట్లాడే తీరిక వుండక పోయినా ఏమీ అనుకోకూడదు మరి!" షరతులాగా మాట్లాడింది లీల.

"ఛ! నా కా మాత్రం తెలియదా? ఇంతకూ ఆమెగారితో పనేమిటి?"

"పనా? పెద్దపనే"

"ఏమిటో చెప్పకూడదా?"

"ఏముందిలే సుభద్రా క్రొత్తగా చెప్ప టానికి. మధ్య తరగతి వాళ్ళ సమస్యలన్నీ

యించుమించు ఒకటే కదా! నే నీ మధ్య బియ్యే ప్రైవేటుగా చదివి పాసయ్యాను. ఏవో కొన్ని ట్రెయినింగులు కూడా అయ్యాననుకో. కమల ద్వారా వాళ్ళ ఆయన ద్వారా ఒక ఉద్యోగానికి ప్రయత్ని స్తున్నాను."

"అబ్బ!" విపరీతాశ్చర్యం ప్రకటిం చింది సుభద్ర. "నువ్వు బియ్యే పాస య్యావా? ఎంతపట్టుదల!"

"నా ముఖం! పట్టుదలా, పాడా? అవ సరం, అవసరార్థం చచ్చి చెడి పాస య్యాను. అంతే."

సుభద్ర మౌనంగా వింటోంది ఇంకా లీల చెప్పబోయే భోగట్టా కోసం ఎదురు చూస్తూ.

లీల చెప్పింది క్లుప్తంగా: "నాన్న జబ్బు మనిషి. మందులకు చాలా డబ్బు ఖర్చు పెట్టవలసివస్తోంది. ఇంకా యిద్దరు తమ్ముళ్లు చదువుకోవాలి. అన్న సంపాదన తన పెళ్ళాం బిడ్డలకే సరిగా చాలటంలేదు. ఇక నేనేం చేయను? నాకు పెళ్ళౌతుంది, చేస్తారు—అన్న ఆశ ఎటూ లేదు కదా. యింత ప్రయోజకులైన తలి దండ్రులూ, తోబుట్టువులూ! ఇక యెంతకాలం యిలా పొయ్యిలో చాకిరీ చేసుకుంటూ, తిండికీ బట్టకూ ఒకరిమీద ఆధారపడి వుండను? అందుకే దీక్షగా చదవటం మొదలుపెట్టాను రాత్రిళ్ళు కూర్చుని. పుస్తకాలకూ పరీక్షలకూ డబ్బు కట్టలేక, చదవడానికి టైములేక నానా యాతనలూ పడ్డాననుకో. ఇంటి చాకిరీలో మునిగి తేలుతూ అలాగే ఎలాగో వాళ్ళనీ వీళ్ళనీ ముష్టెత్తి దేవిరించి పుస్తకాలు సంపాదించి చదివి చచ్చి చెడి పాసయ్యాను. పరీక్షకు కట్టవలసిన డబ్బు పాపం కమల యిచ్చి సాయపడింది దైవం లాగా. నేను సంపా దించగలిగినప్పుడు ఆ ఋణం తీర్చేస్తాను.

"కమల ధర్మమా అని ఉద్యోగం వస్తే నా ప్రాణం కాస్త కుదుటబడుతుంది. నా సమస్య తీరుతుంది. అమ్మా నాన్నలను సుఖపెట్టవచ్చు. తమ్ముళ్ళను చదివించుకో వచ్చు బాగా."

"ఆ పైన?" సుభద్ర అడిగింది.

అర్థంకానట్లు చూచింది లీల.

"అదే నీ భవిష్యత్తుమాట నే నడిగేది. తల్లిదండ్రులను పోషించటం, తమ్ముళ్ళను చదివించినంత మాత్రానే నీ సమస్య తీరి పోతుందా? మరి నీ పెళ్ళి, నీ జీవితం మాటేమిటి?"

గంభీరంగా నవ్వింది లీల. "అందని వాటికోసం ఆశలు పెంచుకొని అఱ్ఱులు చాచి, అఖరుకు అందుకోలేక మనః క్షోభకు గురవ్వడంకంటే, అలవిమాలిన ఆశలను ఆదిలోనే అణచివేయటం మంచి దని నా అభిప్రాయం సుభద్రా. అందుకే నేను అత్యాశలకు పోవడంలేదు. కొందరి జీవితం అంతా అమృతమయం; మరికొం దరి జీవితం తనవారి అందరికోసం— అంతేకాని వ్యక్తిపరంగా అసలు వాళ్ళ కేమీ ఉండదు, వుండకూడదు. నేను ఈ రెండో తరగతికి చెందినదాన్ని. అంచేత నేను పెళ్ళి వగైరా పెద్ద విషయాలూ ఆశలూ ఎప్పుడూ నా దరికి జేరనివ్వను."

(సశేషం)

# బార్ మేనేజర్

## మారేమండ సీతారామయ్య

చెప్పాలి.

చెప్పి తీరాలి.

దాగని విషయం కాబట్టి, దాచుకో దగ్గ విషయం కాదు కాబట్టి, దాచాల్సిన విషయం కాదు కాబట్టి, దాపరికం ఉంచకూడని మనుష్యులు కాబట్టి, ఎప్పటికో అప్పటికి చెప్పాల్సిన విషయం కాబట్టి చెప్పాల్సిందే. అవును చెప్పాలి!

చెప్పేటప్పుడు వెనుకాడ కూడదు. కుండ బద్దలు కొట్టినట్టు చెప్పాలి. చెవులు చిల్లులు పడేంత గట్టిగా మరీ చెప్పాలి. జంకకుండా చెప్పాలి, అక్షరం పొల్లుపోకుండా. అనుకున్న దనుకున్నట్టు చెప్పాలి. సూటిగా మనసులో మాట చెప్పేయాలి. ఘాటుగా మాటలంటారు. అన్నయ్య తిడతాడు. చదివిన చదువు సారాంశం ఇదా అంటాడు. వద్దని వారిస్తాడు. లాలిస్తాడు. బుజ్జగిస్తాడు. బతిమాలతాడు. తను వినడు. పట్టు వదలడు. చెప్పిన విషయం చేసితీరతా నంటాడు. వెంటనే అన్నయ్య మండిపడతాడు. కళ్ళెర్ర చేస్తాడు. మన వంశంలో చెడబుట్టా నంటాడు. పుట్టి చెడ్డా వంటాడు. చెడి వంశం పేరు ప్రతిష్టలు చెడిపా వంటాడు. కోపంతో జోళ్ళు వేసుకుని టకటకలాడించు కుంటూ కండువా మీదేసుకుని వెళ్ళిపోతాడు. లేకపోతే తన గదిలోకి వెళ్ళి భళ్ళున తలుపు బ్రద్దలయ్యేలా, గడియ విరిగేలా, మడతబందు మేకు వంగేలా, గొళ్ళెం అర గంట



వూగుతూ చప్పుడయ్యేలా, శెయ్యకుండానే చిడతపడేలా తలుపు వేసేసుకుంటాడు.

అత్తిగ తన్ను కోపంగా కళ్ళల్లోకి చూస్తుంది. తను తల దించుకుంటాడు. పొంగి పొరలి ప్రవహించబోయే కన్నీటి ధారను బలవంతంగా పెదవి బిగించి ఆపుతుంది. ఆగకపోతే చీర కొంగుతో ఆనకట్ట వేస్తుంది. విసురుగా వంట గదిలోకి వెళ్ళిపోతుంది. వెళ్ళి గిన్నెలు పగిలేలా చప్పుడు చేస్తుంది. చేసి విసినికర్ర విరిగేలా టపటపా కుంపటి విసిరేస్తుంది. కసిగా చుయ్‌మనేలా పోపంతా చార్లో పోసేస్తుంది.

తను హాల్లో నించుంటాడు. తప్పు చేసిన వాడిలా. బోనులో దోషిలా. దేవుడు ముందు నేరస్థుడిలా. పరీక్ష పేపరు తీసుకోబోయే విద్యార్థిలా. ఒంటరిగా. తోడు లేకుండా. విగ్రహంలా. ఇంకా చాలా చాలాలా.

ఇంతలో నాన్నగారు వస్తారు. "నే విన్నది నిజమేనా?" అని ప్రశ్నిస్తారు.

నిజం కాబట్టి నేను మాట్లాడను. "అప్రాచ్యుడా! తప్పి జారి నా కడుపున పుట్టావు (నిజం కాదు నమ్మకండి. పుట్టింది అమ్మ కడుపున) ఇది నీతి నిజాయితీ వున్న వంశంరా. నువ్వు చేసిన పనేమిటి తెల్సా? తెల్సి చేసిన పనేనా ఇది? అయినా వంశం, కుటుంబం, గౌరవం, పెద్దా, చిన్నా ఏడిశాయా? తాగుబోతు వెధవలతో కల్సితందనాలాడు. నీ ఇష్టం వచ్చిన వాళ్ళతో ఊరేగు" అని తన గదిలోకి వెళ్ళిపోతారు.

గుడి నుంచి అమ్మ వస్తుంది. వస్తూనే ప్రసాదం చేతులో పెడుతుంది. నా మౌనం చూసి వివరం అడుగుతుంది. ఏమీ తెలియని అమ్మకు తను అన్నీ తెల్సేలా చెప్తాడు. అప్పుడు అమ్మ— అవును! అప్పుడు అమ్మ ఏమంటుంది? అమ్మ రియాక్షను యెలా వుంటుంది? "మద్యపాన నిషేధం రద్దు పరిచినంత మాత్రాన అది మంచి పనవుతుందా? తప్పు నాయనా!" అని అంటుందా? లేక చిన్నప్పుడు చెప్పకుండా, ఎవరు చూడకుండా ఉట్టి మీద పాలు తాగేసేనని కొట్టినట్లు, చెంప పగులగొడుతుందా? చూడాలి. చెప్పిన తరువాత చూడాలి.

తలుపు చాటునుండి చెల్లెలు ఓరగా తన్ను చూస్తుంది. అన్నయ్య కోపం, అత్తిగ విసురుబాటుతనం చూస్తుంది. నాన్నగారి ప్రవర్తన పరిశీలిస్తుంది. అమ్మ ఇచ్చిన ఉపదేశం వింటుంది. విని నా మీద కోపంతో ఏమీ చెయ్యలేక మౌనంగా ఊరుకుంటుంది.

ఏమో! ఎవరు ఏమన్నా, ఏమనుకున్నా, ఏం జరిగినా, ఎంత రాద్ధాంతం జరగబోయినా నేననుకున్నది చెప్పి తీరతాను. చెప్పినది చేసితీరతాను.

అయినా చెయ్యబోయే పనిలో తప్పు ఏమాత్రం లేదు! ఉద్యోగం పురుష

లక్షణం. అందుకే నేనా ఉద్యోగం చేయటానికి సిద్ధ పడ్డాను. అన్నయ్య మాస్టరు గిరీ వెలగబెట్టి సంపాయించే రెండువందల ఏభై రూపాయలకంటే నాకు ఆ ఉద్యోగం వల్ల మరో ఏభై ఎక్కువే వస్తాయి.

బార్‌లో ఉద్యోగం చెయ్యటం తప్పా? అదే దృష్టిలో ఆలోచిస్తే తప్పు కాని దేముంది? అన్నీ తప్పులే. హోటల్సు చేసే పనేమిటి? డబ్బు తీసుకొని అన్నం పెట్టటం కదూ! అంటే అన్నం అమ్ముకోటం. రంగురంగుల అద్దాలలో పెట్టి రకరకాల బూట్లు అమ్ముకునే జోళ్ళ కంపెనీ ఓనరుకు గౌరవం లేదూ? తెలుగులో చెప్పాలంటే షూ బిజినెస్ చెప్పులమ్ముకోటం కదా! ఇంకా జానుతెలుగులో చెప్పాలంటే తోళ్ళమ్ముకోటం. ఐనా అతనికి గౌరవం ఉంది. లక్షలున్నాయి. సేవకులున్నారు. గౌరవప్రదమైన ఉద్యోగాలు చేసే వారికంటే ఎక్కువ గౌరవ ముంది. 'మంచి చెడ్డా అనేది ఈ ప్రపంచంలోనే లేదు. మనం ఆలోచించే విధానం దేన్నైనా మంచిగా గాని చెడ్డగాగాని రూపొందిస్తుంది.'

ప్లీడరు ప్రకాశం చేసిన ఉద్యోగం ఏమిటి? ఉన్నది లేనిదిగా, లేనిది ఉన్నదిగా మార్చి, న్యాయ నిర్ణేతల కళ్ళల్లో కారం కొట్టి, రంగుల అద్దాలు తగిలించి, తెలుపును నలుపుగా మార్చేసి, వెన్నెలను చీకటి చేసేసి అమాయకులకు అరదండలు తగిలించడమేగా? దానివల్ల ప్రకాశంకు జరిగిన అన్యాయమేమిటి? ఏం లేదు. రెండేళ్ళలో రెండంతస్థుల భవంతి కట్టాడు. కట్టిన భవంతులలో కోట్లు కూడ బెట్టాడు. కోట్లతో కొట్టులు కట్టి, కొట్లలో వ్యాపారం చేసాడు. ఎలక్షన్ లలో నిలబడ్డాడు. నిలబడి నెగ్గాడు. నెగ్గి మునిసిపల్ ఛైర్మన్ అయ్యాడు. అయ్యి లక్ష విలువచేసే టౌను హాలు మూడు లక్షల్లో నే పూర్తి చేసాడు. శంకుస్థాపన చేయించిన ఓవరు బ్రిడ్జి కంట్రాక్టు గడువు మరో మూడేళ్ళకు పెంచాడు. ఎలిమెంటరీ స్కూలు ఎత్తేసి దాని స్థానే చేపల మార్కెట్టు పెట్టాడు. మా పట్టణాన్ని పెద్ద బిజినెస్ సెంటరు చేసాడు. ఇందులో తప్పేం లేదు! ఇదంతా దేశసేవ! ప్రజాసేవ, పేద ప్రజల సేవ!! సాంఘికసేవ, సామాజికసేవ!!! ఆ సేవే నేనూ చేస్తాను. పగలంతా కష్టపడే ప్రజలకు అలసట లేకుండా 'మందు'ను ప్రసాదిస్తాను. చాటుగా 'నాటు' తాగేవారికి నీటైన బాటిల్సు ఓపెన్‌గా యిస్తాను. అయినా బార్‌లో ఖాతాదార్లు ఊరిపెద్దలు. అందువల్ల బార్ మానేజరు ఉద్యోగం గౌరవమైన ఉద్యోగం అవుతుంది.

అదిగో ఇల్లు వచ్చేసింది. తలుపులు తీసే ఉన్నాయి. అన్నయ్య, అత్తిగ, చెల్లాయి హాల్లో సోఫాలో కూర్చొని ఉన్నారు. నాన్న

గారు కూడా ఇంట్లో ఉన్నట్టున్నారు. అదుగో అమ్మ కూడా ఉంది. నేను ఊహించినట్లుగా కాకుండా అంతా ఇంట్లోనే ఉన్నారు. ఇదే సమయం. సరిగ్గా ఇదే సమయం. చెప్పేస్తాను.తిడితే అంతా ఒకేసారి తిడతారు. ఏడిస్తే అంతా ఒకేసారి కోరస్‌లో ఏడుస్తారు. పొమ్మంటే ఇంట్లోంచి ఒకేసారి పొమ్మంటారు. ఒప్పుకుంటే అంతా ఒకేసారి ఒప్పుకుంటారు.

అవును! నాకూ సిగ్గు, అభిమానం, నీతి, నిజాయితీ, సహనం, ఓర్పు, వ్యక్తిత్వం అన్నీ ఉన్నాయి. నేనూ మనిషినే. నాకు కూడా గుండెనిండా కోరికలున్నాయి. అవి తీర్చుకునేందుకు ఆలోచనలున్నాయి. పథకాలున్నాయి. ప్రణాళికలున్నాయి. గ్రాడ్యుయేటునై ఎంతకాలం నాన్నగారికి భారమవుతాను? ఒకరి మోచేతి క్రింద పనిచేసి, వారి దయవల్ల పని నేర్చుకోటం నా కిష్టం లేదు. నా వ్యక్తిత్వాన్ని చంపుకుని బ్రతకలేను. స్వతంత్రంగా నా కాళ్ళ మీద నేను బ్రతకాలి. ఏదైనాసరే మానేజరుగా బార్‌లో చేరతాను. ఇంట్లో ఎవ్వరూ ఒప్పుకోకపోయినా, అంతా వ్యతిరేకించినా, ఏడ్చి మొత్తుకుని నన్ను మొత్తినా నే మెత్తబడేదిలేదు.

"ఏరా, ఎక్కడినుంచి రాక? ఆ గోపి గారి దగ్గర అప్రంటిస్‌గా చేరి ఆడిటింగు నేర్చుకోకూడదు? ... అన్నట్టు స్టేటు బ్యాంకులో ఏవో పోస్టులకు అప్లికేషన్సు ఇన్‌వైట్ చేసినట్టున్నారు. అప్లయి చెయ్యకూడదూ?" అన్నయ్య అడుగుతున్నాడు బ్యాంకు ఉద్యోగాల సంగతి తెల్సి, రికమెండేషన్ ఉంటేగాని అప్లికేషను ముఖం చూడరని ఎరిగీ, అట్టమీద అందం బట్టి పుస్తకం ధర కట్టే లోకపు తీరు తెలిసీ!

"లేదన్నయ్యా! నాకు మెరిట్ లేదు. అయినా బార్‌లో నాకు మేనేజరుపోష్టు యిచ్చారు. జాయిన్ అవుతాను." గోడ మీది పటాలను, పటాల్లోని భారతదేశ సమర యోధులను, వారితో ఆడుకునే పురుగుల్ని చూస్తూ అన్నాను.

"బార్‌లోనా? అంటే సారాయి బడ్డీలోనా??" తన దగ్గరున్న ఆశ్చర్యమంతా తన ప్రశ్నలలో గుమ్మరించి అన్నయ్య అడిగాడు.

"............"

"ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చావా?" నేను ఊహించినంత సినిమా సీను కోపంతో అడగలేదు అన్నయ్య.

"చాలాసేపు ఆలోచించే ఈ నిశ్చయానికి వచ్చాను." ఎలా గొచ్చిందో నా గొంతుకులోంచి జవాబు వచ్చింది.

"ఊఁ. నిర్ణయం చేసుకున్న తరువాత ఏముందిలే. ఒకరిదగ్గర పని నేర్చుకోటం నామోషీ అనుకున్నవాడికి, వ్యక్తిత్వానికై పాటుబడి సర్వస్వతంత్రుడు కావాలనుకున్నవాడికి సరియైన ఉద్యోగం

నా తప్పేమీ లేదు. మీరు తలవంచకుండా ఉంటే అద్దం బద్దలయ్యేదే కాదు మరి_




బార్ మేనేజరేమో! నాన్నగారు లోపలున్నారు. ఈ వార్త ఆయన చెవిలో కూడా వేస్తే బావుంటుంది.”

నాన్నగారు ఎప్పుడొచ్చి గుమ్మంలో నిల్చొన్నారో నాకు తెలియదుగాని నేను చెప్పకుండానే ఆయనకు ఈ విషయం తెల్సిందని ఆయన ముఖం చూడగానే తెల్సింది.

వెంటనే ఇంట్లోంచి వెళ్ళిపొమ్మంటారనుకున్నాను.

కాని అలా జరగలేదు.

“రామూ! నీకు గుర్తుందనుకుంటాను. ఏడాది క్రిందట మీ స్టూడెంట్స్ కొందరు కల్లు పాకలపై దాడిచేసి నాటు సారాయి వర్తకుల్ని కొందర్ని పట్టుకుని కేసు పెట్టించి, ఫైల్ చేయించి, ఫైను వేయించారు. ఆ రోజు దాడిలో నువ్వు ఒక విధంగా వారికి నాయకుడివి. నువ్వు ఏ నోటితో మద్యపానం మహాపాపం అని చెప్పావో అదే నోటితో నేడు ఒప్పని, అది విక్రయించటానికి సిద్ధపడ్డావు. నీది నీతులు చెప్పించుకునే వయసు కాదు, మరొకరికి నీతులు చెప్పాల్సిన వయస్సు. నీ అంతటి వాడివి నువ్వయ్యావు. ఆపై నీ ఇష్టం.”

నాన్నగారు ఇంత తేలిగ్గా తన అంగీ

శౌరం తెలుపుతారని నేను కలలోకూడా అనుకోలేదు. ఊహించలేదు!

మద్యపానం ఒకనాడు తప్పు. కాని ప్రభుత్వానికి ఆదాయం దానివల్ల పెరుగుతుంది కాబట్టి, నిషేధాన్ని రద్దు పరచారు. ఒకనాడు సముద్రయానం భారతీయ సంస్కృతి, ఆచారాలకు విరుద్ధం. నేడుఫారెన్ రిటరండ్సుకు అపరిమితమైన గౌరవం లభిస్తోంది. పదిహేనేళ్ళ క్రిందట బర్త్ కంట్రోలు నేరం. శిక్షకు అతీతమైన ఘోరమైన నేరం. హత్యతో సమానం. కాని ఈరోజు ప్రతి డాక్టరు చేసేపనే అది. జనాభా పరిమితికై రేడియోలో, పేపర్లలో, పత్రికలలో ప్రభుత్వం బర్త్ కంట్రోల్‌ను ప్రోత్సహించి విశేషప్రచారం చేస్తోంది. ఒకనాటి తప్పు కొంతకాలానికి ఒప్పుగా, మరి కొంతకాలానికి గొప్పగా పరిగణింప బడవచ్చు!

ఇంట్లో ఎవరికీ నా ఉద్యోగం నచ్చలేదని తెల్సీ పై విధంగా తలచి నా మనస్సును సమాధాన పరుచుకోగలిగాను.

* * *

"శాస్త్రిగారి రెండవ అబ్బాయి బార్‌లో మేనేజరు చేస్తున్నాట్ట. బి. కాం. పాసై బాటిల్స్ అమ్ముకుంటున్నాడు. వారిది మచ్చలేని వంశం. వేలెత్తి చూపించుకోని కుటుంబం. అందులో పొరపాటుగా పుట్టాడు. ఓ చీడపురుగు వల్ల వంశవృక్షం సర్వనాశనం అవుతోంది." నా ముఖాం ముందు మాటాడలేని లోకులు నాకు వినిపించేలా నా వెనకాల ధైర్యంగా నన్ను విమర్శించటం మొదలు పెట్టారు.

"కూటికోసం కోటి విద్యలు. మనిషి బట్టి వుద్యోగానికి గౌరవం రావాలిగాని, ఉద్యోగంబట్టి మనిషికి గౌరవం రాకూడదు. అలా జరిగిననాడు వ్యక్తిత్వానికి విలువేది? మారిన కాలంతోపాటు మనుషులు, మనస్తత్వాలు మారాలి" అని నన్ను మెచ్చుకునే వారు స్వల్ప సంఖ్యలో లేకపోలేదు.

కాని యింతకంటే విచిత్రమైన విషయం ఏమిటంటే నేను ఏదో క్షమించరాని నేరం చేసినట్టు, నేను చేసిన నేరానికి మా నాన్నగారు, అన్నయ్య శిక్ష అనుభవించి, పశ్చాత్తాపపడి కుమిలిపోతున్నట్టు కొందరు సానుభూతి ప్రకటించడం మొదలుపెట్టారు.

"మరే! ఈ మధ్యే తెలిసింది. పాపం మీవాడు బార్‌లో మేనేజర్ గా చేరాట్ట కదూ! ఆ మధ్య గోపిగారి దగ్గరకు పంపి ఆడిటింగ్ నేర్పిస్తానన్నారుగా? అయినా ఈ కాలం కుర్రాళ్ళు అదుపు ఆజ్ఞలలో వుంటారా? మనం చెప్పినట్టు వింటారా!"

మరికొందరు, "మీ వాడు మీ ఇంట్లోనే వుంటున్నాడా? లేక వేరే— అహాఁ సంగతి తెలుసుకుందామని... అయినా మీ కిష్టంలేని పని చేస్తాడా మీ వాడు! ఎటువంటి వంశం మీది.

తండ్రిమాట జవదాటని వంశం కదూ!"
అనటం.

ఇలా రకరకాలుగా చిలవలు పలవలుగా నా గురించి పదిమంది పది రకాలుగా అనుకోవటం మొదలు పెట్టారు.

కళ్ళు లేని సంఘాన్ని, నిజాన్ని చూడలేక చెవులతో విని నాలుకతో నాలుగు రకాలుగా పేలే లోకుల్ని, పరిస్థితి అర్థం చేసుకోలేని బంధువుల్ని లక్ష్యపెట్టేవారు జీవిత పథంలో ముందుకు సాగలేరు.

ఐతే బయట పరిస్థితికంటే యింట్లో పరిస్థితి సహించలేనిదిగా తయారైంది. నేను బార్‌లో ఉద్యోగం చెయ్యటం ఎవరికీ యిష్టంలేదు. కాని వేన్నీళ్ళకు తోడయిన చన్నీళ్ళని కాదని నన్ను పోషించే ఓపిక ఎవరికీలేదు. పోషింపబడటం నా కిష్టంలేదు. నిజం ఆలోచిస్తే నా సంపాదనే వేన్నీళ్ళు.

ఈ పేరడాక్సు వల్ల ఏర్పడిన విచిత్ర పరిస్థితి నాపై మానసికంగా పనిచేసింది.

ఉద్యోగం, సద్యోగం లేని రోజుల్లో రాత్రి తొమ్మిది గంటలవరకూ మిత్రులతో బాతాఖానీకొట్టి యింటికి చేరినా నా గుంచి మేలుకొని దగ్గర కూచొని ఆప్యాయతతో వడ్డించి కొసరికొసరి తినిపించే అమ్మ ఈనాడు, అన్ని అమర్చి మూతలుపెట్టి వంటిల్లు తాళంవేసి, తాళం నా గదిలో పెడుతోంది.

రాబోయే తన రెండవ అత్తగ అందచందాలు, గుణగణాలు వర్ణించి, పొగిడి నన్ను నవ్వించి అనుక్షణం అంటిపెట్టుకొని తిరిగే చెల్లి నన్ను తప్పుకు తిరుగుతోంది. ప్రతి సాయంత్రం ఊరి చివర కాలవ ఒడ్డుకు షికారు వెళ్ళినప్పుడు పారే సెలయేరులా గలగలా మాట్లాడేది. కాని ఈనాడు నేను సంభాషిస్తే నేరంగా భావిస్తోంది.

తల్లిని మించిన అప్యాయత, అనురాగం కురిపించి, నన్ను అనుక్షణం కన్నబిడ్డలా చూసుకునే అత్తగ ముభావంగా అంటీ అంటనట్టు, నా నీడ సోకితే పాపమన్నట్టు మసులుతోంది.

పది రోజుల క్రిందట యాత్రలకు వెళ్ళిన నాన్నగారు తన ఉత్తరంలో పేరు పేరునా, మనిషి మనిషిని పలకరించి నన్ను పరిహరించటం నే నంత పట్టించుకోలేని విషయం ఎంత ప్రయత్నించినా కాలేకపోయింది.

నా రెండో నెల జీతంలో యింట్లో అందరికీ బట్టలు కొన్నాను. చెల్లెలకు గులాబిరంగు చీర కొన్నాను. ఆ చీరకు నల్లని గుర్రాలు వరుస బార్డరు. ఆ రోజు అన్నయ్యమాటలు నా గుండెల్లో నిద్రపోయిన అసమాన అగ్నిపర్వతాల్ని తట్టి లేపి పిండిగాకొట్టి, మాడి మసయ్యేలా నా హృదయాన్ని తాకాయి. భౌతికంగా మనిషికి చావు ఒకసారే. కాని మానసికంగా మనిషిని ఎన్నోసార్లు చంపి, బ్రతికించి, అరుణరుధిరం వెల్లువలై ప్రవ

హించేలా నిలువునా ఖూనీచేయగల శక్తి ఒక్క-మాటలకే ఉందేమో!

ఎక్కడ చూసినా మౌనం. భరించలేని నిశ్శబ్దం. మూగతనం. ముభావం. ఒంటరితనం!

గుండెల్లో శార్దూల విక్రీడితం!!

మెంటల్ టార్చర్!!!

ఎందువల్ల?

ఎవరికీ ఇష్టంలేని ఉద్యోగం, అందరినీ కాదని చేస్తున్నందువల్ల!

నేను లోకానికి జడవటంలేదు. సంఘం కూసే పనికిమాలిన కూతలకు విలువనివ్వటంలేదు. గాంధీగారిపై ప్రగాఢమైన భక్తి, గౌరవం, ఆయన సిద్ధాంతాలపై నిండైన నమ్మకం గురినాకు లేవు. బార్‌లో ఉద్యోగం చెయ్యటం నేరంకాదని నేను యిప్పటికీ వాదిస్తాను. అది తప్పుకాదనే నా వ్యక్తిగత అభిప్రాయాన్ని నేను మార్చుకోలేను. మద్యపాన నిషేధం రద్దు దేశగౌరవానికి గొడ్డలిపెట్టు అని ఉపన్యాసం యివ్వను. ఒకే యింట్లో రెండు కుంపట్లు పెట్టే దేశం ఏమైనా నేనంత పట్టించుకోను! కాని నాకు కావలసింది ఆప్యాయత, అనురాగం, అభిమానం, మమత, ప్రేమ, మానవునికి యిచ్చే కనీసపు గౌరవం.

అవి మనిషి మనుగడకు ముఖ్యమైనవి.

అవి లోపించిన జీవితం ఎడారిలో ఎఱ్ఱగులాబి లాంటిది.

నాకు కావలసింది డబ్బు మాత్రమే కాదు.

అమ్మ ఆప్యాయత, అన్నయ్య అనురాగం, చెల్లెలు అభిమానం, అత్తిగ సహకారం, నాన్నగారి ఆశీర్వాదం నాకు కావాలి. నా వాళ్ళు నన్ను నోరారా పలకరించాలి. నన్ను వాళ్ళల్లో ఒకడిగా చూసుకోవాలి.

వెలివేసి లోకంకోసం తమతోనే కలగలుపుగా బ్రతుకుతున్నట్టు నటించమని శిక్షించన నేరంకు ప్రాయశ్చిత్తం కావాలి. వెలివేయబడి నా చుట్టూ నిర్మింపబడ్డ మూగ చెరనుండి నేను విడుదల అవ్వాలి.

సర్పబంధంలా ఉన్న ఈ మౌనం నుంచి విముక్తుడ్నవ్వాలి.

నా చుట్టూ పరిధి గీసి తయారు చేసిన ముభావవలయం నుండి నాకు మోక్షం లభించాలి.

అందుకే నెలనెలా మూడొందలు ఆర్జించిపెట్టే బార్ మేనేజరు పోస్టుకు రాజీనామా ఇచ్చి నెలకు నూటయాభై ఇచ్చే గోపిగారి దగ్గర అప్రంటిస్‌గా చేరాను.

ఐతే యిలా చేయటంవల్ల ఏ వ్యక్తిత్వాన్ని నేను నిలబెట్టుకోవాలని బార్‌లో చేరానో అదే వ్యక్తిత్వాన్ని అప్రంటిస్‌గా చేరి కుదువబెట్టానని నాకు తెలుసు.

ఇది అర్థంలేని త్యాగమే అవ్వచ్చు.

అయినా ఇందులో తృప్తి ఉంది.

మానసికంగా అనంతమైన ఆనందం ఉంది. *




ఆ సంవత్సరమే ఎమ్మెస్సీ పాసై ఫలితాలు తెలిసిన తరువాత రెండు నెలలకు ఉద్యోగంలో చేరేను. స్త్రీల కళాశాలలో లెక్చరర్‌గా అప్పాయింట్ అయినానని విని ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యేను కాసేపు. అసలే విద్యార్థినిగా ఉండే రోజుల్లో చాలా కష్టపడి చదివి, మంచి మార్కులు తెచ్చుకుని, ఉపాధ్యాయుల మెప్పు కోసం ప్రాకులాడే మనస్తత్వంగల దాన్నవడం వల్ల

యింకా అప్పటికి నాలో "స్టూడెంట్ మెంటాలిటీ" పోలేదు. అందువల్ల కాలేజీలో చేరిన మొదటిరోజున జాయినింగ్ రిపోర్టివ్వటానికి ప్రిన్సిపాల్ రూములోకి అడుగు పెడ్తూనే నా కాళ్లు గజగజ వణికినయ్. కుర్చీకి నిండుగా, కొద్ది క్షణాలలో లేడి పిల్లపై లంఘించబోయే ఆడపులి భంగిమలో కూర్చున్న ప్రిన్సిపాల్ — మిసెస్ చూడామణీ అయ్యంగార్‌ని చూస్తూనే హడలిపోయేను. ఎలాగో ధైర్యం తెచ్చుకుని, అతి ప్రయత్నంమీద మాటలను కూడదీసుకుంటూ నన్ను నేను పరిచయం చేసుకున్నాను.

ఆవిడ నా పేరు వింటూనే ముప్పై రెండు పళ్లూ బయటపడేలా ముఖం రెట్టింపు వెడల్పు సాగేలా నవ్వుతూ, చెయ్యి చాచి కూర్చోమంది కుర్చీ చూపిస్తూ.

"ఫరవాలేదు. ఈ ప్రిన్సిపాలు చూట్టానికి భయంకరంగా ఉన్నా మనిషి మంచిదిలానే ఉంది. బాబాయి పనిచేసే కాలేజీ ప్రిన్సిపాలైతే లెక్చరర్లెవరికీ సీట్ ఆఫర్ చెయ్యడట. ఎంతసేపు ఆయనతో మాట్లాడవలసి వచ్చినా వాళ్ళకు నిలువు కాళ్ళ జెరమే గతిట. ఎంతైనా యీవిడ స్త్రీ కదా. అందునా వెన్నలాంటి గుండెకు పువ్వులాటి మనసుకి ప్రసిద్ధిగాంచిన భారత స్త్రీ అయ్యె—"అలా ఆ రెండు క్షణాల్లోనే ఆవిడను గూర్చి సదభిప్రాయాన్ని ఏర్పరచుకుంటానికి ప్రయత్నిస్తూ కూర్చున్నాను నేను.

నా అప్పాయింట్‌మెంట్ ఆర్డర్సు ఆవిడ చేతి కిచ్చేను.

ఆవిడ కళ్ళజోడు తీసి, టేబులుమీద పెట్టి, కళ్లు రెండూ చికిలించి కాగితాన్ని ముఖానికి దగ్గరగా పెట్టుకుని చదువుతుంటే, మళ్ళీ నా బుర్ర చురుకుగా పని చెయ్య సాగింది. "ఈవిడ అసలు కళ్ళజోడు ఎందుకు పెట్టుకున్నట్టు? నాకున్న ఫిజిక్సు పరిజ్ఞానాన్నిబట్టి, హ్రస్వ దృష్టి గలవారూ, వయసు మళ్ళి చత్వారం వచ్చిన మనుషులూ కళ్ళజోడు పెట్టుకుంటారనీ, దానివల్ల వారికి సరియైన దృష్టి లభిస్తుందనీ నా అభిప్రాయం. ఈవిడ వయసు చూస్తే ఏభై దగ్గరలో పడుతున్నట్లుగా ఉంది. అంటే అది తప్పకుండా చత్వారం జోడే అయి వుంటుంది. ఐతే యీవిడ దృష్టి లోపం గల వారందరి పాలిట కల్పతరువులా కనిపెట్టబడిన యీ జోడును తగిలించుకోకుండా, పైగా ఉన్నజోడును కూడా తీసివేయటంలోని అంతరార్థ మేమిటి? ఈవిడ కళ్ళ జబ్బు మరో కొత్త జాతికి సంబంధించినది కాదు కదా?" అలా సాగిపోతున్నాయ్ నా ఆలోచనలు.

ఆర్డర్సు చదవటం పూర్తి చేసి, "అన్నట్టు మీ పేరేమిటి? మిస్ రాధ కదూ? మీరు ఆఫీసులోకి వెళ్ళి, జాయి

నింగ్ రిపోర్టుతో పాటు అవసరమైన సర్టిఫికేట్లను కూడా సబ్మిట్ చెయ్యండి,''అని కంచు కంఠంతో ఇంగ్లీషులో అని, తిరిగి మరో ఫైల్లోకి తల దూర్చింది మిసెస్ చూడామణీ అయ్యంగార్.

''అంటే అర్థం, 'ఇక వెళ్లిపోవచ్చు' నని అన్నమాట!'' అని స్వగతంలో అనుకుని, లేచి, ఆవిడ నా వంక చూడక పోయినా, ఆవిడ వైపుకు ఒక నమస్కారం విసిరేసి బయటపడ్డాను.

నేను ఉద్యోగంలోకి చేరబోయే ముందు అధికారవర్గ మనస్తత్వాన్ని గూర్చి, వారి యెడల చూపవలసిన ప్రవర్తనను గూర్చి విపులీకరిస్తూ ఓ చిన్న ఉపన్యాసం యిచ్చేడు బాబాయి. పై అధికారికెప్పుడూ తన క్రింది ఉద్యోగస్తులు ఒదిగొదిగి నమస్కారాలు చెయ్యాలన్న కోరిక గాఢంగా ఉంటుందనీ, కాని ఆ కోరికను బహిరంగంగా వెల్లడించటానికి సభ్యతా, సంస్కారం అడ్డు వస్తాయి కనుక, వారి వినయ విధేయతలను గూర్చి పట్టించుకోనట్లే నటిస్తారనీ, ఐతే మరో వంక వీరు తమని గౌరవిస్తున్నారా,లేదా అని ఓరకంట కనిపెడుతూనే ఉంటారనీ, కాబట్టి ముందు చూపున్న ఉద్యోగస్తులందరూ పై అధికారి మెప్పును పొందటానికి శాయశక్తులా ప్రయత్నిస్తుండాలనీ బాబాయి చెప్పిన విషయాల్లో ముఖ్యమైనవి.

అందువల్ల, ఆవిడ నా వంక చూడక పోయినా, ముఖంపు చెల్లించుకున్నట్టు నమస్కారం చేసి యివతలకు వచ్చేసేను.

ఆఫీసులో పని అయిపోక ప్యూన్ సహాయంతో స్టాఫ్ రూముకు వెళ్లేను.

రూములోకి వెళ్తూనే ఒకమూలగా కుర్చీలో కూర్చున్నాను నేను బిడియంగా. నిన్న మొన్నటిదాకా విద్యార్థినిగా ఉండి ఇప్పుడు వాళ్ళందరి ముందూ వారితో సమానమైన హోదాలో కూర్చుంటానికి సిగ్గనిపించింది నాకు.

కాని వెంటనే, ''పుట్టగానే యెవరైనా ఉద్యోగస్తులౌతారా? వీళ్లు కూడా ఒకప్పుడు నాలా విద్యార్థినులుగా ఉన్న వారే కదా! ఇప్పుడంటే డాబుగా తిరుగుతున్నారు కాని, వీళ్లు కూడా ఉద్యోగంలో చేరిన మొదటి రోజున నాలానే ఫీలై ఉండివుంటార్లే!'' అని నాకు నేను సమాధానం చెప్పుకుని, కొంచెం ఠీవిగా కూర్చోవటానికి ప్రయత్నించేను.

ఐతే నాకు ఇబ్బంది కల్గించిన మరో విషయమేమంటే, నాకు 'పర్సనాలిటీ' లేదు. సన్నగా, పొట్టిగా ఉన్న నేను, యించుమించు ఐదడుల నాల్గంగుళాల పైన ఎత్తులో ఉన్న వాళ్ళందరి ముందూ నిల్చుంటే ఎంతో చిన్నగా కనిపిస్తాను. తోటి ఉద్యోగస్తుల ముందు, కనీసం ఆకారంలోనైనా, చిన్నగా కనపడటం నాకు ఏమాత్రం రుచించ లేదు.

వాళ్లందరూ నా వంక ఓర చూపులు

విసుర్తూ, అటూ యిటూ తిరుగుతూనే నన్ను నఖశిఖ పర్యంతం తీక్ష్ణంగా పరీక్ష చేసేరు. "ఎవరో కొత్త కొత్తీలా వుందే!" అన్న భావం వారందరి ముఖాల్లోనూ స్పష్టంగానే కనిపించింది నాకు.

వాళ్ళ నెలా పలకరించాలా అని ఆలోచిస్తుండగానే ఒకామె నా దగ్గరకు వచ్చి, "మీది యే డిపార్టుమెంటు?" అనడిగింది. చెప్పేను. తరువాత నేను ఎమ్మెస్సీ ఏ యూనివర్శిటీ నుండి చేసిందీ, ఎక్కడుండేదీ, మొదలైన వివరాలన్నీ అడిగి తెలుసుకుంది. ఆవిడ పేరు శకుంతలట. ఆమె కూడా నాలాగే ఫిజిక్స్ లెక్చరర్. మిగతా వాళ్ళందరితో పోల్చి చూస్తే శకుంతల వేషధారణలో, మాటతీరులో నిరాడంబరంగా వుంది. పైన ఆవిడ మాటలలో, ప్రవర్తనలో కృత్రిమత్వం కన్న ఎక్కువగా స్నేహభావం నిష్కాపట్యం కనిపించినయ్. ఆవిడకు యిద్దరు ఆడపిల్లలుట. వయసు షుమారు ముప్పై వుంటుంది.

మే మిద్దరం మాట్లాడుతుండగానే ఉన్నట్టుండి అక్కడున్న వారందరిలోనూ గొప్ప కలకలం బయల్దేరింది.

"ఓ!"

"హల్లో!"

"యూ—ఫాతిమా!"

"ఆఫ్టర్ సోలాంగ్!"

"హౌ డి యూ డూ?"

మొదలైన స్వాగత వాక్యాలు వింటూనే అవి వుద్దేశింపబడిన వ్యక్తి వైపుకు చూసేను నేను.

ఆమె మిస్ ఫాతిమా బేగమ్—ఫిజికల్ డైరెక్టర్‌గా పని చేస్తోందిట— శకుంతల చెప్పింది నాకు.

ఫాతిమా అసలు ఎత్తు ఐదడుగుల ఆరంగుళాల వరకు వుంటుంది. ఆవిడ హేర్ స్టయిల్‌తో కూడా కలిపి, షుమారు ఆరడుగుల ఎత్తులో కనపడుతోంది. ఆమె అలంకరించుకున్న పద్ధతిని ఆపాదమస్తకం పరీక్షించాలంటే ఎవరికైనా కనీసం అరగంట టైం పడుతుంది. ఐతే ఆవిడ అంత శ్రద్ధగా, ఓపికగా అలంకరించుకుంటానికి యింటి దగ్గర ఎన్ని గంటల సమయాన్ని వినియోగించి వుంటుందో అంచనా వేస్తున్నాను నేను.

ఫాతిమా గదిలోకి అడుగుపెట్టగానే, ఏ ఒకరిద్దరో తప్ప, అంతా కుర్చీల్లో నుండి లేచి పరిగెత్తారు ఆమె వైపుకు.

ఒకామె ఫాతిమా బుజాలు సున్నితంగా తాకింది.

మరొకామె ఆమె చీరకొంగును చేతిలోకి తీసుకుంది.

ఇంకొకామె ఫాతిమా ఎడమ చేతిని పట్టుకుని, దాని అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్న వాచీనీ, దాని స్ట్రాప్ స్థానంలో ఉన్న బంగారు కడియాన్నీ మృదువుగా స్పృశించసాగింది.

ఒకామె ఆవిడ చీర కుచ్చిళ్ళను చను




వుగా సర్దుతున్నట్లు ముట్టుకుంది.

ఫాతిమా రాకకు తమ సంతోషాన్ని వివిధ రకాలుగా వెల్లడించుకున్నా రంతాను.

"ఎన్నాళ్ళయింది నిన్ను చూసి!"

"కొంచెం నల్లపడ్డావు...యీ పది రోజుల్లోనే!"

"అరె! హేర్ పిన్ను ఊడిపోతోంది యీ పక్క" తలలోని పిన్నును ప్రేమగా సర్దింది ఒకామె.

"ఈ చీర బొంబేలోనే కొన్నావా?"

"ఎంత చార్మింగ్ గా ఉందో దీని కలరు!"

"నువ్వెప్పుడూ నీ రంగులో కలిసి పోయే చీరలనే సెలెక్ట్ చేసుకుంటావు!"

"ఓ! స్లిప్పర్సు కూడా కొత్తవేనే!"

"అబ్బ! ఎంత బాగున్నాయో! దీని ఖరీ దెంత?"

"అన్నట్లు బొంబే కబుర్లేమిటో చెప్పనేలేదు."

ఇలా ఆవిడను తమ ఆదరాభిమానాలతో ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే ఫాతిమా అందంగా, సుతారంగా నవ్వుతూ, మరింత ఠీవిగా, దర్పంగా నిల్చుని సమాధాన మివ్వసాగింది.

పది నిమిషాలపాటు అలాగే, బెల్లం

చుట్టూ మూగిన యీగల్లా, ఆమెను పట్టుకుని వేళ్ళాడిన వాళ్ళంతా, ఆమె "ఇంక వస్తాను. పనుంది," అంటూ వెళ్ళిపోగానే తిరిగి తమ స్థానాల్లోకి వచ్చి కూర్చున్నారు.

ఒక్క నిమిషంపాటు అసహజమైన నిశ్శబ్దం అలముకొంది ఆ గదిలో.

ఉన్నట్టుండి కిచకిచ మంటూ నవ్వింది ఒకామె.

ఆమె నవ్వుతో తమకి కూడా నవ్వటానికి ధైర్యం వచ్చినట్లు మరో నలుగురైదుగురు కూడా పకపక నవ్వేసేరు.

"చూసేవా, నళినీ! ఆ ఫాతిమా చూడు. దాని వేషం అదీనూ!'!' అతిగా నవ్వలేక పొట్ట చేత్తో పట్టుకుంటూ అంది ఒకామె.

"అచ్చు స్టేజి మీదకు వెళ్ళబోయే నాటురకం నాటకాల హీరోయిన్‌లా ఉంది!"

ఆ కామెంట్‌కి అందరూ ఆ గది గోడలు దద్దరిల్లేలా నవ్వేరు.

"ఇంక బాంబే కూడా పోయొచ్చింది కదా. రేపట్నుండి రోజుకో వేషం వేస్తుంది, చూడు."

"ఇప్పుడు వెయ్యకపోతేనా?"

"దాని బోయ్ ఫ్రెండ్—రాబర్ట్ ఏమయ్యాడో! ఈ మధ్య కనపట్టం లేదూ!"

"మరో జేమ్స్ బాండ్ దొరికి ఉంటాడు."

"ఛ! అదేమిటి? రాబర్టూ, తనూ పెళ్ళి చేసుకోబోతున్నామని చెప్పిందిటగా మిసెస్ వైదేహితో!"

"అంతకు ముందోసారి అమీర్‌ని గాఢంగా ప్రేమిస్తున్నానని కూడా చెప్పింది."

"ఐనా మన కెందుకులే అలాటి విషయాలన్నీ? అలాటివాళ్ళ బ్రతుకులు అలాగే తెల్లవారుతయ్!"

ఇంతలో బెల్లయేసరికి చాలామంది క్లాసులకి వెళ్ళటం, అంతకు క్రితం పిరియడ్ క్లాసు తీసుకుంటానికి వెళ్ళినవాళ్లు తిరిగిరావటం జరిగింది. ఆ సందడిలో ఫాతిమా సంగతి వెంటనే మర్చిపోయేరందరూ.

నా కళ్ళముందు ఫాతిమా అనబడే ఆవిడ రొడల వారు చూపిన ఆదరాభిమానాలనూ, ఆమె వెనుక ఆవిడను గూర్చి వదిలిన పూటు విమర్శలనూ—యీ రెంటినీ సమన్వయించుకోలేక దిమ్మతిరిగిపోయేను నేను.

శకుంతల నా కళ్ళలోకి చూస్తూ చిన్నగా నవ్వింది, "భయపడకు. అదంతే!" అన్నట్టు.

క్రమంగా మరో పదిరోజులు గడచేసరికి నాకు కొంచెం బెరుకు తగ్గింది. కాలేజీ వాతావరణాన్ని కొంతవరకు స్థూలంగా అర్థం చేసుకున్నాను. శకుంతల ఆ పదిరోజులలోనే నాకు చాలా సన్నిహితురాలయింది. దానికి చాలావరకు

శకుంతల స్వభావమే కారణం. అదీ కాక మే మిద్దరం కూడా ఒకే డిపార్టుమెంటు వాళ్ళం కనుక ఎప్పుడూ కలసే ఉండే వాళ్ళం. శకుంతల చాలా కలుపుగోలు మనిషి. ముఖ్యంగా నాలాటి బిడియస్తు లను మాటల్లోకి దించి, మంచి చేసుకో కల నేర్పు ఆవిడలో బాగా వుంది. ఆవిడతో స్నేహం చేసిన వాళ్ళెవరూ ఆవిడను ప్రేమించకుండా వుండలేరు.

ఐతే శకుంతలలో నాకు నచ్చని గుణాలు రెండు కనిపించినయ్.

ఒకటి—ఆవిడ అస్తమానం తన ఇంటి గొడవలే చెప్తుండేది. తన భర్తకి ఏ కూర యిష్టమైనదీ, ఏ రకం సినిమాలు చూసేదీ, పిల్లలెలా అల్లరి చేసేదీ, తా మిద్దరూ బయటకు వెళ్ళేక ఆయా పిల్లల్ని ఎలా కష్టపెట్టేదీ, వాళ్ళ కోసం యిచ్చిన పాలూ, బిస్కట్లూ అది ఎలా మింగేసేదీ వివరాలన్నీ చెప్పుకొచ్చేది. మొదట్లో సానుభూతిగా విన్నా, రాను రానూ ఆవిడ ధోరణికి నాకు భోర్ కొట్ట సాగింది.

తన పిల్లల ముద్దు ముచ్చట్లు, శ్రీవారి అభిరుచులూ తనకి కలిగించినంత ఆనం దాన్నీ, ఆసక్తినీ యితరలకు కలగనీవనీ, తన పిల్లలకు వచ్చే జబ్బులు, ఆయా వల్ల వాళ్ళు పడే కష్టాలూ తనకి కలిగించినంత బాధ యితరులకు కలగనీవనీ ఆవిడ గ్రహిస్తే బాగుండు ననుకునే దానిని. ఐనా ఆవిడమీద వున్న గౌరవం కొద్దీ, 'యిష్టం లేకపోయినా, ఆవిడ చెప్పే విషయాలన్నీ ఎంతో ఆసక్తిగా వింటు న్నట్టు నటించే దానిని.

ఇక, ఆవిడలో నాకు నచ్చని రెండవ విషయ మేమంటే, ఆవిడ పెద్దగా ఆవ లించేది. మాట్లాడుతూ మాట్లాడుతూనే నోరంతా తెరిచి బిగ్గరగా ఆవలించేది శకుం తల. పైగా ఆవలింతపూర్తి కాకుండానే మధ్యలో మాట్లాడటానికి ప్రయత్నిస్తుం డేది. అలాటప్పుడు ఆవిడ నోటినుండి వెలువడే విచిత్ర ధ్వనులూ, నీటి తుంప రలూ నాకు చికాకు కలిగించేవి. అసలే నాకు ఆవలింతలంటే వళ్ళు మంట. బుద్ధి హీనులనూ, బద్ధకస్తులనూ మాత్రమే ఆవ లింతలు ఆశ్రయిస్తాయని చిన్నతనంనుండీ నా దృఢ విశ్వాసం. మెదడు మొద్దుబారి పోయిన వాళ్ళు బద్ధకస్తులుగా తయా రవుతారనీ, అలాటివాళ్ళే తరచు ఆవ లిస్తుంటారనీ అనుకునే దానిని.

ఐతే శకుంతలే కాదు ఆ కాలేజీలో యించుమించు అందరూ వుదయం పది గంటలనుండి సాయంత్రం మూడున్నర గంటలవరకూ ఏ ఒకటి రెండుగంటలో క్లాసులు తీసుకునేవారు. మిగతా సమయ మంతా కాళ్ళు బార జాపుకుని కూర్చుని కబుర్లాడుకుంటూ, ఆవలించు కుంటూ, కునికి పాట్లు పడుతూ గడిపే వారు.

నన్ను ఏ కారణం వల్లగానీ ఆకర్షిం చిన వ్యక్తులు కొందరున్నారు ఆ కాలేజీలో.

అందులో ఒకామె పేరు పార్వతి. పార్వతి నల్లగా వుండేది. మంచి వడ్డూ పొడుగూ వున్న మనిషి. ఆవిడలో అద్భుతమైన ఆకర్షణ యేదో వుంది. నలుపులో కూడా అందం వుంటుందని నాకు మొదట తెలిసింది ఆవిడ్ననుచూసిన తరువాతనే! ఆవిడ ఎప్పుడు చూసినా గల గల నవ్వుతూ, అనర్గళంగా మాట్లాడు తూనే వుంటుంది. నిశ్శబ్దంగా, మౌనంగా ఆవిడ కూర్చోగా నేను ఆ కాలేజీలో పనిచేసిన తొమ్మిది నెలల్లోనూ ఒక్క సారన్నా చూడలేదు. ఆవిడ భర్త పైలట్ ఆఫీసరట. ఏడాది క్రితమే ఆవిడకు వివాహమయింది.

రెండవది సరళ. ఆమె ఏదో మంత్రి గారికి మరదలుట. ఆమె బోటనీ డిపార్టు మెంటుకు అధికారిణి. ఎప్పుడూ పట్టు చీరలలో, రోజు కో కొత్త రకం నగ పెట్టుకుని కాలేజీకి వచ్చేది. సంఘంలో డబ్బువల్ల కానీ, హోదావల్లగానీ, మరే యితర కారణాలవల్లగానీ పలుకుబడి వున్న వ్యక్తులతోనే ఆవిడ స్నేహం చేసేది. మిగతా వాళ్ళందరినీ పురుగుల్లా నిర్లక్ష్యంగా చూసేది.

ఓసారి ఆవిడ యింట్లో ఏదో పెద్ద పార్టీ జరిగింది. అందర్నీ పిలుస్తూ నా కూడా ఆహ్వాన పత్రిక యిచ్చింది సరళ. ఆవిడతో నేను మాట్లాడటం అదే మొదటిసారి. కార్డు తీసుకుని థాంక్స్ చెప్పి, ఏదో ఒకటి మాట్లాడాలి కదా అని "మీ రుండేది ఎక్కడ?" అని ప్రశ్నించేను.

"బంజారా హిల్స్" అన్నది సరళ.

"నే నెప్పుడూ అటువైపుకు రాలేదు. నాకు తోవ తెలియదు" అన్నాను.

"ఐతే నేను చెప్తానుండండి. మీ రుండేది చిక్కడపల్లి అన్నారు కదూ? సపోజ్ మీ కారు డ్రైవర్ని—"

"సారీ, మాకు కారు లేదండీ!"

"వ్వాట్? మీకు కారు లేదూ?" షాక్ తిన్నట్లు ఒకడుగు వెనక్కి వేసింది సరళ. ఆ క్షణంలో ఆమె ముఖంలో నిల్చిన భావముద్రను ఎన్నటికీ మర్చి పోలేను నేను. బహుశా సిద్ధార్థుడు మొదటిసారిగా కుష్ఠురోగిని చూసినపుడు కూడా ఆయన ముఖం అంత సాను భూతితో, కరుణతో నిండివుండదు.

సరళ నాతో మాట్లాడిన మొదటి సారీ, ఆఖరిసారీ కూడా అదే!

ఐతే అంతటి సరళకి కూడా అవ మానం పొందవలసిన సమయా లుంటా యని మరో రెండు నెలలు గడచేక తెలి సింది నాకు.

ఒకరోజు మధ్యాహ్నం మొదటి పిరి యడ్ సమయంలో ఐదారుగురం తప్ప మిగతా వాళ్ళంతా క్లాసుకు వెళ్ళేరు. వున్నట్టుండి చివ్వున స్టాఫ్‌రూమ్‌లోకి దూసుకు వచ్చింది సరళ.

ఆమె వచ్చిన అలికిడికి అందరం ఉలిక్కి పడి తలెత్తేం.




సరళ ముఖం కందగడ్డ లాగయిపోయి వుంది. ఆమె కళ్ళు ఎరుపెక్కివున్నాయ్. ఆ ఎఱుపుదనంలో క్రోధావేశం, దుఃఖం రెండూ మిళితమైవున్నాయ్.

వస్తూనే దభీల్న కుర్చీలో కూలబడింది.

“ఏమిటి సరళా? ఏమయింది? అలా వున్నావేం?” ఆత్రంగా అడిగేరందరూ.

వారి పరామర్శతో క్రోధం ఒకడుగు వెనక్కివేసి, దుఃఖాన్ని ముందుకు తరిమింది, ఆమె కళ్ళలోకి.

“చూడు, సుమిత్రా! అది-దాని కెంత పొగరో!” ఉబికివస్తున్న కళ్ళనీళ్ళను వెనక్కి నెట్టివెయ్యటానికి వ్యర్థప్రయత్నం చేస్తూ అన్నది సరళ.

“ఎవరది? ఏమన్నారు?” ఏక కంఠంతో అడిగేరు, ఎన్నడూ చూడని సరళ కళ్ళ నీళ్ళను చూసి, ఆశ్చర్యపోయిన వాళ్ళంతాను.

“ఇంకెవరు? ఆ మహాంకాళే!” రుమాలుతో ముక్కు తుడుచుకుంది సరళ.

“ఎవరు! ప్రిన్సిపాలా? ఏమన్నదేమిటి?” ఈసారి వారి కంఠాల్లో మరింత ఉత్సాహం కుతూహలం ధ్వనించినయ్.

“నేనుట అసలు హెడ్డుగా వుండటానికి పనికిరానట. నాకు డ్రాఫ్ట్ వ్రాయటం రాదట. డిపార్టుమెంటును కంట్రోల్ చెయ్యటమే తెలియదట నాకు. ఊరికే అరుస్తానుకాని, ఎవ్వరూ, ఆఖరికి

వాళ్లు కూడా; నన్ను లెక్క చెయ్య రట—యివన్నీ ఆవిడ కబురు చెప్పేరో!" జలజల మంటూ కన్నీరు కార్చేసింది సరళ, యింక నిగ్రహించుకునే శక్తి లేక.

ఒక్క నిమిషం నిశ్శబ్దంగా వుండి పోయే రందరూ—ఆమె ముఖంలోకే చూస్తూ, ఆమె ఏడిచే తీరును పరికిస్తూ.

ఆమె ఏడవటం అయినాక ఒకామె, "ఊరుకో, ఏడవకు. ఆవిడ స్వభావం మనకి తెలియదు గనకనా!" అంది.

ఇంకొకామె, "మొన్నకి మొన్న నేను ఐదు నిమిషాలు ఆలస్యంగా వచ్చే నని నిలబెట్టి ఎన్ని మాటలన్నదో! ఛ! ఆవిడకు బొత్తిగా మేనర్సు తెలియవు," అన్నది.

"ముసల్దయి పోయింది గదా! అస్తమానం ఎవర్నో ఒకరిని ఏదో ఒకటి అనందే నిద్రపట్టదట్టుంది ఆవిడకు. ఇంట్లో కోడల్ని ఎంత రాచి రంపాన పెడ్తుందో!" ఆ అన్నావిడకు కొత్తగా పెళ్ళయింది.

"ఈ ప్రపంచంలో తనొక్కతే ప్రిన్సిపాలుననీ తన హోదాని మించి మరేదీ ఉండదనీ, తన క్రింద పని చేసే వాళ్ళంతా అసలు మనుషులే కాదనీ ఆవిడ ఉద్దేశ్యం!"

"బోడి హోదానూ, అదీ! అంత ముసలి డొక్కయినాక ఆవిడేం ఖర్మ, ఎవరైనా అవుతారు ప్రిన్సిపాలు. అది కూడా ఒక గొప్పేనేమిటి? సీనియారిటీ ఉంటే ఎవడైనా పైకి పోతాడు. మన కంటె పదేళ్ళు ముందు పుట్టినంత మాత్రాన అది కూడా తన ప్రత్యేకతే అనుకుంటే ఎలా?" అన్నదొకామె.

ఆవిడ జువాలజీ డిపార్టుమెంటుకు హెడ్డు. ఐతే వయసులో పెద్దవటం వల్ల, మిగతా వాళ్ళకంటె ముందు ఉద్యోగంలో ప్రవేశించిన కారణంవల్ల మాత్రమే డిపార్టుమెంటుకు హెడ్డు అయిన ఆమె తన డిపార్టుమెంటులోని ఉద్యోగస్తు లందరినీ చీటికీమాటికీ, ప్రతి చిన్న విషయానికీ ఎలా పీడించుకు తింటుందో అక్కడున్న వారందరికీ తెలుసు. కాని ఆమెకు మాత్రం ఆ విషయం గుర్తుకు వస్తున్నట్లు లేదు.

వారందరి ఓదార్పు వాక్యాలతో సరళకి ధైర్యం వచ్చింది. పైగా వాళ్ళ ముందు అలా ఏడిచినందుకు, తద్వారా వారి ముందు తేలికై పోయేనేమోనన్న సిగ్గూ, సంకోచం కూడా కలిగినట్లు ఆమె ముఖ కవళికలలో స్పష్టంగా కనిపించ సాగింది.

సరళ రుమాలుతో ముఖం తుడుచు కుంటూ లేచి నిలబడింది. "ఆఁ, యీావిడ మాటలకు నేను బెదుర్తానా? అన్నా నాలుగు మాటలంటుంది తప్ప, నన్నేం చేస్తుందేమిటి? ఇది కాదు, దీన్ని పుట్టిం చిన బ్రహ్మ కూడా నన్నేమీ చెయ్య లేదు. కాన్ఫిడెన్షియల్ రిపోర్టు వ్రాసే

రోజులు కదా, కాస్త అదరగొడ్దాం జనాన్ని అనుకుంటోంది కాబోలు! ఈవిడకు బెదిరేది ఎవ్వరు? మా బావ మినిస్టరని యీ విడకు తెలియదు కాబోలు. మా అన్నయ్య కూడా వచ్చే ఎన్నికలలో నిలబడుతున్నాడు. తల్చుకుంటే యీవిడ ఉద్యోగాన్ని, యీ కాలేజీనే పీకేయించగలను నేను...'' తలెగరేస్తూ వెళ్ళిపోయింది సరళ అక్కడ నుండి.

అందరూ ఆమె వెళ్లిన వైపుకే నిశ్శబ్దంగా చూస్తుండిపోయేరు కాసేపు. ఎంతగా సరళని పైపై వాక్యాలతో ఓదార్చినప్పటికీ ఆవిడకు జరిగిన అవమానానికి, యింకా చెప్పాలంటే గర్వభంగానికి, వారంతా మనసారా సంతోషిస్తున్నట్లు వారి ముఖాలు చెప్పక చెప్తున్నయ్.

కాసేపటికి బెల్లవటం, క్లాసులకు వెళ్ళిన వాళ్ళు తిరిగి రావటం, వాళ్ళు ఒక్కొక్కళ్లే వస్తూనే సరళకి జరిగిన అవమానాన్ని విని ముఖమంతా సంతోషంతో నింపుకోవటం కూడా జరిగింది. పైకిమాత్రం "అరె!సరళని కూడా అంత ఘాటుగా అందా ప్రిన్సిపాలు! నమ్మలేకుండా ఉన్నాను," అన్నారు ప్రతి ఒక్కరూను.

శకుంతల కూడా క్లాసు నుండి వస్తూనే డస్టరూ, అటెండెన్సు రిజిష్టరూ టేబులు మీద పడేసి, ఉసూరుమంటూ కుర్చీలో కూలబడింది. "ఏం, అట్లాగున్నారేం? వంట్లో బాగా లేదా?'' అనడిగేను నేను.

"ఏం వళ్ళో, ఏం పాడో, రాధా! మా రెండో అమ్మాయికి నిన్నట్నుండి భేదులు. మూడు నెల్ల క్రితమే పళ్లురావటం మొదలెట్టినాయని చెప్పేను కదూ? మొదట క్రింద పళ్లు రెండూ వచ్చి, అలాగే వుండిపోయినయ్. పెరగనూ లేదు తరగనూ లేదు. మిగతా పళ్ళు కూడా రావటం మానివేసినయ్. ఎందుకో ఏమో అర్థంకావటం లేదు. సరే వున్నట్టుండి నిన్న పదిసార్లు బయటకు పోయింది. ఇవ్వాళ ఉదయమే చూద్దునుకదా పై పళ్లు రెండూ వస్తున్నట్లు కనిపించినయ్. వేలు పెట్టి చూస్తే చిగురు గట్టిగావుంది. అందువల్ల పళ్ళవల్లనే యీ విరోచనాలని తేలిపోయింది.

"సరే వాళ్ల అవస్థలు కాక నా అవస్థ ఇంకా అధ్వాన్నంగా వుంది. నేనేమో యిద్దరుపిల్లలుచాలంటే:ఇంకా అబ్బాయి కావాలంటారు మావారు. మా రెండో పిల్ల పుట్టినప్పుడే, 'ఆపరేషన్ చేయించుకుంటానండీ, ఇంకా పనివాళ్ల మీద పిల్లల్ని పడేసి యీ అవస్థలు నేను పడలేనండీ!''అంటూ ఎంతో మొత్తుకున్నాను. ఆయన వింటేనా? అబ్బాయి పుట్టకుండానే ఆపరేషన్ చేయించుకుంటే వాళ్ళ అమ్మా, నాన్నా తనని తిడ్తారట. వాళ్ళకి తనొక్కడే కొడుకు. తనకి కనుక

కొడుకు పుట్టకపోతే తన వంశం తన తనతోనే ఆఖరౌతుందని ఆయన బాధ. పోన్లే మూడో ఛాన్సు చూద్దాంలే అని నేనూ ఒప్పుకున్నాను...... వినా నాకు తెలియ కడుగుతాను, రాధా! చదువుకుని అన్నీ తెలిసిన మనమే ఇలా మగపిల్లవాడేదో వంశోద్ధారకు డౌతా డని భావించటం తెలివి తక్కువ తనం కాదూ? ఫూలిష్ సెంటిమెంట్ అవునా, కాదా, నువ్వే చెప్పు.

"సరే, మొదటి పిల్లలిద్దరూ ఎటుపడీ వెంటవెంటనే పుట్టేరు కదా యీసారన్నా కాస్త పిల్లల మధ్య ఎడం ఉండా అని ఫామిలీ ప్లానింగు మొదలెట్టాం. మా రెండోది పుట్టిన దగ్గర నుండి మాత్రలు మింగుతున్నాను. ఆ మాత్రల తీరే అంతో లేక నా వంటి తీరోగాని అవి తింటున్నప్పటినుండీ ఆ కళే చచ్చి పోయిందోయ్! వళ్లయితే ఊరి ఊరి పోతోందేకాని, లోపల శక్తే వుండటం లేదంటే నమ్ము. కూర్చుంటే ఆయాసం, నిల్చుంటే ఆయాసం! వంట్లో పిసమన్నా ఓపిక లేదు, రాధా! ఏ మవస్థలో ఏం పాడో! ఖర్మ!" నుదురు కొట్టుకుంటూ విచారంగా అంది శకుంతల. అంతలోకే ఆవిడలో హాస్యం తలెత్తి చూసింది కాబోలు, "ఇదిగో, రాధా! నువ్వయితే పెళ్లి చేసుకోకమ్మా. అంత కంటె నరకం మరో టుండదు. చూస్తున్నావుగా నా అవస్థలు!" అంటూ భళ్లున నవ్వింది శకుంతల.

నేను నవ్వు తెచ్చుకున్నాను. ఇంతలో ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్న చప్పుడైతే వులికిపడి చూసేం యిద్దరం అటువైపుగా.

పార్వతి ఏడుస్తోంది.

నాకు ఎంతో ఆశ్చర్యం వేసింది. ఎన్నడూ చిరునవ్వు చెరగనీయని ముఖంతో కళకళ లాడుతూండే పార్వతి యెందుకు ఏడుస్తోంది?

శకుంతల చటుక్కున లేచి అక్కడకు వెళ్ళింది. పది నిమిషాలపాటు ఆసాంతం ఆమె కథ విని తిరిగి వచ్చింది శకుంతల. వెంటనే నాకు చెప్తే వాళ్ళు చూసి యేమైనా అనుకుంటారని ఏదో పుస్తకం తెరిచి చూస్తూ కూర్చుండిపోయింది. కాని రెండు నిమిషాలకంటె ఎక్కువసేపు ఓపిక పట్టలేకపోయింది శకుంతల.

బల్లమీదకు వంగి నాతో గుసగుసగా చెప్పింది! "పార్వతిని రాత్రి మొగుడు కొట్టేడట!"

"ఏమిటీ?" అదిరి పడ్డాను నేను.

"హుష్! అరవకు. నువ్వొట్టి పిచ్చి పిల్లవు. ఏం తెలియదు" వెనక్కు జరిగి మామూలుగా కూర్చుంది శకుంతల ఒక్క నిముషం.

తరువాత ఓరకంట అటువైపు చూసి వాళ్ళంతా పార్వతిని ఓదార్చటంలో పూర్తిగా నిమగ్నులై వున్నారని నిర్ధారించు కున్న తరువాత మళ్ళా వంగి నాతో అంది: "పార్వతి మొగుడు పైలట్ ఆఫీ




సర్ కదూ? ఈ మధ్య రోజూ రాత్రిళ్లు తాగివస్తున్నాడట ఇంటికి. రాత్రి పార్వతి గట్టిగా నిలదీసి అడిగేసరికి పట్టుకుని తన్నేడట!" అక్కడితో తను చెప్పదల్చుకున్నది చాలావరకు పూర్తయినట్లు తేలికగా ఊపిరి పీల్చుకుంది శకుంతల.

మరోమారు అటూయిటూ చూసి "అన్నట్టు! ఆయన ఈ మధ్య ఒక ఎయిర్ హోస్టెస్‌తో తిరుగుతున్నట్టు ఎవరో చెప్పారట కూడానూ!" అంటూ ముగించింది శకుంతల.

నా తల తిరిగిపోయింది. పార్వతిలాటి స్త్రీకి కూడా సాంసారిక బాధలున్నాయంటే యీ కన్నీళ్ళు సృష్టి స్త్రీజాతికి ప్రసాదించిన అపూర్వమైనవరమనీ, అంతస్తుతో, హోదాతో, ఆఖరికి మనస్తత్వంతో కూడా నిమిత్తం లేకుండా యివి స్త్రీని యిట్టే ఆశ్రయిస్తాయనీ అనిపించింది నాకు.

రోజులు గడచిపోతున్నాయ్. అప్పుడే నేను ఉద్యోగంలో చేరి ఆరు నెలలయింది. ఆ ఆరు నెలల ఉద్యోగానుభవం నాకు ఎన్నో పాఠాలు నేర్పింది. తత్ఫలితంగా నా ప్రవర్తనలో, మానసిక స్థితిలో, అభిప్రాయాలలో, ఆశయాలలో ఎన్నో మార్పులు వచ్చినయ్. ఇప్పుడు నేను కూడా ఠీవిగా, గర్వంగా నడవటం, విద్యార్థినుల ముందు గంభీ

రంగా ముఖం పెట్టటం, వాళ్ళు చేసే నమస్కారాలను చూసీ చూడనట్లు నిర్లక్ష్యంగా అంగీకరించటం; ఆడంబరంగా అలంకరించుకోవటం, అర్థరహితమైన సంభాషణలలో పాల్గొనటం మొదలైన విషయాలన్నీ అనాయసంగానే చెయ్యగలుగుతున్నాను. అన్నిటికన్న ముఖ్యమైన విషయమేమంటే, నాకిప్పుడు ఆవలింతలు కూడా వస్తున్నయ్. ఐతే అలా అందవికారంగా, అసభ్యంగా ఆవలిస్తున్నందుకు నేను సిగ్గుపడటం లేదు.

ఇలా వుండగా కాలేజీ వార్షికోత్సవాలు మరో పదిహేను రోజుల్లో ప్రారంభమవబోతాయన్న వార్త చేరింది అందరికీ. ప్రిన్సిపాలు ఆ ఉత్సవాల కార్యక్రమాల్ని నిర్వర్తించేందుకుగాను లెక్చరర్లందరికీ తలా ఒక పనీ అప్పజెప్పింది. నా వంతుకి పార్టీకి కావలసిన తినుబండారాలను తెప్పించే పని యిచ్చింది.

నాకసలే యిలాంటి పనులు కొత్త. ఆ మిఠాయి దుకాణంవాడితో ఎలా మాట్లాడాలో, ఖరీదు ఎలా నిర్ణయించాలో అవేమీ తెలియవు. ఎలాగో శకుంతల సాయంతో, కాలేజీ స్టూడెంట్సు యూనియన్ ప్రెసిడెంటు అయిన సునందను ఆ పనికి నియోగించేను. నేను పని చెప్పగానే సునంద సంతోషంతో అంగీకరించింది.

నిజానికి సునంద అంత త్వరగా నేను చెప్పిన పనిని చేస్తుందని అనుకోలేదు మొదట. ఎందుకంటే, ఆ కాలేజీలో విద్యార్థినులెవరికీ లెక్చరర్లమీద నిజమైన భక్తి శ్రద్ధలు లేనేలేవు. ఎంతో నిర్లక్ష్యంగా, బాధ్యతారహితంగా ప్రవర్తిస్తుంటారు ఎప్పుడూనూ. క్లాసులో వాళ్ళు వేసే విజిల్సూ, బల్ల దరువులూ, పిల్లికూతలూ, నక్కకూతలూ అన్నీ చూస్తే మగపిల్లలే ఎంతో నయమనిపిస్తుంది. క్రింద లెక్చరర్లు నడుస్తుంటే మేడమీద నున్న విద్యార్థినులు వాళ్ళ నెత్తిమీద గడ్డిపరకలు వెయ్యటం కళ్ళారా చూసిన నేను, ప్రిన్సిపాలు ఆ విద్యార్థినులను ఏ రకంగానూ శిక్షించలేకపోయిందని చూసేక మరింత నిర్ఘాంతపోయేను.

క్లాసులో పూర్తి అటెండెన్సున్న రోజు ఒకటన్నా లేదు. కాలేజీకి వచ్చిన విద్యార్థినులు క్లాసులకు రాకుండా సాయంత్రంవరకు చెట్లనీడలలో కూర్చోవటం, కబుర్లాడుకుంటూ, పాటలు పాడుకుంటూ కాలక్షేపం చెయ్యటం, లేదా దగ్గర్లో వున్న తాజ్ మహల్ హోటల్లో పడి తినటం, అటునుండి అటే సినిమాలకూ, షికార్లకూ పోవటం పరిపాటి. అలాటివాళ్ళచేత ఏమన్నా పని చేయించుకోవాలంటే ముందుగా వాళ్ళ కేవో మంచి మాటలు చెప్పి, మచ్చిక చేసుకోవాలి. అలాటి లౌక్యం లేని నాబోటివాళ్ళు పరువు నిలబెట్టుకోవాలంటే వాళ్ళకు దూరంగా వుండటమే మంచిది.

సరే, సునంద మిఠాయి దుకాణం వాడితో చెప్పి కావలసిన యేర్పాట్లన్నీ చేసుకొచ్చింది. నేను వివరాలడగ సాగేను.

"స్వీట్ అసలు ఖరీదు కిలో పన్నెండు రూపాయలు. బిల్లు పధ్నాలుగుకి వ్రాసిస్తా నన్నాడు. పదిహేను కివ్వమని ఎంతగా అడిగినా లాభం లేదన్నాడు, రాస్కెల్!" అంది సునంద.

"అదేమిటి? ఎంత కిచ్చాడో అంతకే బిల్లు యివ్వమను. ఎక్కువ ఖరీదుకు వ్రాసివ్వమని అడగట మెందుకు?" అన్నాను నేను.

సునంద కళ్లెత్తి చిత్రంగా చూసింది నా వంక; "యింకా నయం, యిప్పటికే వచ్చే లాస్ మనకి అని నే నేడుస్తుంటే, మీ రలాగంటా రేమిటి, మేడమ్? ఆ వచ్చే లాభంలో ముగ్గురికీ మూడు రూపాయ లొస్తాయిగదా అని నే నాశపడ్తే, వా డలా చేసేడు," అంది సునంద.

"ఎవరా ముగ్గురు?" అన్నాను, అప్ప టికి కొంతవరకు విషయాన్ని అర్థం చేసుకోగలిగిన నేను.

"ఇంకెవరు? ప్రిన్సిపాలూ, మీరూ, నేనూ!!" అంటూ నవ్వింది సునంద. "మీరీ యేడే కొత్తగా చేరేరుకదూ? ఏం అనుభవం లేనట్లుంది," అంటూ జాలి పడింది నా మీద.

"ఛ! మన ప్రిన్సిపాలుకి యిలాంటి బుద్ధులున్నాయా!" పైకే అనేసేను దాచుకోలేక.

"ఈ ప్రిన్సిపాలేమిటి? ఏ కాలేజీలో నైనా, ఏ ప్రిన్సిపాలైనా అలాగే వుంటుంది, మేడమ్! నాలుగేళ్ళగా స్టూడెంట్స్ యూనియన్ లో ఎక్జిక్యూటివ్ మెంబర్ గా వుంటున్నాను నేను. అన్నీ నాకు తెలుసు. ఐనా యిలాంటి విషయాలను సీరియస్ గా తీసుకో కూడదు, మేడమ్!"

నా విద్యార్థిని నాకు సలహా యిస్తోంది.!

నే నింక కోపం పట్టలేకపోయేను. "చూడు, సునందా! నీ వయసు పట్టు మని పద్ధెనిమిది సంవత్సరాలు కూడా లేదు. అప్పుడే యింత లౌక్యం, వ్యాపార బుద్ధి వంటబట్టించుకున్నావని వింటుంటే నాకే సిగ్గుగా వుంది. నిర్మలంగా, నిష్కా పటంగా, ఆదర్శవంతంగా జీవించవలసిన యీ వయసులో ఎంత జాణవై పోయేవు! పోనీ! ఆ ప్రిన్సిపాలంటే పిల్లలు గలా విడ. నేర్చుకోవలసిన వయసు దాటి నావిడ. ఆమెను మార్చటం యీ స్థితిలో బ్రహ్మతరం కూడా కాదని సరిపెట్టుకో వచ్చు. కాని నీ సంగతే నాకు చాలా ఆశ్చర్యాన్నీ, బాధనూ కలిగిస్తోంది. అన్యాయాలను ప్రతిఘటిస్తూ, అక్రమా లను ఖండిస్తూ, చైతన్యవంతంగా బ్రతక వలసిన యీ వయసులో యిదేమి బుద్ధి నీకు? యిలా దొంగచాటుగా తీసుకున్న పాతిక, ముప్ఫై రూపాయలవల్ల నీకు కలిగే మహాలాభం యేమిటి? మూడు రోజుల్లో మాయమయ్యే యీ ముష్టి

డబ్బుకోసం ఆత్మగౌరవాన్ని చంపుకోవటానికి నీకు సిగ్గు వెయ్యటం లేదూ? మీ నాన్నగారు పెద్ద ఆఫీసరు. మీ అమ్మగారు కూడా బాగా చదువుకున్నావిడే అని విన్నాను. ముక్కు పచ్చలారని తమ పిల్లలు యిలాటి నీచకార్యాలు చేస్తున్నారని వింటే వాళ్ళిద్దరూ బాధపడరా? లేక నువ్వు చేసేది వాళ్ళకు తెలిసి కూడా నిన్ను ప్రోత్సహిస్తున్నారా?" అన్నాను.

నా కోపం చూసి మొదట సునంద కొద్దిగా జంకింది. కాని వెంటనే నవ్వేసింది. "వయసులో మీరు నాకంటె నాలుగైదేళ్ళు పెద్ద అయినప్పటికీ, నాకంటె ఎంతో చిన్నవారిలా మాట్లాడుతున్నారు, మేడమ్! మీకు లోకజ్ఞానం బొత్తిగా తక్కువ. చూస్తుంటే మీకు విద్యార్థిదశలో పాఠం పుస్తకాలు తప్ప మరో ప్రపంచం తెలిసినట్లు లేదు. మనిషి సుఖంగా బ్రతకటానికి కావలసింది తెలివితేటలూ, నేర్పూ. అంతే తప్ప పుస్తకాల్లో నీతి నిజాయితీలు కూడు పెడ్తాయనా మీ వుద్దేశం? అలాటి ఆదర్శాలన్నీ చదివి అవతల పారేసేందుకు. ఖర్మకాలి మీలా ఉపాధ్యాయ వృత్తిలో చేరితే, మరో నలుగురికి చిలకపలుకుల్లా చెప్పేంతవరకే వాటి ప్రయోజనం. నిజజీవితంలో వాటిని అమలు పర్చాలంటే ఎన్నో ప్రమాదాలకు గురి కావలసి వస్తుంది; లోకదృష్టిలో చవటలా చలామణి అయ్యే దుస్థితి సంభవిస్తుంది. ఇప్పుడు నేను నిజాయితీగా వుండి రూపాయి వాటా తీసుకోకపోయినా, మీరు కూడా ముట్టుకోనని పట్టుబట్టినా, ప్రిన్సిపాలు ఊరుకుంటుందా? ఆ మూడు రూపాయలూ ఆవిడే తినేస్తుంది. అంటే యీ రకంగా ఆవిడతో సహకరించటం ద్వారా ఆవిడ పాప భారాన్ని కొంత మనం తీసివేస్తున్నామన్నమాట!" అంది.

ఇంక ఆ మెతో మాట్లాడటానికే అసహ్యం వేసింది నాకు. ఆ విషవలయాన్నుండి బయట పడేందుకు గాను మర్నాటినుండి వరుసగా నాలుగు రోజులు- వార్షికోత్సవాలు అయిపోయే వరకు-'సిక్ లీవ్' పెట్టి యింట్లో కూర్చున్నాను నేను.

నన్ను కదిలించిన మరో సంఘటన నేను ఆ కాలేజీ నుండి మరో పదిరోజులకు వెళ్ళిపోతాననగా జరిగింది. స్టాఫ్ రూములో కూర్చుని నేనేదో చదువుకుంటున్నాను ఒక మూలగా. రూముకి ఆ చివరన నాకు చాలాదూరంలో నీరజ, కమల కూర్చుని మెల్లగా మాట్లాడుకుంటున్నారు. మిగతా వాళ్ళంతా క్లాసుకు వెళ్ళిపోయారు. ఉన్నట్టుండి కమల, "అతను...అత నిప్పుడేంచేస్తుంటాడో!" అనటం వినిపించి ఉలికిపడ్డాను.

నీరజ, "యీపాటికి యింగ్లండు చేరుకునే ఉంటాడు కదూ?" అంది.

"ఔను."

"వెళ్ళగానే ఉత్తరం వ్రాస్తాడుగా!"

"ఎవరికి? నాకా? నాకెందుకు






వ్రాస్తాడు? నే నెవర్ని అతనికి? చక్కగా పెళ్ళాం పిల్లలతో ఖులాసాగా గడిపే వాడికి నేను గుర్తుకొస్తానా? ఏదో మేన మామ కూతురుని కదా అన్న అభిమానంతో ఓ కొర్దు ముక్క పడేస్తాడేమో! అయినా నా పేర వ్రాస్తాడన్న నమ్మకమైతే నాకు లేదు-" కమల కంఠం వణికింది చిన్నగా.

కొద్ది క్షణాలు నిశ్శబ్దం.

"ఊరుకో. ఏడవకు. ఈ జన్మలో ఎంత చేసుకున్నామో అంతే అనుభవిస్తాం. అందని విషయాలకోసం బెంగ పెట్టుకోవటం మన తెలివి తక్కువనే సూచిస్తుంది," నీరజ అనునయంగా అంటోంది.

కమల సన్నగా ఏడుస్తున్న శబ్దం విన్నాక యింక పుస్తకం మీదకు దృష్టి పోలేదు నాకు.

వాళ్ళ సంభాషణని బట్టి కమల తన బావను ప్రేమిస్తోందనీ, అతనికి అదివరకే పెళ్ళయిపోయిందనీ అర్థమయింది నాకు. ఆమె బావ ఒక ప్రఖ్యాత జర్నలిస్టు. ఆ సంగతి కాలేజీలో చేరిన కొద్ది రోజుల లోనే తెలిసింది నాకు. కమల వయసు ముప్ఫై పైనే వుంటుంది. ఆమె మధ్య తరగతి సంసారానికి చెందిన స్త్రీ. తండ్రి లేడు. ఆమే యింటికి పెద్ద సంతానం. మిగతా పిల్లలందరినీ కమలే

చదివిస్తోంది. ఈ విషయాలన్నీ దృష్టిలో వుంచుకుని యిప్పటి వాళ్ళ సంభాషణ వింటుంటే నా మనసదోలాగై పోయింది. కమల లాటి స్త్రీలు ఆంధ్రదేశంలో వేల కొలదీ వున్నారు. పూలూ, కాయలూ లేకుండానే ఎండిపోయే మానులు వాళ్ళంతానూ. సతీసహగమనం, కన్యా శుల్కం, బాల్య వివాహాలు, వరకట్నం, కులమత వ్యవస్థ మొదలుగాగల సాంఘిక దురాచారాలు అనాదిగా భారత స్త్రీని ఏదో ఒక రూపంలో చిత్రహింస చేస్తూనే వస్తున్నయ్. ఈ సృష్టిలో అనంతమూ, శాశ్వతమూ అయిన విష యాల్లో స్త్రీలు కార్చే కన్నీరు కూడా ఒకటి!

కొద్ది రోజుల తరవాత నా కా కాలేజీ నుండి ట్రాన్స్‌ఫరయింది. ట్రాన్స్ ఫర్ ఆర్డర్సు చూస్తూనే నాకు కంగా రుతోపాటు, ఆ కాలేజీని విడిచి వెళ్ళ వలసినందుకు దిగులు కూడా వేసింది. ఆ కాలేజీలో పనిచేసిన తొమ్మిది నెల ల్లోనూ నేను సహించలేని విషయాలు, అసహ్యించుకునే సంఘటనలు ఎన్నో జరిగిన మాట వాస్తవమే! ఐనా ఆ కాలేజీ అంటే నాకు ఏదో చెప్పలేని మమకారం ఏర్పడిపోయింది. ఒక స్త్రీ తన తొలి సంతానాన్నీ, రచయిత తన తొలి రచననూ ప్రేమించినట్లుగా వుద్యోగి కూడా తొలిసారిగా తను పని చేసిన సంస్థను కూడా అలాగే ప్రేమి స్తాడు కాబోలు.

ముఖ్యంగా ఆ కాలేజీ స్టాఫ్ నా కోసం ఏర్పాటు చేసిన వీడ్కోలు విందు సందర్భంలో నాకు కన్నీరాగలేదు. ఆ సమయంలో అక్కడ కూర్చున్న స్త్రీ లంతా నా కంటికి ఎంతో అమాయకు లుగా, మంచి వాళ్ళుగా కనబడ్డారు. వాళ్ళలోని ఏ బలహీనతలను నే నస హ్యించుకున్నానో అవన్నీ ఎంతో తృణ ప్రాయంగా కనిపించినయ్ అప్పుడు. డబ్బుకోసం కక్కుర్తిపడే ప్రిన్సిపాలూ, అధికార గర్వంతో విర్రవీగే సరళా, ఆధునిక నాగరికతలోని విశృంఖలతకు లొంగిపోయిన ఫాతిమా, సాంసారిక సమస్యలతో తల్లడిల్లిపోయే శకుంతలా, భర్త ప్రేమకు దూరమైన పార్వతీ, జీవితంలో వసంతానికి నోచుకోని కమలా -అందరూ నా కంటికి ఒకలాగానే కని పించేరా సమయంలో. వివిధ రూపాల్లో కనిపిస్తున్న వారందరిలోనూ వున్న 'స్త్రీ' ఒకటే! ఏ దేశంలో వున్నా, ఎలాటి హోదాలో వున్నా, అసూయా, అహం భావం, కన్నీళ్ళూ, గుండె జబ్బులూ, కలహప్రియత్వం, అధికార దాహం, అమాయకత్వం, అజ్ఞానం—ఇవన్నీ స్త్రీని జీవితాంతం అంటిపెట్టుకొని వుండే గుణా లని అర్థమయింది నాకు.

బరువెక్కిన హృదయంతో వారం దరూ ఎంతో హృదయపూర్వకంగా అందించిన శుభాకాంక్షలను, కన్నీటితో తడిసిన 'బై బై' లను స్వీకరించి ఆ కాలేజీనుండి వచ్చేసేను నేను.




# ఇది నిజంగా కథే!

ఇచ్ఛాపురపు రామచంద్రం

బందరు రోడ్ తెగ తిరిగి—లబ్బీపేట వచ్చేసరికి రంగనాథం కాళ్ళు పీకులు పెట్టసాగాయి.

అతని శ్రీమతికి ముక్కు మీద చిరు చెమటలు పోశాయి. వెరశి-యిద్దరికీ ఆర్. టి. సి. మీద అతి కోపం వచ్చింది.

"ఇది ప్రజాస్వామ్యం కాదు-" వుండబట్టలేక అనేశాడు పెదవి కొరుక్కుంటూ, పేద వాడి కోపం పెదవికి చేటు అని రుజువు చేస్తున్నట్లు.

"అవునని నే నను. ప్రజాప్రభుత్వం అయితే ఈ పాటికి హాయిగా మన వూరి బస్సులో ఉండేవాళ్ళం. అయినా మన ప్రభుత్వం మరీను. ఓ బస్సుకి రిపేరొచ్చి షెడ్‌కి పోతే స్పేరు బస్ వేసే పాటి సమర్ధత లేదూ?" కసిగా అంది విమల-రంగనాథం అర్ధాంగి. "ఆర్. టి. సి. కీ యిండియన్ గవర్నమెంట్‌కీ యిది తీరని అవమానం. మాయని మచ్చ. ఇంకా..."

"సమర్ధత లేక కాదు. మన ప్రభుత్వం యిటువంటి చిన్న చిన్న విషయాలు పట్టించుకోదల్చుకోలేదు. మెయిల్లో మరో రెండు ఫస్ట్ క్లాస్ డబ్బాలు తగిలించడానికైతే త్వరపడుతుంది కానీ థర్డ్ క్లాస్ పెట్టెల విషయం వస్తే ససేమిరా అనేస్తుంది. అయినా యీ రోజులు కారు నడకల వారివి కాని కాలి నడకల వారి పెంతమాత్రమూ కావు."

"మనం మాత్రం బొత్తిగా కాలి నడకల వాళ్ళమా? ఆర్. టి. సి. బస్సు నడకల వాళ్ళం."

"ఆ! ఉందిగా మహా గొప్ప బస్సు! రేపు ఉదయంవరకూ జాగరం చేస్తే."

"ఆ మాట కొస్తే జాగరం మహా రంజుగా వుంటుంది. రెండు షోలూ చూసి-ఏ హోటల్లోనో భోజనమూ నిద్రా చూసుకుంటే."

"స్టాప్!" అరిచాడు రంగనాథం. నీ కోరికల గుర్రాలకి కొంచెం కళ్ళాలు బిగించు. అర్ధాంగీ, నీ మొగుడు ఒట్టి బడి పంతులు. నువ్వు—బీద బడి పంతులి భార్యవి. ఈ చేదు నిజం మరచిపోకు."

ముఖం ముడుచుకొంది విమల.

అది గమనించకుండా అనేశాడు రంగనాథం. "టికెట్ ఛార్జీలు ప్లస్ రెండు భోజనాలు, కొంచం చిల్లరా—అంతే మన పాకెట్ కెపాసిటీ. తర్వాత నీ యిష్టం. నా ఉద్దేశం ఏమిటంటే—భోంచేసి—వెన్నెలలో కృష్ణ వొడ్డున గొంతు పోయేవరకూ కబుర్లూ, డ్యూయెట్లూ అరిచేసుకుని-అప్పుడు—కాళ్ళ పీకు తెలియకుండా ఉండగలందులకై ప్లాట్ఫారంలో దిగి ఆ వేగంలో స్టేషన్ చేరేసుకుని అక్కడే తెల్లవార్చేయడం. ఈ ప్రోగ్రామ్‌లో యికానమీ వుంది. ఇక్కడ డెఫిసిట్ బడ్జెట్టయితే అప్పు పుట్టదు. బస్ ఛార్జీలు అతి కఠినం. ఐదు పైసలు తక్కువైనా అడుక్కు తెచ్చుకుని చెల్లించవలసిందే. కనుక ఓ బంగారు బొమ్మా బుద్ధిగా నిలుచో కాస్సేపు."

ఛీఛీ అనుకుంది విమల లోలోపల. పైకి అనకపోవడానికి కారణం ఆమె అంతో యింతో పతివ్రత మరి.

ఆర్థిక సమస్య ఆ దంపతుల మధ్య నిశ్శబ్దాన్ని సృష్టించింది. ఆ నిశ్శబ్దంలో అలా ఎన్ని నిముషాలు గడిచాయో వాళ్ళిద్దరిలో ఒక్కరూ లెక్కించ లేదు.

హఠాత్తుగా అరిచాడు రంగనాథం- "తెలుగు దీపం!"

"ఏమిటీ?" ఉలిక్కిపడి అతనికి దగ్గరగా జరిగిందామె.

"తెలుగు దీపం!"

"తెలుగు దీపమూ, తమిళ దీపమూ ఏదీ ఆ దీపం? పందేమో అనుకుని హడిలిచచ్చాను చీర పాడు చేస్తుందేమో అని! ఇంతకీ ఆ తెలుగు దీపం ఏమిటి? యెక్కడ?"

ఒక్కసారి గంభీరంగా మారిపోయాడు రంగనాథం.

"తెలుగు దీపం! ఆంధ్రప్రదేశ్ నుంచి వెలువడే వార పత్రికలో అది మినహా. ఓ రచయిత భార్య వయ్యుండీ యీ మాత్రం తెలుసుకోలేక పోయావు! ఈ అజ్ఞానం నేను క్షమించను. నిన్ను పుట్టింటికి పంపేస్తాను. జ్ఞానం సంపాదించుకురా."

"జ్ఞానం కోసం పుట్టింటికి పంపేస్తారా! అవును. నా కివ్వడాని కది మీ దగ్గిర లేదేమో! ఇంతకీ జ్ఞానానికి నానార్థాలుండి అందులో ధనం కూడా ఒకటి కాదు కదా? బై ది బై...మీ దగ్గర డబ్బు అట్టే లేదన్నారు. మా పుట్టిల్లు, ఇక్కడికి పాతిక రూపాయల దూరం..."

"జీతాల అరియర్స్ అందాక ఆ విషయము ఆలోచిద్దాం. ముందు నడువ్."

"మిమ్మల్నను సరిస్తానే ఉన్నాను డార్లింగ్. ఇంతకీ యీ పరుగెక్కడికి?"

"తెలుగు దీపం ఆఫీసుకి."

"ఎందుకు?"

"నీ మెదడు కృష్ణలో గిరాటెయ్యా! ఎనిమిది నెలల క్రితం నా కథొకటి వెయ్య లేదూ ఆ పత్రికలో?"

"అయితే?"

"దాని తాలూకు పారితోషికం పంప లేదు."

"కాలదోషం పట్టి పోలేదూ?"

"శుభమా అని బయలుదేరుతూంటే శని పలుకుతావేం? పద పద—"

"మరో కథ పంపించినట్లున్నా రప్పుడు. తెలుగు దీపానికేనా?"

"ఆ! బాగా గుర్తు చేశావు. అచ్చులో కథ చూసుకున్న ఉత్సాహంలో మరోహాటి—విషవలయం— రాసి పంపాను."

"రెండింటికీ పారితోషికం యిచ్చేస్తే బాగుండును. రెండు సినిమాలు చూసి..."

"అలా లేదు, చూలా లేదని—నేను తున్న కథకి యిస్తే చాలులెద్దూ. ముందు గండం గడుస్తుంది."

"ఆడజన్మెత్తాను, నాకు అలు వుండే అవకాశం లేదు."




"పోన్లే. నాకుంది ఆలి."

"నాకూ వుంది చూలు." మూతి వంకర తిప్పింది విమల.

"షటప్ ... సారీ...గప్ చుప్...పరిసరాలలో ఫ్యామిలీ ప్లానింగ్ వాళ్లుండే ప్రమాదం వుంది."

"బిల్డింగూ అదీ ఘనంగానే వుంది. బాగానే యిస్తారా మీ కథకి?"

"పదో, పరకో..."

"పరక వొద్దు. పాతికడగండి. చీర కొనుక్కుందాం. అదే...చీర కొందురుగాని నాకు."

"బిల్డింగ్ లోపల యింకా ఘనంగా వుంటుంది కానీ అడుగులు వడిగా వెయ్యాలి, హంసగమనా" హెచ్చరించాడు రంగనాథం.

"మీతో సాలలేక హంసలాగే ఎగురుతున్నాను."

ఎడిటర్ గారనీ, సంపాదక మహాశయులనీ అడిగితే ఉద్రాశ్శైవరూ సమాధానం చెప్పలేదు రంగనాథానికి. ఓ పెద్దమనిషి రంగనాథాన్ని చూసి జాలి పడినట్లు అసలు మాత్రం చెప్పాడు—"వేదాంతం శాస్త్రిగారెక్కడ అని రెండో అంతస్థులో అడిగితే చెప్తారు. ఆయనే తెలుగు దీపం ఎడిటర్."

రంగనాథం, విమలా రెండో అంతస్థు చేరుకున్నారు. ఎవరో కుర్రాడి నడగగా చిన్నగదిలోకి తీసుకెళ్ళి రెండు కుర్చీలలో కూర్చున్న రెండు శాస్త్రీలలోనూ కళ్ళ జోడు కలవాడే కథల మాస్టర్ అని చెప్పి తనదారిన పోయాడు.

"నమస్కారం...నా పేరు రంగనాథం—"

వంచిన తల ఎత్తకుండా "నమస్కారం...మీకేం కావాలి?" అన్నాడు ఎడిటర్ కసురుతున్న ధోరణిలో.

రంగనాథానికి డి. యి. వో. ని చూసి నంత భయం వేసింది.

"నేనో చిన్న పనిమీద తమ దర్శనార్థం వచ్చాను."

సవినయంగా, జిల్లాపరిషత్ ఆఫీసు ఎల్. డి. సి. ముందు మల్లె అన్నాడు రంగనాథం.

"ఏమిటది?" కొట్టబోతున్నట్లు తల ఎత్తాడు ఎడిటర్.

"ఎనిమిది నెలల క్రితం నా రచన తమ పత్రికలో ప్రచురించారు."

"అయితే ఏం చెయ్యమంటారు?"

"మీ పత్రికకి మరో రచన—విమలయం—పంపాను..."

"చూడండి...నాకు టైమ్ చాలా ప్రెషస్. మీ కథ విషయం యిప్పుడు నేనేమీ చెప్పలేను. ఇప్పుడు మేము వేస్తున్నది రెండు సంవత్సరాల క్రితం అందిన కథలు. మీ కథ రెండు మూడేళ్ళలో రావొచ్చు. లేదా—రాకపోనూ వచ్చు."

"అన్ని కథలు..."

"ఆహా! మా పత్రికకు అన్నేసి కథలు వచ్చేస్తూంటాయ్. వనితావని వ్యాసాలు రెండు గోనె బస్తాలు. కథలు మూడు గోన్లెతో...సీరియల్స్ ఓ బస్తాడు... వీటన్నిటి మధ్య మీ కథ వెదకడం నా తరం కాదు. బ్రహ్మతరం కూడా కాదనే ఐ బిలీవ్..."

"వేసుకోలేని కథ అను త్రిప్పి పంపరా?"

"పంపము."

"స్టాంపులు పెట్టినా పంపరా?"

"ఊహుం."

"కనీసం కథ ప్రచురించే విషయం కూడా తెలియపరచడం..."

"మాకు అసాధ్యం. ఈ సంపాదకుడి సీటుంది చూశారూ, యిది పది గాడిదల పని. మేనేజ్ మెంటువారు నన్నొక్కడినే వేశారిక్కడ. అందుచేత—మేం కథలు చదవం. చదవలేం. ఎప్పు డవసరం వస్తే అప్పుడు కథల బస్తా దగ్గరకి పరుగెత్తి సంచికకు కావలసిన మేటరు కలక్ట్ చేసుకుంటాం. కథలన్నీ నేరుగా గోనె బస్తాలలోకి వెళ్తాయ్—నాకు చూసేందుకు తీరికుండదు కనుక. వేసుకోని కథ అను త్రిప్పి పంపుతూ కూర్చుండడాని కిక్కడ మనుషులు లేరు." ఖచ్చితంగా చెప్పేశాడు వేదాంతం శాస్త్రి.

"మీరు—కథలు చదవరు—తిప్పి పంపరు—ప్రచురించేదీ లేనిదీ చెప్పరు - ప్రచురించాక కాపీ కూడా పంపరు. పారితోషికం యివ్వరు. అయినా మీకు కథలు కొల్లలుగా వస్తూంటాయ్!" నమ్మలేనట్లు చూశాడు రంగనాథం.

"నా మాటమీద నమ్మకం లేకపోతే గోడౌన్‌లోకి వెళ్ళి బస్తాలు చూడండి."

"ఎందుకూ? మీ మాటమీద నమ్మకం లేక కాదు...నే నాశ్చర్యపడుతున్నదల్లా తెలుగు రచయిత సహనశక్తిమీద!" కొంచం ఆవేశం వచ్చింది రంగనాథంలో...ఎంత రచయిత అయినా అతనూ ఓ మనిషే. అతనికి మానావమానాలూ ఆవేశాగ్రహాలూ ఉండటంలో ఆశ్చర్యమూ, అసహజమూ లేవు.

"మానసికంగా, శారీరకంగా శ్రమ తీసుకుని, కాగితాలు, సిరా, కవర్లు, స్టాంపులు- యిన్నిటికోసం డబ్బు తగలేసి చివరకు కథ పంపితే—మీ రా కథ చదవరు. చదివినా ఏ రెండేళ్ళకో చనువుతారు. వేసినా పత్రిక పంపరు! పారితోషికం సంగతి సరేసరి..."

"కథలు రాసేది డబ్బుకోసమా? కళని అపవిత్రం చేస్తారా? తప్పు కాదూ? ఆ మాట కొస్తే కళాకారుడికి కీర్తి కంటె కావలసిందేముంది? మా పత్రిక సర్క్యులేషన్ ముప్ఫయ్ వేలు. అంటే ఆ రచయిత పేరు ముప్ఫయ్ వేలసార్లు ముద్రితమౌతుంది. కనీసం అరవై వేల తెలుగుజనం అతని పేరు చూస్తారు. మా పత్రిక విదేశాలకు కూడా వెళ్తుంది. కాగితాలకూ స్టాంపులకీ మహా అయితే ఓ రూపాయి. ఒక్క రూపాయి...అష్టరాల్ వన్ రుపీతో రచయిత కెంత పేరు! కళాకారుడికి గా..."

వొళ్ళు మండిపోయింది రంగనాథానికి. ఎయిర్ కండిషన్డు గది అయినా—అతని వొళ్ళు విజయవాడ వేసవి ఎండలాగా మండిపోయింది.

"కళ!...కథకు పారితోషికం కోరితే కళా ద్రోహం! ఒక్క మాట చెప్పండి... మీ రిక్కడ కూర్చుని కథలను వ్యాపారం చేస్తున్నారు. కళను ఉద్ధరిస్తున్నారు. సాహిత్యానికి మీరే వెన్నెముకలు. మీరు ఏ ప్రతిఫలమూ కోరకుండానే చేస్తున్నారా యీ కళాసేవ?

"నిజంగా మీరు సాహిత్యసేవ చేయదల్చుకుంటే మీ పత్రికకి వెల ఎందుకుండాలి? ఊరికే పంచిపెట్టండి కావాలన్న వాళ్ళందరికీ.

"పత్రికకు వెల ఉండి—వాటి అమ్మకాలవల్ల లాభాలు సంపాదిస్తూ-పత్రికా ప్రచురణ సాహిత్యోద్ధరణకే అనడంలో న్యాయం ఏమీ లేదు. పత్రిక అమ్మడు పోగా లేని కళాద్రోహం—కథ అమ్ముకోడంలో ఏమీ కలుగదు. కథ అచ్చు వేసుకున్నందుకు రచయితకు పారితోషికం పంపాల్సిన విధి మీకుంది. అంతే కాదు—రచయిత తన రచనపట్ల చెందే ఆత్రుత నర్థం చేసుకుని ఆ రచన విష

యంలో మీ నిర్ణయం తెలియపర్చాల్సిన బాధ్యత మీకుంది. ఈ కనీస సభ్యతా సూత్రాలను పాటించకుండా-రచయితల బలహీనత నాధారంగా చేసుకుని డబ్బు సంపాదించుకోడంకంటె మరో ఘోరం ఉండదు.''

''పని గాడిదల పని—నా వొక్కడి కాదా పడేసింది మానేజ్ మెంట్...'' ఈసారి కొంచం తగ్గాడు వేదాంతం శాస్త్రి.

''మరో తొమ్మిది గాడిదలను పంప మని చెప్పండి. రచయిత రచనను స్వీకరించడంతోపాటు పారితోషికం పంప వలసి ఉంటుందని కూడా చెప్పండి మానేజ్ మెంట్ తో...''

''మీకు మేమేమీ బాకీ లేము. మీ కథ ఇంకా అచ్చు కాలేదుగా?'' విజృంభించాడు ఎడిటర్.

''తమరు మరచినట్లున్నారు. నా కథ ఒకటి ఎనిమిది నెలల క్రితం ప్రచురించారు. మరొకటి ఏ గోనె బస్తాలోనో ఉందో, లేక చెదలు తినేశాయో!''

''ప్రచురించిన మీ కథ పేరు?''

''నయనతార... ఎనిమిది నెలలౌతూంది. పత్రికైతే పోస్టులో మిస్సవవొచ్చు.మనియార్డర్ల కింకా అంత...''

''ఆగండి...అందమైన అమ్మాయీ, ఓ అబ్బాయీ, ఇవి కదూ మీ కథలోని పాత్రలు?''

''అవును.''

''రైట్ ... ఇప్పుడు చెప్పండి.... మీరా కథ స్వంతంగానే వ్రాశారా?''

''అ-ంటే?'' తెల్లబోయాడు రంగనాథం.

''మేము యువ రచయితలను ప్రోత్సహించే ఉద్దేశంతో కథల క్వాలిటీ అంతగా చూడటంలేదు. ఒప్పుకుంటాను. యువ రచయితలు కనుక పారితోషికం పంపడంలేదు...''

''అదీ అన్యాయమే. యువ రచయిత రచన మాత్రం పత్రిక పేజీలు నింపడం లేదూ? దాని కెందుకుండకూడదు పారితోషికం?''

''ఆ విషయం అలా వుంచండి. అంతో యింతో పేరున్న మీరే కథా చౌర్యం చేసి...''

''నేను కథా చౌర్యం చేశానా! ఏమిటి మీరనేది?'' నవనాడులూ క్రుంగిపోయాయి రంగనాథానికి.

''మీ కథ-ఫలానా కథకు కాపీ అని పన్నెండు ఉత్తరాలు వచ్చాయి. అవి ప్రచురిస్తే మీ పేరూ, ఫ్యూచరూ ఏమౌతాయని జాలిపడి వాటిని ప్రచురించలేదు. కాపీకొట్టిన కథకు పారితోషికంకూడా పంపి కథా చౌర్యాన్ని ప్రోత్సహించడానికి నా మనసంగీకరించలేదు.''

రంగనాథం తల ఎత్తుకోలేక పోయాడు.

పరిస్థితి గమనించినట్లు అంది విమల. ''పదండి పోదాం. రైలుకి వేళవుతూంది.''




సంపాదకుడి దగ్గర శలవు తీసుకోకుండానే కదిలాడు రంగనాథం.

డోర్స్ మూతపడిన అనంతరం వేదాంతంశాస్త్రి ప్రక్క కుర్చీ ఆసామీ ఘొల్లున నవ్వారు.

"అఖండుడివోయ్, శాస్త్రీ! చావు దెబ్బ కొట్టావ్ అంత రచయిత మీదా. అందుకే నీ కంత ఎక్కువ జీతం...పూర్ రైటర్. నాల్రోజులవరకూ తేరుకోలేడు షాక్ ఎఫెక్టు నుంచి."

"లేకపోతే కథకి పారితోషికం కావాలిట! ఇలా అందరికీ పారితోషికం యివ్వడం మొదలుపెడితే మన పత్రికకి దెబ్బ కదూ?"

"ఆఫీసూ, అచ్చు మిషనూ చూపి పంపించాల్సింది. ఇంతకీ ఆ కథ కాపీ యేనా?"

"నా మొహం. అంతా హంబగ్."

"మరి అంత ధీమాగా..."

"అది ప్రేమ కథ కదుటయ్యా! ప్రేమా, ప్రేమ కథలూ హిస్టరీలాగా రిపీట్ కావలసిందే తప్ప వాటిలో నావెల్టీ ఉండదు. ప్రస్తుతం వస్తున్న యే ప్రేమ కథనైనా కళ్ళు మూసుకుని ధీమాగా కాపీ అంటే కాదనగలిగే దమ్ములు ఎవరికీ వుండవు. ముఖ్యంగా

రచయితలకసలుండవు."

"బాగుంది నీ ట్రిక్..."

*  *  *

కృష్ణ వొడ్డున వెన్నెలలో విమల అందంగా వుంది. అంతకంటే పదిరెట్లు కోపంగా వుంది.

"ఇతనొక్కడు తల బిరుసు మనిషిలా వున్నాడు కానీ పత్రికా సంపాదకులు చాలా మర్యాదగా ప్రవర్తిస్తారు. రచయితలకు ప్రతిఫలం పంపినా మానినా, రచయిత వచ్చేసరికి చాలా గౌరవం యిస్తారు. ఎవరూ యితని మల్లె వుండరు..."

"ఆ. రచయితగారంటే ఘనస్వాగతం చెప్తూ ఎదురొస్తారు! మీ మాటలు నమ్మాలి. ఇవాళ తెలుగు దీపం ఆఫీసుకి రాబట్టి తమ బండారం బయట పడింది. ఛీఛీ...అన్ని చివాట్లు తింటూ, మర్యాద పోగొట్టుకుంటూ వెధవ కథలు రాసుకోక పోతే నేం? కడుపునిండేనా, కాలు నిండేనా?"

"నన్నర్థం చేసుకో, విమలా..."

"నో అంటే నో. కాపీ కథల రచయితను నేను వినను."

"నేను కథాచోరుణ్ని కాను, విమలా. కనీసం నువ్వయినా నన్ను విశ్వసించవూ? పారితోషికం ఎగగొట్టడానికి సంపాదకుడా యెత్తు వేసి వుండవచ్చు. లేదా కోయిన్సిడెన్స్ ఆఫ్ మైండ్ అని..." కథలు రాయనివ్వదేమో అన్న బాధ రంగనాథం గొంతులో ప్రస్ఫుట మౌతూంది స్పష్టంగా.

"ఇక అటువంటి కబుర్లు వొద్దు" ఖండితంగా అనేసింది విమల.

దీనంగా చూశాడు రంగనాథం.

వెన్నెలలో విమల-కోపంగా వుంది.

వెన్నెలలో విమల-అందంగా వుంది.

"ఏం యిక మీ రచనా వ్యాసంగం కృష్ణలో గిరాటేసినట్లేనా!" యింక పూడూ నేరం చెయ్యవు కదా అని జడ్జి దోషి నడిగినట్లు అడిగింది విమల.

"విమలా, మైడార్లింగ్, ప్లీజ్... నన్ను కథలు రాసుకోనీవూ?"

విమలకు పూర్తిగా కోపం వచ్చేసింది.

"ఇంకా మీరు కథలు వ్రాయ దల్చుకుంటే నా ప్రిస్టేజ్ నిలువునా తీయ దల్చుకుంటే ఐ కాంట్ టాలరేట్. మిమ్మల్ని పుట్టింటికి పంపేస్తాను పరువు మర్యాదా నేర్చుకు రమ్మని. దట్సాల్."

"వొద్దు విమలా!" బాధగా అన్నాడు రంగనాథం, ఆమెను చూస్తూ వాగ్దానం చేస్తున్నట్లు. "ఇక నిజంగా నేను కథ వ్రాయను."

"దట్స్ నైస్. మంచి హాబీ అలా ఉండాలి. కాశీ వెళ్ళనక్కర లేకుండా, కృష్ణలోనే రచనా వ్యాసంగం వదిలేసి ఇకానమీ చేసినందుకు కంగ్రాట్స్... ఇక మీరు గౌరవనీయులైన నా భర్త. టేక కిస్ నా..."

విమల బుగ్గ అందించగా రంగనాథం ముద్దెట్టుకున్నాడు. జీవితంలో మళ్ళీ కథ రాయలేదు రంగనాథం.



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

కాని నాన్నగారు యీ విషయంలో ఎలాటి సహాయమూ చేయరు. నాన్నగారి దగ్గర మారాం చేయటమా? లేక బెదిరించటమా? ఏం చేస్తే ఆయన తలకి నా మాట ఎక్కుతుంది? యిది కూడా ఆలోచించ సాగాను.

సరిగ్గా, నా వూహలకి ఉపాయం చూపిస్తున్నట్టుగా, అదే సమయంలో నాన్నగారు, సిటీలో చాలా ప్రసిద్ధమైన ఒక పెద్ద హోటలు కేసు గెలిచారు.

ఆ హోటలు యజమానికి దాని వలన కొన్ని లక్షలు లాభం వచ్చినాయి.

నాన్నగారికి కృతజ్ఞత తెలియచేస్తూ పెద్ద పార్టీ యిచ్చి 50 వేల రూపాయిల చెక్కు చేతిలో పెట్టాడు.

పార్టీకి అమ్మా, నేను, సారథి, లింగం దంపతులు అందరం వెళ్లాం.

హోటల్ నుంచి తిరిగి వస్తుండగా అమ్మ, ఈ మధ్య నాన్నగార్కి ఒక్కసారిగా యింత డబ్బు ఎప్పుడూ రాలేదని, యిది సారథి అల్లుడు కాబోతున్న అదృష్టం అని అంది.

నాన్నగారు కూడా ఒప్పుకున్నారు.

నేను క్రీగంట సారథిని చూశాను.

అతను నేను వూహించిన విధంగా ఠీవిగా, షోజుగా కూర్చోలేదు.

అనుకోకుండా వాళ్ళు అంట గట్టిన అదృష్టం, మోయలేని వానిలా సర్దుకుని కూర్చున్నాడు.

సారథి నాకు నచ్చిన మొదటి క్షణం అది.

మేం యింటికి వచ్చిన తర్వాత, అమ్మ

ఆ డబ్బు మొత్తం బాంక్‌లో నా పేరు మీద జమచేయమని చెప్పింది.

నాన్నగారు సరే నన్నారు.

నా వైపు తిరుగుతూ, "ఇప్పుడు నువ్వు నాకంటే డబ్బున్న దానివి," అన్నారు.

నేను నవ్వాను.

"ఆ డబ్బంతా నిజంగా నాకేనా నాన్న గారూ?" అన్నాను.

"నీ క్కాకపోతే యిం కెవరికి? మీ అమ్మ కేదయినా కోపం తెప్పించావంటే మాత్రం ఒక్క కానీ కూడా నీది కాదు" అన్నారు.

నేను ఆ రాత్రంతా నిద్రపోలేదు.

ఇప్పుడు నా పేరు మీద బాంక్‌లో 50 వేలు వున్నాయి!

అందులో నుంచి ఒక్క పాతిక వేలు తీసుకుంటే ఏమౌతుంది?

ఆ పని చేస్తే త్వరగా చేసేయాలి.

లేకపోతే ఈ మొత్తం కూడా ఫిక్సెడ్ డిపాజిట్‌లో వేసేస్తారు వీళ్ళు.

ఆఫ్టరాల్! పాతిక వేలు! కావాలంటే వడీ అడగవచ్చు! సాధ్యమైనంత త్వరలో తిరిగి యిచ్చేస్తాడు కృష్ణ! కానీ అమ్మకి తెలిస్తే? తెలియకుండా ఉండాలంటే నాన్న గారి సహాయం కావాలి.

మర్నాడు సాయంత్రం. నాన్నగారు కోర్టుకి వెళ్ళబోతున్నారు. నేను అమ్మ గదిలోకి తొంగిచూశాను. అమ్మ, తాయా రమ్మ యింటి ఖర్చులేవో లెక్కచూసు కుంటున్నారు. నేను చల్లగా నాన్నగారి గదిలోకి వచ్చాను.

నాన్నగారు బట్టలు మార్చుకుని, క్లబ్ కి బైలుదేరబోతున్నారు. ఆయన మంచి మూడ్‌లో వున్నట్టు ముఖం ప్రసన్నంగా వుంది. లోపలకి వచ్చాను నేను.

"ఏం మీనా?" అన్నారు.

"ఏం లేదండీ." అన్నాను.

వెంటనే ఈ విషయం ఎలా చెప్పాలో తెలియని నేను ఆయన గది సర్దసాగాను. ఆ గదిలో సర్దటానికి కూడా పెద్దగా ఏం లేవు. మంచం మీద పడేసి వున్న పేపరు చక్కగా మడిచి టేబిల్ మీద పెట్టాను. టేబిల్ లాంప్‌తీసి కాస్త పక్కకు జరిపి పెట్టాను. విడిచిన బట్ట లుంటే మడత పెట్టాను. దుప్పటి అంచులు సరిచేసాను.

"ఏం కావాలో చెప్పమ్మా?" యెంతో అనునయంగా అడిగారు.

"నాకు-నాకు కొంచం డబ్బు కావా లండి " అన్నాను.

"డబ్బా మరి చెప్పవేం? ఏం లేదం టావేం? దానికింత మొహమాటం ఎందుకు? ఎంత కావాలి? ఇంద తీసుకో" అంటూ పర్స్ తీసి నా చేతికి యిచ్చారు.

నేను పర్స్ తీసుకున్నాను. అది తెరిచి చూశాను. అందులో వంద రూపాయల కాగితాలు నాలుగు, పది రూపాయిల కాగి తాలు మూడు కొంత చిల్లర వున్నాయి.

పర్స్ మూసి నాన్నగారి చేతికి యిచ్చే శాను.

"అదేమిటి? తీసుకోవేం?"

"నాకీ కాస్త సరిపోదండీ?"

"సరిపోదా? ఎంత కావాలి?"

నా దృష్టి నాన్నగారి పైని ఒకటి టేబిల్ మీద పడివుండటం వైపు తిరిగింది. వెళ్ళి అది తీసుకుని, భద్రంగా మడత పెట్ట సాగాను.

"చెప్పు. ఎంత కావాలి?" అన్నా రాయన.

"పాతిక వేలు" అన్నాను.

"పాతిక వేలా!" దిగ్భ్రాంతి చెంది నట్టు చూశారు.

అవునన్నట్టు తలూపాను.

"పాతిక వేలు!" నమ్మలేనట్టు అడి గారు.

"అవునండీ." ఎంతో నెమ్మదిగా అన్నాను.

"పాతిక వేలు! ఎందుకు? ఏం చేస్తావు?"

నేను ముందే సిద్ధం చేసుకుని వున్న మాటలని అణకువగా, అప్ప చెప్పాను. "ఒక ఫ్రెండ్‌కి చాలా అవసరం వచ్చింది. అతనికి నేను సహాయం చేయా లను కున్నాను. అప్పుగా యిస్తాను."

"ఎవరా ఫ్రెండ్!" నాన్నగారి కళ్ళు చురుగ్గా చూసినాయి.

"మీకు తెలుసు."

"నాకు తెలుసా?"

"అవును. మీకు తెలియని స్నేహి తులు కానీ, ఆప్తులు కానీ నాకు ఎవరూ లేరు. మీరు ఒక్క క్షణం ఆలోచిస్తే తెలుసుకోగలరు."

"నేనా! పాతిక వేలు నీ దగ్గర నుంచి సహాయం పొందగలిగిన వ్యక్తి ఎవరు? అందులో ఫ్రెండ్ అంటున్నావు నువ్వు."

"మా యిద్దరి మధ్యా బంధుత్వం వున్నా నేను స్నేహానికే ప్రాధాన్యత యిచ్చాను. స్నేహితురాలిగానే యీ సహాయం చేస్తున్నాను."

నాన్నగార్కి క్రమంగా అర్థం అయి నట్టుంది. ఆయన ముఖం గంభీరంగా మారింది.

"ఎవరు? కృష్ణ సంగతేనా నువ్వు చెప్పేది?" అన్నారు.

"అవును. పాతిక వేలు యెందుకో మీరు వూహించగలరు."

"పొలం కొనటానికేనా?" అవు నన్నట్టు తలూపాను.

క్షణం సేపు నా వైపు రెప్పవాల్చ కుండా చూసిన ఆయన,తర్వాత వెనక్కి తిరిగి అద్దంలో చూసుకుంటూ పైగట్టుకో సాగారు. నేను ప్రాధేయపడుతున్నట్టుగా అడిగాను.

"నాన్నగారూ! కృష్ణ మీ మేనల్లుడు అన్న విషయం మర్చిపోండి. నా స్నేహి తుడిగా తలిచి యీ సహాయం చేయండి మీకు—మీకు కావాలంటే అతని తరపు నేను నోటు వ్రాసి యిస్తాను."

"ఏం? నువ్వు ఎందుకు యివ్వడం అతను యివ్వడా?"

"ఊహూ. అసలతనికి తెలియదు. నేన



యు :

మీ దగ్గర డబ్బు తీసుకుని మధుసూదనం పింతండ్రి దగ్గరకి వెళ్ళి ఆ పొలం కృష్ణ పేరిట రిజిష్టర్ చేయమని డబ్బిచ్చేస్తాను. కృష్ణ మీద వత్తిడి తగ్గుతుంది. అతను నిదానంగా మనకి తీరుస్తాడు. ఈ విషయం ముందు తెలిస్తే ఒప్పుకోడు. అందుకని తెలియకుండా జరిగిపోవాలి."

నాన్నగారు కట్టుకుంటున్న షైటు విప్పేసి పక్కనపడేసి వచ్చి మంచం మీద కూర్చున్నారు. ఆయన ముఖం ఎందుకో హఠాత్తుగా అలసటగా అయింది. నేను ఆయన వైపు ఆదుర్దాగా చూశాను. ఆయన వెంటనే సమాధానం చెప్పలేదు. ఇంతలో నౌకరు వచ్చి ఎవరో వచ్చారని చెప్పడంతో లేచి వెళ్ళిపోయారు. నేను ఆశ-నిరాశల మధ్య వూగిసలాడుతూ అలాగే చాలాసేపు నిలబడి పోయాను.

రెండు రోజులు గడిచినాయి.

నాన్నగార్ని సమయం దొరికి నప్పుడల్లా యీ విషయం గురించి సాధిస్తూనే వున్నాను.

ఒక్కోసారి ఎంతో సీరియస్‌గా, మేమిద్దరం యీ విషయం మాట్లాడుకుంటుండగా, అమ్మో, సారధో రావటం జరిగేది. టక్కున యీ సంభాషణ ఆపేయాల్సి వచ్చేది. నాకు కంపరంగా, ముళ్ళ మీద నిలుచున్నట్టుగా ఉండేది.

నాన్నగారు, నన్ను సీరియస్‌గా తీసుకున్నట్టుగానీ, నా మాటకి బొత్తిగా విలువ యిచ్చినట్టుకానీ కన్పించటంలేదు. నేను యీ ప్రసంగం ఎత్తినప్పుడల్లా, నిర్లక్ష్యంగా, విసుగ్గా, పట్టనట్టుగా మాట్లాడసాగారు.

"ఆః పోనిద్దూః మన డబ్బు ముట్టుకోనని వాడికి అంత పట్టుదల అయితే, బలవంతంగా మనం ఎందుకివ్వాలి? ఏం? నేను మేనమామని కాదా? కష్టం, సుఖం వచ్చి నాతో చెప్పుకోకూడదా? అంత నిర్లక్ష్యంగా వున్న మనుష్యులకి మనం అసలు సహాయం ఎందుకు చేయాలి? వాడి ఖర్మ వాడినే అనుభవించనీ. ఈ మధ్య మీ అమ్మతో యింట్లో కాస్త హాయిగా వుంది. దీనిమూలంగా నేను గొడవ తెచ్చుకోలేను."

నాన్నగారి ధోరణికి నేను విస్తుపోయాను. కృష్ణ అంటే, అంత అభిమానం, గౌరవం గల నాన్నగారేనా యీ మాట్లాడేది అన్పించసాగింది.

నాకు తెలుసుః అమ్మ నోటికి భయపడి, ధైర్యంలేక ఇలా కప్పదాటు వేస్తున్నారు.

ఆయన పిరికితనానికి నాకు యేవగింపు కలిగింది.

ఆ ఏవగింపుని వాడిమాటలతో ఆయనమీద విసరటానికి నేనేం జంకలేదు.

చివరికి, "మీలాటి పిరికి మనుష్యులని తండ్రిగా చెప్పుకోవటం నాకు సిగ్గుచేటు. మీలాటి వాళ్ళకి సంతానంగా పుట్టడం నా దురదృష్టం. యిది కృష్ణ పొలం సంగతి అయింది. రేపు నాకేదయినా

# కోకా-కోలా సాంగత్యం బ్రతుకే ఒకసారస్యం

ఆలోచనతో ఆడే ఆటలు అమిత వినోదం ! కోకా-కోలా చెంతన ఉంటే అంతులేనిదా అమర వినోదం ! ఉల్లాసం ఉత్తేజం కలిగించే సజీవమైన రుచి కోకా-కోలా రుచి. అందుకనే, త్రాగాలనిపిస్తుంది మళ్లీ మళ్లీ. త్రాగండి కోకా-కోలా-మళ్లీ కోకా-కోలా-మళ్లీ మళ్లీ కోకా-కోలా! ప్రపంచంలో నలుమూలలా, పెరిగిపోతోంది కోకా-కోలా త్రాగేవారి సంఖ్య రోజు రోజుకూ. కారణం : సేదదీర్చటంలో, కవివిని ఎరుగని కమ్మదనం, కోకా-కోలా కమ్మదనం !




కోకా-కోలా, కోకా-కోలా కంపెనీవారి రిజిస్టరు చేయబడిన ట్రేడ్‌మార్క్‌లు.

CMCC-13-162 TEL

ప్రాణావసరం వచ్చినా యింతే కదూ?" అనేసాను.

నాన్నగారు నా మాటలకి రోషపడ లేదు. ఆవేశపడలేదు. నోర్ముయ్యి అన లేదు. నవ్వి వూరు కున్నారు.

నా ఒంటినిండా కారం రాసుకున్నంత కంపరంగా అన్పించింది.

ఆ సంఘటన జరిగిన మర్నాడు కాబోలు, నాన్నగారు కోర్టునుంచి రాగానే నన్ను పిలిచి, "లాభంలేదు మీనా! ఆ పొలం ఎవరో కొనేసారుట" అన్నారు.

నేను నీళ్ళుకారి పోయాను! ఇది నా రెండో అపజయం! నేను అపజయం పొందానన్న బాధకంటే, కృష్ణకి ఆ పొలం దక్కలేదన్న బాధతో నా మనసు వికలం కాసాగింది.

తీరని ఆశాభంగం నాకు పిచ్చెక్కేలా చేసింది.

రోషంగా చూస్తూ, కావాలని, సాధ్య మైనంత కటువుగా అన్నాను.

"నిశ్చింతగా వుండండి. దాచుకోండి మీ డబ్బు. నేను. నేను చెబుతున్నాను. నాకు పెళ్ళయిన మరుక్షణం యీ ఇంట్లో కాలు పెట్టను. మీ డబ్బు ఒక్క పైసా కూడా ముట్టుకోను."

నా కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. గాయపడిన అభిమానంతో త ల దించు కుంటూ అన్నాను. "ఇన్నాళ్ళూ మీదగ్గర నాకేదో విలువవుందని, నా మాటని మీరు ఎంత కష్టమైనా తోసేయరని కలలు కన్నాను. మీలాటి తండ్రి ఎవరికీ వుండ రని గర్వపడ్డాను. నేను చాలా అదృష్ట వంతురాలినని మురిసిపోయాను. ఇదీ ఒకందుకు మంచిదే అయింది. ఈ విష యంవల్ల నా కళ్ళు తెరుచుకున్నాయి." ఏవో కాగితాలు చూసుకుంటున్న నాన్న గారు లేచి నా దగ్గరగా వచ్చారు.

"ఒకటి అడుగుతాను. సూటిగా సమాధానం చెబుతావా?" అన్నారు. నేను తలెత్తిచూశాను.

ఆయన కోర్టులో ముద్దాయిని క్రాస్ చేస్తున్నట్లుగా చూస్తూ అడిగారు.

"కృష్ణకి సహాయం చేయాలని నీ కెందుకు యింత తాపత్రయం? ఏమిటా ప్రత్యేకత?" నా ముఖం ఎర్రబడింది. ఆ గదిలో నుంచి తక్షణం వెళ్ళిపోవాలనిపిం చింది.అయినా ఎలాగో నిలబడి ధైర్యంగా జవాబు చెప్పాను.

"ఈ సహాయం కృష్ణ ఒక్కడికే కాదు. మొత్తం ఆ కుటుంబానికి. ఆ పొలంమీద వాళ్ళందరి భవిష్యత్తులూ ఆధారపడి వున్నాయి. ఆ కుటుంబంలో అత్తయ్య దగ్గర నుంచి చిన్నవాడయిన మధు వరకూ అందరూ నాకు సమానమే. ఆత్మీయులే!"

నాన్నగారు నన్ను నిశితంగా, నా మన సులో భావం చదవాలన్నట్టు చూశారు. చూడనీ! నాకేం భయం? నేను రెప్ప వాల్చకుండా చూశాను.

# మీరు కష్టపడి సంపాదించుకొన్న సొమ్ముకు సరియైన విలువగల సైకిల్ కొనదలచుకున్నారా? హెర్క్యులిస్



ప్రతీపైసాకూడ మీరు కష్టపడి చమటఊడ్చి సంపాదించుకున్నారు. మీరు కూడబెట్టిన అమూల్యమైన సొమ్మును సరియైన విలువగల సైకిల్ మీద పెట్టాలి కదా?

హెర్క్యులిస్‌ను కొనండి. దానికి మీరు ఆశించే అన్ని లక్షణాలువున్నాయి — బలిష్టత, సాఫీగా పోవడము, కచ్చితము, వేగము, మన్నిక.

అది సహజమే.

హెర్క్యులిస్ — ఆగ్నేయ ఆశియాలో అన్ని సౌకర్యాలు గల పెద్ద ఫ్యాక్టరీలో నిర్మించబడింది. కలకాలం మీ జీవితమంతా మీకు సేవజేస్తుంది. భారతదేశమంతటా 3,000,000 మంది హెర్క్యులిస్‌నే విశ్వసించేవారిలాగే మీరు హెర్క్యులిస్‌ను విశ్వసించవచ్చు.

హెర్క్యులిస్ ఒక్క సైకిలేకాదు- మీ జీవిత కాలపు **నేస్తము.**

భారతదేశములో తయారుచేయువారు: టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు, మద్రాసు-53.

ప్రొప్రైటర్లు: ట్యూబ్ ఇన్‌వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ అనుమతిని పొందినవారు.

* రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కు -
ది హెర్క్యులిస్ సైకిల్స్ & మోటార్ కో., లిమిటెడ్ యు. కె. వారిది.







TIC-H-5422

**"చిన్న కుటుంబమే - సుఖవంతమైన కుటుంబం"**

"అంతేనంటావు? కృష్ణ మీద యింకె లాటి ప్రత్యేకమైన అభిమానం లేదంటావు?"

"లేదు. లేదు. సరేనా?" అసహనంగా అన్నాను. నాన్నగారు ఏమనుకున్నారో ఏమో! చేతిలో వున్న కాగితాలని, "యివి చూడు ఒకసారి!" అంటూ నా చేతులో పెట్టారు.

అవేవో దస్తావేజుల్లా వ్రాసుకున్న స్టాంపులు. ఏదో కొనటమో, అమ్మటమో జరిగిన ఖరారునామా! నేను చదివాను! ఒక్క-క్షణం నా గుండెలు కొట్టుకోవటం ఆగిపోయినాయి.

మరుక్షణంలో రెట్టింపు వేగంతో కొట్టుకోవడం ప్రారంభించినాయి.

ఆ కాగితాలు ఏమిటో తెలుసా? పొలం క్రిష్ణ పేరిట రిజిష్టర్ అయిన దస్తావేజు!

ఒకటికి రెండు మూడుసార్లు, గబగబా చదివాను.

నేను సంభ్రమాశ్చర్యాలతో తలెత్తి చూసేసరికి నాన్నగారు అక్కడ లేరు. దూరంగా టేబిల్ దగ్గరికి వెళ్ళి నిలబడి వున్నారు.

ఆయన కళ్ళు నా ముఖంలో ఆనందాశ్చర్యాలని జాగ్రత్తగా పరిశీలిస్తున్నట్టుగా చూస్తున్నాయి.

"నాన్నగారూ—" ఎన్నో చెప్పాలనిపించింది. కానీ ఒక్కమాట కూడా నోట్లోంచి పెగిలిరాలేదు.

నేను చప్పున వెళ్ళి ఆయన పాదాలకి

# ట్విన్ సిటీ గ్యాస్ కం.

(కోసాన్ గ్యాస్ కంపెనీవారి ఏజంట్లు)

62-బి, సర్దార్ పటేల్ రోడ్, సికింద్రాబాదు-3 ఫోన్ : 76600




* ఎస్సో గ్యాస్ తో
వంట త్వరగా అవుతుంది

* ప్రతి సిలెండరుకూ
ప్రపంచ ఖ్యాతిగాంచిన
కోసాన్ సేఫ్టీకాప్ అమర్చబడింది.

బ్రాంచీలు :

4-1-881/7, తిలక్ రోడ్డు
ఆబిడ్సు, హైదరాబాదు-1
ఫోన్ : 42586

గుజరాత్ సేవామండల్ బిల్డింగ్,
రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు-3
ఫోన్ : 72304

కింగ్స్‌వే (రైల్వే బ్రిడ్జి దగ్గర)
ఫోన్ : 76266

భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్
రామచంద్రాపురం, హైదరాబాదు.

చాదర్ ఘాట్ : కమల్ టాకీస్ దగ్గర్లో ఫోన్ : 52400

అఫ్జల్ గంజ్ : శంకర్ షేర్ హోటల్ ఎదురుగా ఫోన్ : 42629

నమస్కరించబోయాను. ఆయన నేను పాంతం వంగకముందే భుజాలు పట్టి లేవదీశారు.

"నాన్నగారూ" పశ్చాత్తాపంతో, క్షమని అర్థిస్తున్నట్టుగా చూశాను.

ఆయన కళ్ళు ఎందుకో చూస్తూండగానే, విషాదంగా మారిపోయినాయి. నా తలని దగ్గరకి తీసుకుని నిమురుతూ అన్నారు.

"నేను ఎలా చేయాలా అని సతమతమవుతున్న పనికి నువ్వు అనుకోకుండా సులభమైన పరిష్కారం చూపావు, మీనా. నాకీ ఆలోచనే రాలేదు. నేనే నీకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి. ఇన్నాళ్ళకి వాళ్ళకి వుపయోగపడే ఒక మంచి పని చేశానన్న తృప్తి నాకు లభిస్తోంది." డగ్గుత్తికతో అన్నారాయన.

నాన్నగారు, ఆ కాగితాలు జాగ్రత్తగా దాచారు.

ఆరోజు నేను పొందిన సంతోషం అంతాయింతాకాదు. నేను అనుకున్నది సాధించాను! ఆ విజయగర్వం నా నరనరంలో చక్కిలిగింతలు పెట్టి, డాన్స్ చేయాలన్నంత వుత్సాహం ఇవ్వసాగింది.

ఆనందం పట్టలేని నేను, నా గదిలో చేతులు జాచి గిరగిరా తిరగసాగాను.

"అమ్మాయిగారూ! మీరు కాఫీ తాగలేదు." తాయారమ్మ గదిలోకి తొంగి చూస్తూ అంది. నేను ఆవిడ దగ్గరకి వెళ్ళాను. ఆవిడ చెయ్యిపట్టి గదిలోకి లాగి గిరగిరా తిరుగుతూ ఆవిడని తిప్పసాగాను.

"అయ్యో అయ్యో. యిదేమిటండీ. నా కసలే కీళ్ళవాతం. వదలండి. వదలండీ బాబూ!" తాయారమ్మ కేకలు పెట్టసాగింది. పకపకలాడుతూ నవ్వుతున్న నేను వదలలేదు.

అమ్మ అప్పుడే పైకి వస్తున్నట్టుంది. "ఏమిటది? ఏమైంది?" అంటూ ఖంగారుగా లోపలకి వచ్చింది. ఆవిడ వెనక మిసెస్ లింగం కూడా వుంది.

అమ్మని చూడగానే నేను టక్కున ఆగిపోయాను.

తాయారమ్మ ఆయాసపడుతూ ఆగి, "అమ్మాయిగారు, ఇవాళ ఎందుకో చాలా సంతోషంగా వున్నారు." అంది నడుం సరిచేసుకుంటూ. అమ్మ నావైపు చూసింది.

"ఏమిటా చిన్నపిల్ల చేష్టలు మరీను." అంది కళ్ళతోనే మందలిస్తూ. నేను తల దించుకున్నాను.

అమ్మ దర్శనంతో సంతోషపు పొంగు హఠాత్తుగా నీళ్ళు చల్లినట్టుగా తగ్గిపోయింది.

నేను ఎప్పటి మీనాని అయిపోయాను.

* * *

రాజేశ్వరి పెళ్ళి దగ్గరకు వస్తోంది.

నా కెందుకో ఒక్కసారి నిమ్మలూరు వెళ్ళి వాళ్ళందరినీ చూసి రావాలని మరీ మరీ అనిపిస్తోంది.

ఒక విధంగా చూస్తే రాజేశ్వరి, మరో విధంగా చూస్తే నేనూ యిద్దరం ఓడిపోయాం.

రాజు వాళ్ళ అన్నయ్యకి ఎదురు తిరుగుతానని అంది. తిరగలేకపోయింది. నేను ఎలాగైనా యీ పెళ్ళి ముడిపడ నివ్వను అన్నాను. కానీ ఏం చేయలేక పోయాను.

రాజు ఆఖరిక్షణంలో తన అభిప్రాయం ఎందుకు మార్చుకోవాల్సి వచ్చిందో నాకు వివరించాలని తహతహలాడుతున్నట్లే, నేను కూడా దాని పెళ్ళి ఆపుచేయా లన్న నా ప్రయత్నాన్ని ఆచరణలో ఎందుకు పెట్టలేకపోయానో దానికి విశదీకరించి చెప్పాలని తపిస్తున్నాను.

సారధితో నాకు వివాహం ముడిపడితే యిక ఆ వూరు గానీ, ఆ మనుష్యుల ప్రసక్తిగానీ ఎత్తే అవకాశం నాకు ఉండనే ఉండదు.

అంతే గాదు.

నేను నిమ్మలూరు వెళ్లాలని గట్టిగా అనుకోటానికి యింకో బలమైన కారణం కూడా వుంది.

కృష్ణ పేరు మీద రిజిష్టర్ అయిన ఆ పొలం కాగితాలు నా చేతులతో నేను స్వయంగా అతనికి అందించాలి.

ఆ అందించేటప్పుడు 'చూడు మా డబ్బు ముట్టుకో నన్నావుగా! యిప్పుడేం చేస్తావు?' అన్నట్టు గర్వంగా అతని కళ్ళలోకి చూడాలి.

నేను యిచ్చిన కాగితాలు చూసి, అందులో వున్న విషయం ఏమిటో గ్రహించగానే, అతని ముఖంలో రంగులు యెలా మారుతాయో స్వయంగా చూడాలనే కుతూహలం నన్ను నిమ్మలూరు ప్రయాణానికి మరీ మరీ కవ్వించ సాగింది.

ఇన్ని విషయాలు దృష్టిలో పెట్టుకుని, ఒక్కసారి, ఆఖరుసారి నిమ్మలూరు వెళ్ళి రావాలని దృఢంగా నిశ్చయించుకున్న నేను మెల్లగా నాన్నగారి దగ్గర రాజు పెళ్ళి సంగతి ఎత్తాను.

"నాన్నగారూ! రాజు పెళ్ళికి మనం యెవరూ వెళ్ళకపోతే ఏం బాగుంటుం దండీ?"

పేపరు చూసుకుంటోన్న ఆయన మళ్ళీ నేనేదో ఆయన ప్రాణంమీదికి తెస్తున్నట్టు చూశారు.

"ఎందుకు బాగుండదు? మన రెండు కుటుంబాల మధ్య రాకపోకలు లేవని అందరికీ తెలుసు." అన్నారు.

"అది యిదివరకు సంగతి. మొన్న నేను వెళ్ళి వచ్చిన తర్వాత ఆ పరిస్థితులు మారాయి కదా?"

నాన్నగారు క్షణం సేపు నా వైపు దీర్ఘంగా చూశారు.

కళ్ళ జోడు సరిచేసుకుంటూ, "నీ మన సులో వున్న అసలు సంగతేమిటో చెప్పేయి" అన్నారు.

"మీరు రాజు పెళ్ళికి వెళ్ళండి."

"నేనా?"

"అవును."

నాన్నగారికి యీ మధ్య పనుల వత్తిడి

చాలా ఎక్కువగా వుంది. ఆయనకి తీర దని నాకు బాగా తెలుసు.

"నేమ వెళ్ళను" అన్నారు.

"ఎందుకని? ఒక్క రెండు రోజులే గదండి."

"లేదు మీనా, ఒక్క రెండు రోజులు కాదు రెండు క్షణాలు కూడా నే నా ఇంటి గుమ్మం యెక్కను. నే నా యింటికి జన్మలో వెళ్ళనని నీ మీద ఒట్టు వేయించి మీ అమ్మ మాట తీసుకుంది." నిట్టూర్పు విడుస్తూ అన్నారాయన.

నేను కొత్త విషయం వింటున్నట్లు చూశాను.

"మీ అమ్మకి ఏ రోజున ఆ మాట యిచ్చానో ఆ రోజునే నేను వాళ్ళకి చచ్చిపోయిన వాళ్ళతో సమానం అయాను. ఒక్కోసారి ఎంత వద్దనుకున్నా గుండెలు పిండుతున్నట్టుంటూంది. ఇక్కడ రెండు చేతులా నేను యింత సంపాయిస్తున్నాను. ఇంత సుఖం అనుభవిస్తున్నాను. అక్కడ అది పిల్లలతో ఎంత అవస్థపడుతోందో! అని క్షణ క్షణం గుర్తుకొచ్చేది. ఇంకా నయం. అది చాలా అదృష్టవంతురాలు కాబట్టి సవతికొడుకు అయినా వాడు

చిన్నప్పటి నుంచి యింటి భారం అంతా నెత్తిన వేసుకున్నాడు. కళ్లారా ఒక్కసారి కమలాన్ని, పిల్లలిని చూసుకోటానికి కూడా కాకుండా పోయింది నాకు.''

నాన్నగారి మాటల్లో ప్రతిధ్వనిస్తూన్న ఆవేదనకి నా గుండెలు కలచినట్టయింది. ఆయన్ని అనునయంగా ఎలా స్వాంతన పరచాలో తెలియని నేను క్షణం సేపు అలాగే నిలబడిపోయాను.

ఆయన ఆ ప్రసంగం అంతటితో అయిపోయినట్టుగా,మళ్ళీ పేపరు చూసుకోసాగారు. నేను గదిలో అటూ యిటూ చూశాను.

నా దృష్టి డ్రెస్సింగ్ టేబిల్ మీద వున్న దువ్వెన మీద నిల్చింది.

నాకు పధ్నాలుగు, పదిహేను యేళ్ళు వచ్చేవరకు నాన్నగారికి తల దువ్వడం సరదాగా ఉండేది.

ఆయనది అసలే బట్టతల. జుట్టు చాలా తక్కువగా వుంటుంది. నేను దువ్వుతానంటే, వద్దని బ్రతిమలాడేవారు. నేను బలవంతంగా దువ్వేదాన్ని. ఇది మా యిద్దరి మధ్యా ఒక ఆటగా వుండేది.

ఒక్కోసారి ఆయనకు మంట పుట్టి, ''నా తల్లిగా, మా అమ్మగా,నీకేం కావాలో చెప్పు యిస్తాను. ఆ దువ్వెన మాత్రం పక్కన పెట్టు'' అనేవారు.

నేను కావాలనుకున్న లిస్ట్ అంతా ఏకరువు పెట్టేదాన్ని.

ఈ మధ్య నాన్నగారు మరీ బిజీ అయిపోవటంతో, నేను పెద్దదాన్ని అవటంతో, యీ ఆట కాస్త మర్చిపోయినట్టయింది.

నాన్నగారు పేపరు చూసుకుంటున్నారు.

నేను వెళ్ళి దువ్వెన తెచ్చాను.

నేను ఆయన కుర్చీ వెనక నిలబడి తలదువ్వసాగాను.

''లాభంలేదు మీనా. నేను వెళ్ళను నిమ్మలూరు.'' అన్నారాయన.

''పోనీ నేను వెడతాను.''

''నువ్వా?''

''అవును. ఏం? మనిద్దరంలో ఎవరైనాఒకటే. నేను వెళితే అత్తయ్యా, రాజు ఎంతో సంతోషిస్తారు. వూళ్ళో వాళ్ళు కూడా ముచ్చటపడ్తారు.''

''నువ్వెలా వెళ్తావు?'' విస్మయంగా అడిగారాయన తలెత్తి చూస్తూ.

''మీరు పంపివ్వదలుచుకుంటే, మార్గం అదే దొరకుతుంది.''

ఆయన చేతిలో వున్న పేపరు తీసి విసురుగా పక్కన పడేసారు.

''ఇదుగో! నువ్వు ఎప్పుడో మీ అమ్మకీ నాకూ పెద్ద పోట్లాట తెచ్చిపెట్టేలా వున్నావు'' అన్నారు. (సశేషం)

Printed at Kranti Press, 12, Francis Joseph Street, Madras-1, by D. H. Rao, and Published by him for Yuva Publications, Madras-26.
Controlling Editor : Sri "CHAKRAPANI"

# తీవ్రమైన బెణుకునొప్పి నిమిషాలలో పోయింది!



# అమృతాంజనం

## ప్రభావం వల్లన్!




బెణుకులు, జలుబులు, తలనొప్పి, కండరాలనొప్పి— వీటిని చప్పున చల్లగా తగ్గించుకోండి. బాధగా ఉన్న చోటు మీద అమృతాంజనం రాయండి. వెంటనే గుణం ఇస్తుంది. 75 సంవత్సరాలపైగా ఇంటింటి దీపమై వెలుగుతోంది అమృతాంజనం! ఎప్పుడూ ఒక సీసా దగ్గిర ఉంచుకోండి. అమృతాంజనం ఆదాచేసే పెద్ద సీసాలలోనూ, చిన్న డబ్బాలలోనూకూడా దొరుకుతోంది.

అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది.

నొప్పులను, జలుబులను చప్పున, చల్లగా తగ్గిస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్:

మదరాసు - బొంబాయి - కలకత్తా - న్యూ ఢిల్లీ - హైదరాబాదు - బెంగళూరు

AM-5338




రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్
ధర్మదాత
నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తి
దర్శకత్వం: ఎ.సంజీవి
సంగీతం: టి.వి.చలపతిరావు
కెమెరా: యస్.వెంకటరత్నం
ఆంధ్రప్రదేశ్:
లక్ష్మీఫిలింస్
మైసూరు:
వాశోఫిలిం డిస్ట్రిబ్యూటర్స్
ఒరిస్సా:
విఘ్నేశ్వర పిక్చర్స్









LAKSHMI

